# ప్రాచీన దేవతామూర్తుల లక్షణ పరిణామములు

రచన:

డా॥ కార్తికేయ శర్మ
మరియు
ఇంగువ వెంకటేశ్వర శర్మ

పరిచయము:

శ్రీ నేలనూతల శ్రీకృష్ణమూర్తి
అడ్వకేటు.
మూలాపేట, నెల్లూరు.

# విషయ సూచిక

## చిత్రపటములు (11)

1. ప్రాచీన భారతదేశము
2. దేవతల మధుర
3. పెద్దవేగి, యేకాదశ ముఖ రుద్రుడు
4. శ్రీశైల ప్రాంతముల జలాశయమున మునిగిన దేవాలయ స్థానములు
5. సంగమేశ్వరాలయము కూడలి
6. కూడలి 1978-79, ఖండిక
7. సంగమేశ్వరాలయము : ఉపానము
8. సంగమేశ్వరాలయము - ఖండిక శిఖరము, క్రింద పునాదులు
9. సంగమేశ్వరాలయము, కూడలి మరకత లింగము
10. పాపనాశి దేవాలయ సముదాయము
11. పాపనాశి ఆలయముల గ్రీవ శిఖరము లందు లభించిన వాస్తు కలశములు

## ఛాయా చిత్రములు (85)

1. లూరిస్తాన్ : వినాయకుడు - క్రీ. పూ. 12 వ శతాబ్ది
2. తేర్, ఓస్మానాబాదుజిల్లా, వినాయక ప్రతిమలు - క్రీ. శ 2 వ శతాబ్ది
3. అమరావతి : ఉష్ణీష ఫలకము, మాలావాహకుడుగా వినాయకుడు తదితర దేవతలు - క్రీ. పూ. 2 వ శతాబ్ది
4. అమరావతి : ఉష్ణీషము, వినాయకుడు, వైనాయకి
5. అమరావతి : ఉష్ణీషము, వైనాయకి, కుబేరుడు
6. అమరావతి : ఉష్ణీషము, లక్ష్మీదేవి
7. ఎ) పెద్దవేగి : కాల్చిన మట్టి వినాయక ప్రతిమలు-క్రీ. శ. 5 వ శతాబ్ది
   బి) పెద్దవేగి : వినాయకుడు
8. చేజెర్ల : దంతిముఖ స్వామి, క్రీ. శ. 5 వ శతాబ్ది
9. పితికాయగుల్ల : వినాయకుడు, క్రీ. శ. 7 వ శతాబ్ది
10. పెద్దవేగి : వినాయకుడు, క్రీ. శ. 9 వ శతాబ్ది
11. గుడిమల్లం : గుహ్యుడు, క్రీ. పూ. 3 వ శతాబ్ది
12. బార్హూత : వేదిక స్తంభముపై గుహ్యుడు, క్రీ. పూ. 3 వ శతాబ్ది
13. బార్హూత : వేదిక స్తంభముపై కుపిరయక్ష, క్రీ. పూ. 3 వ శతాబ్ది
14. బార్హూత : వేదిక ఖంభము, గణము. క్రీ. పూ. 3 వ శతాబ్ది
15. ధూలికట్ట : యక్ష - క్రీ. పూ. 2 వ శతాబ్ది
16. గుడిమల్లము : సవేదిక లింగము, క్రీ. పూ. 3 వ శతాబ్ది
17. ఎ) గుడిమల్లము : లింగాగ్రముపై రుద్రయజమాన క్రీ. పూ. 3 వ శతాబ్ది
17. బి) గుడిమల్లము : పీఠములు, గుహ్యుని పాదముల రూపము - క్రీ. పూ. 3 వ శతాబ్ది
18. ఎ) గుడిమల్లము : వెండి నాణెము, క్రీ. పూ. 3 వ శతాబ్ది

18. బి) ఉజ్జయిని : నాణెములపై లింగము, వృక్ష చైత్యము -
క్రీ. పూ. 3 వ శతాబ్ది
19. గుడిమల్లము : మేక, పంది యొముకలు, క్రీ. పూ. 3 వ శతాబ్ది
20. మధుర : శివలింగము చుట్టును వేదిక, పైన వృక్షము
క్రీ. పూ. 1 వ శతాబ్ది
21. ఎ) అమరావతి : చతుర్ముఖలింగము, తత్పురుష - క్రీ. శ. 2 వ శతాబ్ది
21. బి) అఘోర, క్రీ. శ. 2 వ శతాబ్ది
22. ఎ) అమరావతి : చతుర్ముఖలింగము, సద్యోజాత
22. బి) వామదేవ ; క్రీ. శ. 2 వ శతాబ్ది
23. అమరావతి : నంది, క్రీ. శ. 2వ శతాబ్ది
24. ఎ) మానసార : శివ, క్రీ. శ. 4-5 వ శతాబ్ది
24. బి) మానసార : శివ, వామాభాగము, శిరోలంకరణ, క్రీ. శ. 4-5 వ శతాబ్ది
24. సి) మానసార : శివ, కుడిభాగము, శిరోజాలంకరణ
25. మాంఢాల్ శివ ప్రతిమ, వాకాటక కృతము, క్రీ. శ. 4-5 వ శతాబ్ది
26. పారెల్ : సప్తస్వర సుందరశివ, క్రీ. శ. 6 వ శతాబ్ది
27. ఎ) పెద్దవేగి : సోమాయ క్రీ. శ. 5 వ శతాబ్ది
27. బి) అరలగుప్పె: సోమాయ క్రీ. శ. 8 వ శతాబ్ది
28. పెద్దవేగి : ఏకాదశ ముఖరుద్రుడు, క్రీ. శ. 6:7 వ శతాబ్ది
29. ఎ) పంచ లింగములు క్రీ. శ. 5 వ శతాబ్ది
29. బి) పెద్దవేగి : నాగదేవత క్రీ. శ. 5 వ శతాబ్ది
29. సి) పెద్దవేగి : కాలభైరవుడు క్రీ. శ. 6-7 వ శతాబ్ది
30. పెద్దవేగి : వేంగీపుర దేవత, కోట శిధిలములు
31. కీసరగుట్ట : ఇటుక దేవాలయములు, క్రీ. శ. 5 వ శతాబ్ది
32. కీసరగుట్ట : కొండపైన లింగ పీఠములు, క్రీ. శ. 5 వ శతాబ్ది
33. మధుర : యక్షుడు లింగపీఠమునకు, దీపమిడుట క్రీ. శ. 5 వ శతాబ్ది
34. కీసరగుట్ట : శక్తి ఫలకము క్రీ. శ. 5 వ శతాబ్ది
35. కీసరగుట్ట : మట్టితో చేసిన వాస్తు కలశము, క్రి. శ. 5 వ శతాబ్ది
తూర్పు ముఖము
36. ఎ) కీసరగుట్ట : మృణ్మయ కలశము, ఆగ్నేయ ముఖము.
క్రీ. శ. 5 వ శతాబ్ది
36. బి) కీసరగుట్ట : మృణ్మయ కలశము, క్రీ. శ. 5 వ శతాబ్ది దక్షిణముఖము
37. ఎ) కీసరగుట్ట : మృణ్మయ కలశము, క్రీ. శ. 5 వ శతాబ్ది పశ్చిమముఖము
37. బి) కీసరగుట్ట : మృణ్మయ కలశము, క్రీ. శ. 5 వ శతాబ్ది ఉత్తరముఖము
38. మధుర : సోంఘ్, గజపృష్ఠాకార దేవాలయము, క్రీ. శ 1 వ శతాబ్ది
39. మధుర : వేదిక స్తంభములపై యక్షిణిలు, క్రీ. శ. 1-2 వ శతాబ్ది
40. మధుర : కార్తికేయ స్వామి క్రీ. శ. 3 వ శతాబ్ది

41. మధుర : దేవతలు క్రీ. శ. 3 వ శతాబ్ది
42. మధుర : హరిహరుడు క్రీ. శ. 2 వ శతాబ్ది
43. పెద్దవేగి : హరిహరుడు క్రీ. శ. 5 వ శతాబ్ది
44. బాదామి : హరిహరుడు క్రీ. శ. 7 వ శతాబ్ది
45. బాదామి : హరిహరుడు క్రీ. శ. 7 వ శతాబ్ది
46. భైరవకొండ ; హరిహరుడు క్రీ. శ. 7 వ శతాబ్ది
47. కూడవల్లి : హరిహరుడు క్రీ. శ. 8 వ శతాబ్ది
48. మహాబలిపురం ; ధర్మరాజరథము, హరిహరుడు క్రీ. శ. 7 వ శతాబ్ది
49. ఎ) నాగార్జునకొండ : కార్తికేయ క్రీ. శ. 3 వ శతాబ్ది
49. బి) నాగార్జునకొండ : కార్తికేయ వెనుకభాగము
50. నాగార్జునకొండ : దేవసేన క్రీ. శ. 3 వ శతాబ్ది
51. నాగార్జునకొండ : కార్తికేయ కాంస్య విగ్రహము క్రీ. శ. 3 వ శతాబ్ది
52. నాగార్జునకొండ : కార్తికేయ క్రీ. శ. 3-4 వ శతాబ్ది
53. చేజర్ల : కార్తికేయ క్రీ. శ. 4 వ శతాబ్ది
54. అలంపురము : కార్తికేయ క్రీ. శ. 7 వ శతాబ్ది
55. చైనా : డాటూంగ్ గుహ-8. కార్తికేయ క్రీ. శ. 465-494
56. చైనా : డాటూంగ్ గుహ-8. మహేశ్వరుడు క్రీ. శ. 465-494
57. గోవిందరావుపేట : వరాహ విష్ణు క్రీ. శ. 4 వ శతాబ్ది
58. ఎ) గోవిందరావుపేట : వరాహ భూదేవి, క్రీ. శ. 4 వ శతాబ్ది
58. బి) గోవిందరావుపేట : వరాహ శేషనాగము, క్రీ. శ. 4 వ శతాబ్ది
59. ఎ) గోవిందరావుపేట : నరసింహా, క్రీ. శ. 4 వ శతాబ్ది
59. బి) గోవిందరావుపేట : నరసింహా, క్రీ. శ. 4 వ శతాబ్ది
61. కూడలి ; సంగమేశ్వరాలయము : నదుల సంగమము
62. కూడలి : సంగమేశ్వరాలయము : ఆలయ కండిక (దక్షిణ ముఖము)
63. కూడలి : సంగమేశ్వరాలయము: ఆలంపురమున పునర్నిర్మిత మగుచున్నతీరు: శిఖర నిర్మాణము.
64. కూడలి : సంగమేశ్వరాలయము : పునర్నిర్మితములో నున్న శిఖరము : ఆమలకముపై దృశ్యము
65. కూడలి : సంగమేశ్వరాలయము : పునర్నిర్మితమైన ఆలయం ; సంపూర్ణ దృశ్యము.
66. కూడలి : సంగమేశ్వరాలయము : పునాదులందు లభించిన మరకత లింగము
67. పాపనాశి : ఆలయము - ఎఫ్
68. పాపనాశి : దేవాలయము - ఎఫ్ : శిఖర భాగము తీసిన దృశ్యము
69. పాపనాశి : దేవాలయము - ఎఫ్ ; గృహపిండి మధ్యగా స్థాపితమైన కలశము.
70. పాపనాశి : ఆలయముల లభించిన కలశములు

ఓం

# ప్రాచీన దేవతామూర్తులు - లక్షణ పరిణామములు

## తొలి పలుకు

దేవతామూర్తులు భారతీయ వైదిక - పౌరాణిక మత సంస్కృతి సాంప్రదాయములకు ప్రతిబింబములు. ఆధార గ్రంధములు. ఈ మూర్తులు శిల్ప శైలీ-చరిత్రలకే గాక, దేవతా లక్షణ పరిణామముల తెలుపు నిర్దిష్టమైన కృతులు. విశిష్టమైన హిందూ మత చరిత్ర కాధారములు.

ఈ దేవతల గూర్చి అధ్యయనము చేయుట పూర్వజన్మ ఫలము. అనాదిగా యీ మహత్తర పుణ్యభారతమున కొందరు వుత్తమసాధకులు చేసిన జ్ఞానోపార్జన, శ్రద్ధాభక్తి ఫలము, తమ వారసులకుగా సంక్రమింపజేశిన ధనమిది. ఈ వ్యాసమాలలో ప్రాచీనముగా చేయబడిన మూర్తులలో కొన్నింటిని మాత్రమే పేర్కొనగలిగితిమి. ఇందు మాకు తెలిసినది మరియు తెల్పినది కొద్ది. సాగరతుల్యమైన ఈ భగవద్రూపముల చరిత్ర-సంస్కృతుల నభ్యసించవలెనన్న పలు తరములనిదే జన్మయెత్తి సంస్కారిగా బ్రదుకవలె! ఇది అసాధ్యమైనందున మేమెరిగిన వాటిని గురించి తెలియ జెప్పుటకు ధైర్యము చేసితిమి. లోపములను విద్వజ్జనులు క్షమించి, తెలియ జేతురుగాక!

మాకీ ప్రేరణ, అనుభూతిని, గలిగించినది రెండు సంస్థలు. మొదటిది భారతీయ పురావస్తుశాఖ. రెండవ తెలుగున వెలువడు నొకే ఒక సాహిత్య మాసపత్రిక భారతి. మొదటి సంస్థ మా జనని వంటిది. రమణీయమైన వృత్తి నిచ్చి మాకు పూర్వాపరముల ధన్యుని చేసినదీ సంస్థ. మా భారతీయ పురావస్తు శాఖ కు మ్మ రిం చిన సదవకాశముల వృష్టికి తట్టుకోగలిగిన విజ్ఞత మాలో లేదు. ఇక భారతి సంస్థ నిర్వాహకులైన శ్రీ శివలెంక రాధాకృష్ణగారు యెంతటి ప్రయాసతోనో, ధన నష్టమైనను సాహిత్య పత్రికను నడిపి, మావంటి వారికి చేయూతనిచ్చి ప్రోత్సహించుటయే గాక పారితోషికము లందజేసిరి. మొట్టమొదటగా భారతి మాసపత్రికలో వ్యాసములు - 2, 3, 4, 5, 7, 8, 9 మరియు 12 ప్రచురితములైనవి. అట్లే వ్యాసము - 10 ఆంధ్ర పత్రిక కాళయుక్తి నామసంవత్సర సంచిక (ఏప్రిల్ 1978) లోను, వ్యాసము - 14 ఆంధ్రపత్రిక దినపత్రిక (31 మార్చి నుండి 31 మే 1976) లలోను ప్రచురితములు. కాలానుసరంగా కొన్ని మార్పులు, చేర్పులు చేసి, కొన్నింటిని తిరుగ వ్రాసితిమి. ఇందు చేర్చిన ఛాయాచిత్రములు, రేఖాచిత్రములు మా పురావస్తుశాఖ, మహానిర్దేశకుని సౌజన్యముతో ప్రచురితములు.

ఈ వ్యాసముల ముఖ్యముగ ఆంధ్రదేశమున లభ్యమైన శైవ-వైష్ణవ తదనుబంధిత దైవప్రతిమల గూర్చి చర్చింతిమి. ఈ ప్రయోగమున యితర ప్రాంతముల లభించిన మూర్తి శిల్పములను సందర్భోచితముగ ప్రస్తావించితిమి. కారణము, ఆగమ - వాస్తు కళా శాస్త్రములు ప్రాచీన భారతదేశమున సిద్ధాంతపరముగా నొకే రీతిని వ్యాప్తిజెందుటయే.

ఈ దేవతామూర్తుల స్వరూపములు - లక్షణములు చాల వరకు వేదాంతర్గతములే. పురాణకాలమున పలు రీతుల వృద్ధిజెంది మానవరూపములను సంతరించుకొనుటయే గాక, జీవనవిధుల, నిత్యసంస్కారముల, వేషభూషణాదుల మానవునికి చేరువయ్యెను. భక్తిమార్గము ప్రబలి నిత్యాభిషేక - అర్ఘ్య, అర్చనా విధులతో యీ మానవస్వరూపదేవతలు ముక్తిమార్గమునకు సోపానములయ్యెను.

ఇదివరలో నిరువురు విద్వాంసులు ఆంగ్లమున నీ హిందూ దేవతలపై చక్కని ఆధారగ్రంధములు వ్రాశిరి. మొదటి గ్రంధము నాలుగు సంపుటములు 1914 - 1916 లలో తిరువనంతపురము రాజావారి సాయముతో ప్రచురింపబడెను. ఈ గ్రంథము "ఎలిమెంట్స్ ఆఫ్ హిందూ ఐకోనాగ్రఫీ". సంపుటిలు 1, 11 (నాల్గు భాగములు) హిందూ

దేవతలపై పూర్తిగా అప్పటివరకు లభ్యమయిన వాటిపై, ముఖ్యముగ దక్షిణదేశపు, దేవాలయ శిల్పముల, కంచు విగ్రహముల గూర్చి విశదీకరించెను. ఆ తరువాత కలకత్తా విశ్వవిద్యాలయాచార్యులు శ్రీ జితేంద్రనాధ బెనర్జీ "ది డెవలప్‌మెంటు ఆఫ్ హిందూ ఐకానాగ్రఫీ'' యను పుద్గ్రంధమును 1941 లో వ్రాసెను. ప్రస్తుత మీ గ్రంధము మూడవ ప్రచురణ 1976 లో వెలికి వచ్చినది.

పై యాధార గ్రంధమున శ్రీ గోపీనాధరావు గారు హిందూ దేవతల గూర్చి లక్షణములతో సహా వరుసక్రమమున, తాను చూచిన దేవాలయముల, తదితర చోట్లనున్న వాటిని వివరించెను. కొన్ని శైవాగమముల పాఠముల గూడ (ప్రతిమా లక్షణములు, చూడుడు సంపుటి 1, భాగము-11, ) విపులీకరించెను, శ్రీ జితేంద్రనాధ బెనర్జీ, గోపీనాధరావు గారి మూలగ్రంధమును యాధారముగా చేసుకొని, ఒక్క శిలా విగ్రహములనే గాక, మూర్తిశిల్పములున్న నాణెములను, నిక్కాలను, మట్టి వస్తువులను గూడ సేకరించి, దేవతామూర్తుల లక్షణయుక్తంగాను, కాలానుగుణ మార్పు-కూర్పులను తమ గ్రంధమున విపులీకరించిరి. పై రెండు రచనలు యీ నాటికినీ ఆధారగ్రంధములే.

మేమీ చిన్న ప్రయోగములో మూర్తి లక్షణములనే గాక, పరిణామములను చారిత్రక యుగములతో కాలానుసారముగ పేర్కొంటిమి. ఆయా కాలమున యాచారములో నున్న ఆగమ - వాస్తు కళా విన్యాసములను గ్రహించి (చూడుడు ముఖ్యముగా వ్యాసము - 9) మరియు 14 దేవతా ప్రతిష్ఠ విధులను మతశాఖల పరిణామముతో సమన్వయించితిమి. పరిచయము వ్రాసిన శ్రీ నేలనూతల శ్రీ కృష్ణమూర్తిగార్కి వారి ధర్మపత్ని శ్రీమతి పార్వతమ్మగార్కి మా వందనములు.

ఈ ప్రయత్నమున కొన్ని లోపము లుండవచ్చును. భారతీయ మూర్తి శిల్పముల చరిత్ర - లక్షణ పరిణామములను ఉపాసించగోరు సుజనులకీ గ్రంధము కొంతైనా మార్గదర్శకమైన మాకు సంతోషమే ఈ గ్రంధమును శ్రమ కోర్చి ప్రచురించిన మా ప్రియమిత్రులు, నవయుగం పవర్ ప్రెస్‌వారు శ్రీ గోనుగుంట దశరధరామయ్యగార్కి మా మనః పూర్వక ధన్యవాదములు. ఈ రచనలో చేయూత నిచ్చిన పలువురు మిత్రులు సంస్థలకు మా నమోవాకములు.

ఇంగువ వెంకటేశ్వరరావు

ఇంగువ కార్తికేయ శర్మ

27-2-1992



# పరిచయము

విఘ్నం నిఘ్నన్ ద్విరద వదనః ప్రీతమే నోస్తు నిత్యం
వామే కుంభ త్రుకటిత్ బృహత్ దక్షిణే స్థూల దంతః।
యః శ్రీకంఠః పితర ముమయా శ్లిష్ట హమార్థ దేహం
దృష్ట్వా నూనం స్వయమపి దధా వర్థ నారీశ్వరత్వమ్॥

రాష్ట్రకూటజ వంశీయుడగు ముమ్మడి కృష్ణ ప్రభువు కొలువు నందుండిన హలాయుధ కవి వరేణ్యుడు 'ఏకదంతుని' మన్దాక్రాన్తా వృత్తమున ఇట్లు స్తుతించెను.

"విఘ్నేశ్వరుడెల్లప్పుడు మీకు ఆనందమును కలిగించుగాక" అర్ధనారీశ్వరుని ఒడిలో కూర్చున్న బాలవినాయకుడు తన తల్లి దండ్రీ స్త్రీ పురుష మిశ్రితమై ఏకరూపముగ నున్నారుగాన తానను అటులనే యుండగోరి తన వామ దంతమును తీసివైచి కరిణి వలె కనపడుచు, దక్షిణ భాగమున స్థూలదంతమును గల్గి ఏకదంతుడై బాల అర్ధనారీశ్వరుని వలె నుండెను. ఇది హలాయుధుని కవిత్వధోరణిలో దొర్లిన చమత్కారము.

నన్నిచోడ మహారాజు తన కుమారసంభవమను పేర రచించిన ఆంధ్ర కావ్యమున గజముఖుని జన్మను గూర్చి హేతువాద సరళిలో ఇట్లు వర్ణించెను. వీరి విషయమును తమిళ గ్రంథముల నుండియు సుప్రభేదాగమము నుండియు తీసుకున్నట్లున్నది.

''ఇట్లు పరమేశ్వరుండును, సతీదేవియు సామజకేళీ లాలసులై విహరించినంత, సద్యోగర్భంబున 1 - 106''

''క॥ పురుషాకారము బటుమద
కరివదనము గుజ్జపాదకరముల లంబో
దరము హరినీల వర్ణము
గరమొప్పంగ దాల్చి విఘ్నకరుడు దయించెన్.'' 1 - 107

గజముఖుని గూర్చి ఆధ్యాత్మిక తత్త్వమిట్లున్నది. ఈ తత్త్వమును గూర్చిఅధర్వణ వేదాన్తర్గతమైన గణపతి, గణేశ్వర తాపినీ ఉపనిషత్తుల యందు వివరము లిట్లున్నవి.

'ఓమ్' శబ్దమే గజాకారకమైనది. అనిర్వచనీయమైన మాయ. ఇదియే జగత్ బీజము. ఇదే గణేశుడు. ఇదే శబల బ్రహ్మము మరియు జగత్ సృష్టికి కారణము. గజ శబ్దవాచ్యమైన బ్రహ్మము ఉపాసకులకు సులభ గ్రాహ్యమైనది.

ఈ పై తత్త్వవివరణము ప్రతికా న్యాయమును వివరించు పురాణకథ తెలుసుకొను నవసరమున్నది.

పార్వతీదేవి తన గేహమునకు కావలి వాని నుంచుటకై పసుపు ముద్దతో ఒక బాలుని సృజించెను. ఆ కుమారుడు జాగరూకుడై ఇంటి ద్వారమును రక్షించుచుండెను. పరమశివుడు లోనికి ప్రవేశింపబోవ బాలుడు అడ్డగించెను. శివుడు ఖడ్గముతో బాలునికి శిరచ్ఛేదమొనరించెను. అంతలో దేవి వచ్చి జరిగిన దంతయు తెలిసికొని, బాలుని సజీవుని గావింపుమని స్వామిని వేడుకొనెను. వెంటనే శివుడు గజ శిరస్సునొకదానిని తెచ్చి ఆ బాలుని మెడపై నమర్చి సంధానము గావించెను. ఆ వారణముఖుడే వినాయకుడు.

ఈ కథా మర్మమేమనగా కేవలస్త్రైణ సంకల్పముచే జన్మించినందున బాలుడు అహంకారిగా ప్రవర్తించెను. చిత్త అహంకారములకు నెలవైన మనస్సునకు స్థానము శిరస్సు. వీనిని లుప్తమొనరించుటయే శివుడొనరించిన శిరచ్ఛేదన

కలాపమునకు ప్రతీక. పార్వతి ప్రార్థన నంగీకరించియూ బాలుని జగపతిని చేయుటకై కరిమస్తకము నాతని శరీరమునకు సంధానింపబడినది స్త్రీ సంకల్పమునకు పురుష సంకల్ప సమ్మేళనమే గజముఖుని జననకారణమైనది. ఈ సృష్టి పాక్షికముగాని సంపూర్ణ సృష్టి. జగపతి యను పదమే యాస్కాచార్యుని వర్ణ విపర్యయమను భాషానియమముచే గజపతి యని తరువాత క్రమమున గణపతి యనియు వాడుకలోనికొచ్చినది.

ఇంతటి ఆధ్యాత్మిక తత్త్వము గణపతి విగ్రహ (మూర్తి) నిర్మాణమందు కలదు. కేవల బింబము నర్చించుటయే గాదు. పుణ్యశీలానువర్తనము. అందు నిబిడీకృతమైన పరమతత్త్వమును మనసున కేంద్రీకరించుకొని భక్తుడు ధ్యాన నిమగ్నుడు కావలెను. దేవతా విగ్రహములన్నింటికి ఇట్లే తత్త్వములు కలవు.

ఆ రూపము - అవ్యక్తము - అవాఙ్మానసికమైన పరమ వస్తువు కావున "విరాట్" రూపమును భావించుకొని ఋగ్వేద ఋషులు పురుష సూక్తమును దర్శించిరి.

'అజాయమానో బహుధా విజాయతే'

పుట్టుకయే లేనివాడు అనేక రూపములతో పుట్టుచున్నాడు. రుద్రసూక్తములోని 15 వ మంత్రము. ప్రథమానువాకమున భగవంతుని సర్వాంగవర్ణనమును కనుపించుచున్నది.

'తయా నః తనువా - శంతమయా గిరిశంత - అభిచాకశీః '

ఆ మంగళకరమైన శరీరముతో నన్ను నలుమూలలా వెలుగుగా చేయుము.

బ్రహ్మసూత్రములందును యోగశక్తి గలవారు, యోగమహిమచే అనేక శరీరములను పరిగ్రహించుచుందురు. బ్రహ్మ వేదశబ్దముల ననుసరించి నామ-రూప-క్రియలతో పదార్థముల సృష్టికావించెను.

వేద - వేదాన్త - బ్రహ్మ సూత్రముల యంతరార్థమును పునాదిగా స్వీకరించి ఆగమశాస్త్రము లేర్పరుపబడినవి. వాని నిబంధనల ననుసరించి బింబ రచనలు దారువుల యందు శిలల యందును మలచబడినవి. ఇంతేగాక ఫలకముల పై వర్ణారోపణముచే చిత్రములు రచింపబడినవి.

ఎన్నో విషయములను వివరణములతో సులభరీతిలో తెలుగు వారందరకు తెలియ జేయుటకై డా॥ ఇంగువ కార్తికేయశర్మ, వేంకటేశ్వరరావుగార్లు వారి మాతృభాషలో పలు విషయములను సొంపుగా నావిష్కరించినారు. ఇటులనే వైష్ణవ బేరముల గూర్చి దేవీమూర్తుల గూర్చి తదితర లౌకిక ప్రతిమలగూర్చియు మరికొన్ని గ్రంథములను సచిత్రముగ ప్రచురింపగలరు. సదాశివుని కృప వారిని ఉత్సాహవంతులుగా జేయుగాక!

ఓమ్ - శమ్.

నే॥ శ్రీ కృష్ణమూర్తి

శ్రీ

శ్రీ మహాగణాధిపతయేనమః

# గణపతి

శ్రీ గణనాయకుని పుట్టుపూర్వోత్తరాలు చాల వింతగా ఉన్నాయి. వేదకాలంలో కూడ వినాయకుని పూజలు చేసెడివారు. తైత్తిరీయ అరణ్యకమున దంతి భగవానునిపై నొక మంత్రమున్నది.

తత్ పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహే। తన్నో దంతిః ప్రచోదయాత్॥

సాయణాచార్యుడు యీదంతి వక్రతుండుడైన గణపతియేనని వివరించి యున్నాడు. ఋగ్వేదమున బృహస్పతి పరశులేక బంగారుగొడ్డలి, కుడిచేతిన కల్గియుండెను. బృహస్పతినే గణపతిగా పేర్కొనబడియున్నది. ఫాదర్ హీరాస్ పండితుడు గణేశుని గాధలను గూర్చి పరిశోధించి చక్కని గ్రంథాన్ని వ్రాయుచుయున్నారు. ఇంపున లూరిస్తాను, (యిది పశ్చిమ ఇరాన్ దేశమున కలదు) త్రవ్వకములలో లభ్యమైన నొక కాంశ్య పళ్లెరము (నగ భాగము) చాల ముఖ్యమైన వస్తువుగా పేర్కొనబడినది. ఈ పళ్లెరముపై హస్తిముఖము గల దేవతాస్వరూపము మరికొన్ని భగవత్స్వరూప సంకేతములతో కూడ చూపబడెను, శాసనముకూడ కలదు. ఇది క్రీ॥ పూ॥ 1200-1000 కాలము నాటిది. దీనిపై చిత్రించబడిన గణనాధుని గూర్చి వివరింతును.

ఏనుగు ముఖము గలిగి మానవస్వరూపమున యోధునివలె వేషభూషణములతో, కుషాణరాజుల ప్రతిమలను బోలిన పొడుగుపాటి ఇరుకు పంట్లాము, పెద్దకోటు, బూట్లు, ధరించియున్నాడు. (చిత్రము - 1) యెడమచేతిన పొడుగుపాటి కత్తి, కుడిచేతిన 'శేషనాగుని' తోక పట్టుకొనియున్నాడు. మధ్యగా గుండ్రని ముఖము సూర్యభగవానుని సూచించుచున్నది. సూర్యబింబము క్రిందభాగమున శ్రీవత్సపద్మము లున్నవి. సూర్యుని శిరముపై పద్మము, ఆమలకము, మొదలగు శుభ సంకేతములు కలవు. పళ్లెపు యెడమ అంచున మరొకకత్తి ఎవరో చేతిలో పట్టుకొని వున్నట్లు చూపబడియున్నది. కాని చిత్రము పూర్తిగాలేదు. గణేశుడు తంత్రశాస్త్రమున పరశువును, సర్పమును గల్గి యున్నట్లు పేర్కొనబడియుండుట గమనింపవలసియున్నది. పైన పేర్కొన్న ఇరాన్ గణపతి చిత్రమునుబట్టి యీ భగవంతుని చాల మత్యంత ప్రాచీనమైనదై పర్షియా, ఇరాన్ దేశముల మంత్రయుక్తంగా పూజలోనుండినట్లు విదితమగుచున్నది. దేవార్యుల కాలవాలమైన ఇరాన్, పర్షియా మధ్య ఆసియాలోని సప్తసింధు, వేదకాలమున పవిత్రమైన భూమిగా విరాజిల్లెను. గణపతి పూజ ఆఫ్ఘనిస్తాన్‌లో మిక్కిలి ప్రజాదరణ చెందియుండెను. ముఖ్యముగా కుషాణ గుప్త-చక్రవర్తుల సమకాలీనమైన పెక్కు మూర్తులు లభించినవి. ఇటీవల డా॥ నారాయణ్ పండితులు బ్రిటిష్ మ్యూజియమ్‌లోని నాణెముల పరిశోధించి ఒక ఇండోగ్రీకు వెండి నాణెముపై గణేశుని ప్రతిమ యున్నట్లు తెలిపినారు. ఈ నాణెము 'హెర్మియస్' యను రాజొసగినది. క్రీ॥ పూ॥ 2-వ శతాబ్దినాటిది. ఈ విధముగా గణనాథుడు క్రీస్తు - పూర్వకాలంలోనే భగవంతుడుగా మహారాజులు పూజించుటయేగాక తమ రాజాంకములలోను, నాణెములందు యీస్వరూపమును ముద్రించుకొని వారి భక్తి ప్రపత్తులను విదితము చేసుకొనిరి.

ఇక తూర్పు దేశములైన ఇండోనేసియా, కంబూజ, బర్మా, చైనాలలో కూడ గణపతి ఆరాధన క్రీ॥ శ॥ 6—7 శతాబ్దములలో నుండియే విరివిగా నుండినట్లు తెలియుచున్నది. ఇక మనదేశమున ముఖ్యంగా ఆంధ్రమున గణేశుని వునికినిగూర్చి వివరింతును. ఇటీవల మేము అమరావతి పురావస్తు శాలలోని శిల్పముల పునఃపరిశీలించుటము జరిగినది. ఇదివరలో లభ్యమైన కొన్ని ముఖ్యశిల్పముల భాగములను జోడించి పూర్ణతనిచ్చే ప్రయత్నాలు చేసితిమి. అట్టి కార్యక్రమములో శిల్పకారుడు శ్రీ పద్మనాభన్ మూడు ముక్కలుగా దొరికిన ఒక మాలావాహక ఉష్ణీషఫలకమును పూరించినాడు ఈ ముక్కలు ఇదివరలో చిన్న భాగములుగా వేరు వేరుగా పరిచురితములైనవి. ఈ సహాయమ్మిట వలన అవన్నియు కలసి చక్కని షష్ణీఫలకమై దీనిపై చెక్కిన మూర్తులగాధ జుగుప్సాకరమైనదిగా తేలినది. (ఛాయా చిత్రములు 3-4-5 మరియుకి) ఈ ఫలకము 3 . 35 మీటర్లు పొడుగు, 66 సెం॥ మీ॥ యెత్తు, 19 సెం॥ మీ॥ మందము కల్గియున్నది. క్రిందిభాగమున నిలువు స్తంభములపై బిగించుటకు వీలుగా గుంటలున్నవి. యెడమ భాగము పై యంచున బ్రాహ్మీశాసనము కలదు. ఇందు దానమొనర్చిన వాని పేరును పేర్కొనుచున్నది.

(దుహుతుకాయ సనతుకాయ ఉనిస దానం) ఈ ఉష్ణీష ఫలకదానము కొడుకులు, కూతుళ్లు గావించినది. ముందున్న అక్షరములు శిధిలమగుటవలన దానమొసగినవాని పేరు తెలియుటలేదు. శాసన లిపిశైలినిబట్టి క్రీ॥ పూ॥ 2-వ శతాబ్ది నాటిదని తెలియుచున్నది. ఈ ఫలకముపై వరుసగా చెక్కిన మూర్తులు ప్రాచీన శిల్ప చరిత్రలోనే అరుదుగా కానవచ్చుచున్నవి.

1) యేనుగు ముఖముతో పొట్టి శరీరము పెద్ద ఉదరము, కుదించిన బాహువులు, చేటలవంటి చెవులు కుడి ప్రక్కగా ముకుళితమైన చిన్న తొండముతో మానవ ఆకారముగనున్న ఈ మూర్తి గణాధిపతిగా తోచుచున్నది. ధోవతి మోకాళ్ళవరకే యున్నది. ఘటాకారము కల్గిన పెద్ద పూసగల వుదరము పై వరకు నున్నది. బొడ్డు ఆకు వలె చూపబడినది. పై భారమును మోయుచున్న కుడిచేయి మాలను ఎత్తిపట్టుకొన్నట్లు, ఎడమ చేయి నడుముపైని వున్నవి. చేతులలో కంకణములు కలవు.

2) పై మూర్తిని బోలి మరుగుజ్జువలె బొద్దుగా పెద్ద కుచములతోనున్న యీ స్త్రీ మూర్తి మాలబరువుచే చతికిలబడి కూర్చొనియున్నది. మెడలోని కంఠ హారము కుచద్వయముల మధ్యగా వ్రేలాడుచున్నది.

3) ఎడమ ప్రక్కగా నిలబడి మాలయొక్క భారమును చేతులతోనెత్తి మోయుచు నడుచుచున్న మరొక మరుగుజ్జు, తలపై ధరించినటోపి (వామకిరీటి) మీసములు, యెగగట్టియున్న ధోవతి చెవులలోనున్న నీలోత్పలములను బట్టి ఈతడు కుబేరుడనుటలో సందేహములేదు.

4) చివర మకరమునోటినుండి వెలికి వచ్చినట్లుగా తూర్పుముఖంగా కమలముపై కూర్చున్నది మహాలక్ష్మి. ఆమె తలనీలాలు రెండు పాయలుగా చక్కగా అమరియున్నవి. పాపటబొట్టు, చెవుల యాభరణములు, చేమంతిపువ్వును బోలిన నవరత్న ఖచితమైన కర్ణాభరణములతో నలంకరింపబడి యుండుట విశేషము. మాల ఆమెతలపై మోయు చున్నట్లు చూపబడినను, శ్రీ లక్ష్మీదేవి యెంతో హుందాగా యెడమకాలు ముడుచుకొని, చేతులతో బంధించి కమలా సనయై యున్నది. ఈ ఫలకము పక్క భాగమున గుడ్లగూబకూడ చిత్రింపబడియున్నది. ఇది లక్ష్మీదేవి వాహనముకదా! ఆనంద కుమారస్వామిగారు యీయేనుగు తలను యక్షునిగా గుర్తించి, యక్షరాజులేక గుహ్యలేక గణముగా భావించిరి.

బహుశా గణాధిపతి స్వరూపమై యుండవచ్చునని చెప్పినారు. శివరామమూర్తిగారు దీనిని క్రీ॥ శ॥ 2-వ శతాబ్ది కృతమై యుండుననియు యీ శిల్పము గణేశుని రూపమును బోలినదిగా కనపడు చున్నదని తెలిపిరి. వారిరు వురికికూడ పై అన్ని భాగముల నొకచోట చేర్చి పూర్తి శిల్పమును పరిశీలించు నవకాశము కలగలేదు. మొదట నున్నరూపము నిశ్సంసయముగా గణాధిపునిదే. మిగతా గణములకన్న మొట్టమొదటగా చూపబడినాడు. ఆతరువాత స్త్రీమూర్తిని సంశయముగా "గణేశాణి" గణాధిపుని భార్య. దక్షిణ దేశమున గణపతిని భార్యతో సహా పూజించుట, లేక శిల్పమున చూపుట అంతగా కానరాదు. కాని ఉత్తర భారతమున భూమార, దేవగఢ్. బేరాఘాట్ (మధ్య ప్రదేశ్) మున్నగు చోట్ల గుప్తరాజుల కాలంనాటి ప్రతిమలు, గణేశుడు శక్తితోకూడ నున్నట్టివి గలవు. మూడవ స్వరూపము కుబేరునది. ఈతడు యక్షేంద్రుడు, ధనదుడు (ధనపతి) లోకపాలకుడు. ఈతడుగూడ గుహ్యపతి. శ్రీ లక్ష్మికి చాల సన్నిహితుడు. అష్ట నిధులతో లక్ష్మీ ప్రసన్నుడైన కుబేరుడు ఆమె ప్రియుడుకూడ, చాల విధా లుగా కుబేరుని, లక్ష్మితో కలశి చెక్కిన శిల్పములు కానవచ్చుచున్నవి. మహాలక్ష్మి అన్ని లాంఛనాలతో, లక్షణము లతో చూపబడియున్నది.

బౌద్ధస్తూపమున హిందూదేవతల నిట్లు మాలా వాహకులుగా మార్చి చూపుచున్న శిల్పము బహుశ యిది ఒక్కటి మాత్రమే కాబోలు ? గణాధిపతి, ఆయన భార్య, కుబేరుడు - లక్ష్మీదేవి సహా బుద్ధునికి పెద్ద మాలను సమ ర్పించు కార్యక్రమములోనున్నారు. దీనినిబట్టి బౌద్ధ మెంతటి ప్రాభవముతో క్రీ॥ పూ॥ 2-వ శతాబ్ది కాలమున ఆంధ్రమున వెలశెనో తెలియుచున్నది. ఇట్టి శిల్పములు మరెక్కడను కానరాలేదు. వెతకగా సింహళమున నొక బౌద్ధ చైత్యమున గణాధిపుని, గణములమధ్య చైత్యమును మోయుచున్నట్లు చూపబడియున్న శిల్పము తటస్థించినది, ఈ శిల్పము, క్రీ॥ శ॥ 2-వ శతాబ్దినాటిది. సింహళ దేశమున ప్రఖ్యాతి గాంచిన కంటకచేతింగస్తూపమున లభ్య మైనది. అశోకచక్రవర్తి కూతురు చారుమతి, గణపతికై నేపాలున దేవాలయము కట్టినట్లున్న, బుద్ధభగవానుడు రాజగృహమున ఆనందునికి 'గణేశహృదయ' మను మంత్రమును బోధించెననియు గాధలు కలవు. నేపాలులో గణేశుని సిద్ధిదాతగా గ్రహించుటయేగాక సతీసమేతునిగా, సింహముపైని, కూర్చునియున్న హేరంబగణపతిపూజ మక్కువతో చేయుచుండిరి. బౌద్ధబిక్షువులీ ''గణపతి హృదయ" మంత్రమును క్రీ. శ. 7-8 శతాబ్దులలో చైనా జపాను దేశములకుకూడ వ్యాప్తి చేసిరి.

హిందువులకు ఈగణనాధుడు మిక్కిలిప్రీతిపాత్రుడు, మొట్టమొదట పూజింపబడు దైవము మహా గణపతి ప్రతిమ దేవాలయమున ప్రీతిపాత్రుడై ఆరాధింపబడుచున్నాడు పూజలో నున్నట్టిది. మధురలో 20 అంగుళముల ఎత్తున్న గణేశ ప్రతిమ. ఈ మూర్తి క్రీ శ. 4-5 శతాబ్దికి చెందినది.

ఆంధ్రముననేనిటీవల చేజర్ల గ్రామమున గల కపోతేశ్వరాలయమున మరొక ప్రాచీనమైన గణేశమూర్తిని చూచితిని. ఈ ప్రతిమ పై దేవాలయ మండప ముఖద్వారమున కుడి ప్రక్కగానున్న కోష్ఠములోనున్నది. విజయపురి ఇక్ష్వాకుల నాటి క్రీ. శ. 3-4 శతాబ్ది కృతముగా తోచుచున్నది. అర్ధపర్యంకాసనములో రెండే చేతులు, కుడి చేతిని పాత్రయున్నది. తలపై శిరస్త్రకమున్నది. కిరీటములేదు. చాటవలెనున్న చెవులు, యజ్ఞోపవీతము లేకుండుట పైన పేర్కొన్న అమరావతి వినాయకుని బోలియున్నాడు.

మెదక్ జిల్లాలో శాతవాహననగరముగా ఖ్యాతిగాంచిన కొండాపురమున సుధతో (సున్నము) చేసిన గణేశ ప్రతిమలు క్రీ. స్తబ్దము 2-3 శతాబ్ది నాటివి చాల లభించినవి. ఈ చిన్న బొమ్మలు ఓస్మానాబాదుజిల్లా తేర్ (చిత్రము-2)

మరియు భోగవర్ధన యనుచోట్లకూడ త్రవ్వకములలో కనిపించినవి. ఇంచుమించు ఇదే కాలమునకు చెందిన మట్టి వినాయకుని ప్రతిమ కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకా. వీరాపురమనుచోట లభ్యమైనది. ఈ ప్రతిమ శిరస్సుపై రత్న కిరీటమున్నది. పెద్దపొట్ట, రెండుచేతులున్న యీకాల్చినమట్టి బొమ్మ క్రీస్తుశకము 3-4 శతాబ్దికి చెందిన ఆలయము లందు బయల్పడినది. ఈ ఆలయమున కంచునంది (11 సెంమీ) మట్టితో గావింపబడిన పుష్కరిణి నమూనాయుకూడ లభ్యమైనవి. మహారథిరాజుల నాణెములు ఈ వస్తువుల స్తరములలో నుండుటను బట్టి ఈ ప్రతిమలు క్రీస్తుశకములవిగా స్పష్టమగుచున్నది. చిత్రమేమిటో యిదే కాలమునకు చెందిన నాగార్జునకొండలో వినాయక ప్రతిమలు కానరాలేదు. కార్తికేయస్వామి ఆలయములు, విగ్రహములు, లభించినవి. ఆ తర్వాత పాలకులుగా వచ్చిన విష్ణుకుండి వంశజులు, దంతిముఖస్వామి (గణపతి) ని స్వయం ప్రధానమూర్తిగా చేసి, ప్రతిష్ఠించి, పూజించినటుల వేల్పూరు (గుంటూరు) శాసనమువలన విదితమగుచున్నది. ఈ శాసనమును రెండవ మాధవశర్మ తన 33-వ రాజ్య సంవత్సరమున (క్రీ. శ. 489), స్థాపించుచు 'వినాయకం నమస్యంతి,' యని మంగళ పద్యము చెప్పుకొనెను. ఈ విష్ణుకుండినుల కాలమున సామాన్య ప్రజకూడ దంతముఖుని కొలిచినటుల యిటీవల పెద్దవేగి తవ్వకాలలో తెలియవచ్చెను. ఈ రెండు ప్రతిమలు మట్టితోచేసి కాల్చబడినవి. క్రింద భాగమువ సొరుగువలె నుండుటబట్టి కొయ్యలేక రాతిపైన ధిష్ఠించబడినట్లు విదితమగు చున్నది. [చిత్రములు - 7 (A), 7 (B)]

రెండు ప్రతిమలు యేనుగు శరీరముతో, శిరము తొండము గలిగియున్నవి. ఒకటి 7 × 4 సెం. మీ. రెండవది 7 × 5-6 సెం. మీ. రెండింటను తొండము కుడి ప్రక్కకు తిరిగి చేతిని తాకుచున్నది. నొక ప్రతిమపైని నల్లటి రంగు పూయబడియున్నది. ఈ బొమ్మన మూడు పాయల యజ్ఞోపవీతము కూడనున్నది. మొదటి ప్రతిమన యజ్ఞోపవీతములేదు. రెండింటను శిరాత్రము తప్ప మరెట్టివేషభూషణాదుల గానము. తర్వాతకాలమునకుచెందినపెద్ద వినాయక మూర్తులు యెరుపు యిసుకరాతివి పెక్కు లభించినవి, అర్ధపర్యం కాసనమున పద్మపీఠముపై చక్కగా నధిష్ఠించిన ఈ వినాయకులపై రెండు చేతులందున త్రిశూల, డమరుకములు - క్రింద చేతుల పాశము - ఫలము లేక లడ్డు మోకాలిపై నుంచగా తొండము వాటిని తాకుచున్నది. శిరముపై కరండ మకుటము గలదు. నాగ ఉదర బంధమున్నది, పడగ నాభిస్థానమును కప్పుచున్నది. నొసటన త్రయాంగుళీయకము విభూతి యున్నది. (చిత్రము-10)

పశ్చిమ చాళుక్యులు వాతాపి గణపతిని తమ దేవునిగా కొలచిరి. వారి దాయాదులైన వేంగీ చాళుక్యనృపతులు గణనాధుని చాలమక్కువతో భక్తిశ్రద్ధలతో నారాధించిరి. ఉత్తర చైనా దేశమునందలి గంసు రాష్ట్రమున గల దున్ హువాంగ్ గుహలలో క్రీస్తుశకము 536—538 నాటిదైన గుహ - 285. ద్వారమున కిరుప్రక్కల గోడలపైని కుడ్య చిత్రములున్నవి. త్రిముఖ శివ నందివాహనముపై చూపబడియున్నాడు. కుడివైపున నాల్గుచేతులున్న కార్తికేయుడు యెడమభాగమున రెండు చేతుల వినాయకుడు తొండముపైకెత్తియున్నాడు. ఈతని కుడిచేతిని ఫలము, వామ హస్తము వజ్రముగల్గి ప్రభామండలము, యేనుగుతల చెవులనుగల్గి యున్నాడు. ఈ గుహల చిత్రించిన వినాయక కార్తికేయమూర్తులకు యజ్ఞోపవీతములేదు. పైన వివరించిన వానిని పరిశీలింపగా గణపతి దేవతగా మొట్టమొదట పర్షియా, ఇరాక్ దేశములలో వేదకాలమునుండియే ఆరాధ్య దైవముగా నుండెను. ఉత్తరమున సప్తసింధు ప్రాంతమున పరిపాలించిన గ్రీకురాజులు హిందూమతాసక్తులై శివ పార్వతుల, స్కంద, గణపతి మున్నగు బ్రాహ్మణదేవతలను నాణెములపైని ముద్రించిరి. ఆంధ్ర ప్రాంతమున, తక్కిన దక్షిణ ప్రాంతముల, గణపతికి ప్రత్యేక దేవాలయములు తొలుత కానము. బౌద్ధ సంస్కృతి శిల్పములలో గణాధిపుడు మాలావాహకుడుగా లేక చైత్యమును

మోయు దిగ్గజముగానో, గణముగనో చూపబడెను. వేదకాలపు దైవమైన దంతి యీ విధముగా గణాధిపతిగా చాల కాలముగా ఉండినను. క్రీస్తుశకము 3-4 శతాబ్దిలలో మరల బ్రాహ్మణ మతము వృద్ధిలోనికి వచ్చి వ్యాప్తిచెందుటవలన గణపతి దేవతగా, ప్రత్యేక కోష్ఠములలో పూజింపబడుట ఆచారమైనది. వేరుగా ఆలయమున, స్వయం ప్రధానమూర్తిగా సుప్రతిష్ఠితమైనది చేజర్ల వినాయకుడు మాత్రమే! ఆ తర్వాత తూర్పు చాళుక్యులకాలంలో వినాయకునికి గొప్ప ప్రాచుర్యం[ప్రచారము] వచ్చినది. పల్లవ నృపులు గూడ వినాయకుని ముఖ్య దేవతగా ప్రతిష్ఠించి పూజించిరి. కాని పెక్కు దేవాలయముల నీస్వామి తాను భగవత్ స్వరూపుడుగానేకాక, ప్రజలలోనికి వచ్చి ఆడుతూ - పాడుతున్నటుల చిత్రించిరి. ఖజురాహో దేవాలయమున, పానుగల్లు దేవాలయముల ద్వారశాఖలపైని మైమరచి నృత్యం చేస్తున్న గణపతి దేవుని విభిన్న భంగిమలు చూచి ఆనందింపవలసినదే!

ఓం శ్రీ గణాధిపతయేనమః


ఉపయుక్త గ్రంథములు

1. ఫాదర్ హీరాస్, ది ప్రాబ్లమ్ ఆఫ్ గణపతి (వారణాశి, 1972)
2. యమ్. కె. ఢవళీకర్, ''ఈస్టా అండ్ వెస్ట్'', సంపుటి 21, నం. 3-4 పుటలు 331-336.
3. ఇండియా స్ కంట్రిబ్యూషన్ టు వరల్డ్. థాట్ అండ్ కల్చర్, వివేకానంద రాక్ మెమోరియల్ కమిటి, (మద్రాసు, 1970), పుటలు 1-10.
4. ఐ. కె. శర్మ, బుద్ధిస్ట్ మాన్యుమెంట్స్ ఆఫ్ సైనా అండ్ సౌత్ ఈస్ట్ ఇండియా, (న్యూ ఢిల్లీ, 1985), పుటలు, 55-56.
5. జర్నల్ ఆఫ్ న్యూమిస్ మాటిక్ సొసైటీ ఆఫ్ యిండియా, XXXVI (వారణాశి, 1974) పుట, 190
6. కార్ల ఖండల్‌వాలా, ది డాన్ ఆఫ్ సివిలిజేషన్ ఇన్ మహారాష్ట్ర, (బొంబాయి, 1975), చిత్రము, 63, ఆఖరి వరుస.
7. టి. వి. జి. శాస్త్రి, వీరాపురము, ఏ టైప్ సైట్ ఫార్ కల్చరల్ స్టడీస్ ఇన్ ది కృష్ణావాలీ, (హైదరాబాదు, 1984), పుటలు 25, 31, 41. చిత్రము IX, B-1 42-2.


---

# భారతీయ శిల్పములగుహ్యాలు, గణములు, వీరి శక్తి - ప్రాభవము

పంచభూతములే సదనములై మానవరూపమును, కొంతవరకు నట్టి ప్రకృతి గల్గిన యక్ష - యక్షిణులు వారి గణములు గుహ్యాలు ప్రాచీన భారతీయ శిల్పమున పలుచోట్ల జుగుప్సాకరముగా చిత్రింపబడి యున్నవి. ప్రజల లౌకిక దేవతలగా యీ గుహ్యాలు - గణములు శిల్ప సంస్కృతిలో నొక ప్రత్యేక స్థానమును బొందియుండుటచే,

పండితులు వీనినిగూర్చి చర్చించి చక్కని గ్రంథములు వ్రాసియున్నారు. ఇందున కొన్ని ప్రాచీన భారతీయ శిల్పమున కానవచ్చు అరుదైన రూపముల పేర్కొని వాటి అంతరంగిక శక్తుల. బాహ్యరూపముల లక్ష్య - లక్షణములగూర్చి పరిశీలింతుము.

యక్షులు ఋగ్వేదమున దేవతలుగా పేర్కొనబడిరి. వారి ఆలయములు. పూజచేయువారిని గూర్చియు. తెలియుచున్నది. సాయణాచార్యుడు వీరిని పూజనీయులుగా. పుణ్యజనులుగాకూడా పేర్కొనియున్నాడు. ఋక్ అధర్వణ వేదములయందే వీని పుట్టుకయు తెలుపుచున్నవి. (సలిలస్యపృష్ఠే) శ్రీ ఆనందకుమారస్వామి యక్షులయని బ్రహ్మసృష్టి యనియు. బ్రహ్మ నీటిలోనుండే ప్రపంచమును సృష్టించి యున్నందున యక్షులను, వారి గణములను కూడా ఆజలరాశినుండియే యుద్భవింప జేసెనని పేర్కొనియున్నారు. ఈ యక్షజాతి వరణునికి కైంకర్యముగా, వీరు గాక అప్సరులు, (అనగా ఆపః - సరాణి), గంధర్వ గణములు, పంచ భూతములనుండియే వచ్చినటుల చెప్పి యున్నారు. కుబేరుడు యక్షరాజు. అగ్ని యక్షుల కధ్యక్షుడుగా శ్రాద్ధ పిండముల స్వీకరించుచున్నట్లు ఋగ్వేదమున చెప్పబడియున్నది. వేదకాలానంతరము ఈ యక్షగణ గుహ్యలగూర్చి పలువిధములైన శక్తిః స్వరూపులుగా, అంద మయిన సృష్టిగా, మహామంత్రి తంత్రిజ్ఞానులుగా పేర్కొనబడిరి, మహాభారతమున యక్ష ప్రశ్నలు చాలప్రసిద్ధము.

భారతీయ శిల్పమున మౌర్యకాలము నుండి యీ యక్ష ప్రతిమలు కాన వచ్చుచున్నవి. అంతకు ముందునకూడ యుండి యుండవచ్చును. మట్టి-సుధలలో ఈ ప్రతిమలు, చిన్నవి లభించినవి. తరువాత కుషాను చక్రవర్తుల కాలమున బౌద్ధ, జైన, బ్రాహ్మణ మత సాంప్రదాయ శిల్పము లన్నిటను విరివిగా కాన వచ్చుచున్నవి. ఇవి ముఖ్యముగా బౌద్ధ శిల్పములలో. స్తూప ఫలకములపైని తోరణవేదిక స్తంభపు నిలువు కంభములపైని చూపబడియున్నవి. ఐతిహాసిక కాలమున ఈ యక్ష గణములు, గుహ్యలు వైదిక బ్రాహ్మణ మత. బౌద్ధ - జైనగాధలందు యవతార పురుషులను కొలచుచున్నట్లు, మోయుచున్నట్లు లేక తదితరమైన సేవా ధర్మములో నిమగ్నులై యున్నట్లు శిల్పింపబడియున్నారు.

## *1. బార్హుత వేదికా శిల్పములు*

కలకత్తాలోని ఇండియన్ మ్యూజియమున భద్రపర్చబడియున్న బార్హుత వేదికా శిల్పము చాల ప్రసిద్ధమైనది. ఇందున ఊర్ధ్వపటముల నిలువు కంభములపై నున్న యక్ష గణములు - గుహ్యలున్న కొన్ని యరుదైన శిల్పములు న్నవి. ఒక గణము ముఖము, (చిత్రము-12) బాహువుల పర్యంతము విచలిత పద్మ ఖండికలో చూపబడియున్నాడు. ఈతని కర్ణములు నిటారుగ, కుందేలు చెవుల బోలియున్నవి. బరువైన కుండలములు రౌద్రమైన ముఖము, దంష్ట్రములు, ముడతలతో ముఖము వికారముగ కానవచ్చుచున్నది. కనుపాపల మధ్యగా పైవరకు లలాటముపై రెండు గీత లతో ఊర్ధ్వ ద్విపుండ్రక చిహ్నము కలదు. పైన బిందువు తలజుట్టునుండి వేలాడుచున్నది. మరియొక గుహ్యుడు కుపిరయక్షుని పైనుంచుకొని మోయుచున్నాడు. వీని స్వరూపము చాల చిత్రమైనది. విరూపాక్షుడు, విశాలమైన గజ కర్ణములు విశదముగ కనిపించుచున్నవి. చక్కగా పాపట తీసి ఇరువైపుల దువ్వివేర్చిన శిరోజములు, విశాలమైన ఫాలమున అడ్డముగా మధ్య భాగమున త్రయాంగుళీయకము, పాపట క్రిందగ అర్ధచంద్రకళ చాల చక్కగా గీచియు న్నవి. ఈ రెండు శిల్పములు స్థూపవేదికపై నున్నవి. ఈ రెండు గణములు క్రీ. పూ. 3 వ శతాబ్దివి, (చిత్రములు - 13, 14)

## 2. ధూళికట్ట - గణము

(చిత్రము - 15) కరీంనగరు జిల్లా, పటాపురమను చిన్న గ్రామమున ఆంధ్రప్రభుత్వ, పురావస్తుశాఖ ఒకపెద్ద యిటుక స్తూపమును బయటకు తీసినది, ఇందున ఆయక పటమునగల నొక శిల్పఫలకము చాల చిత్రమైనది. ఈ ఫలకమున భారావాహకుడుగా నొక గణము చిత్రింపబడియున్నాడు. ఈతడు అర్ధపద్మశాఖ యున్న నొక కంబమును పైకెత్తి మోయుచున్నాడు. ఈతని జుట్టు దువ్వెన కొనవలె కత్తిరించియున్నవి. నిండైన బుగ్గలు, ఉద్రిక్తతతో బయటికి వచ్చినట్లున్న మిడిగుడ్లు, మోటుపెదిమలు, నాభిస్థానము నీ భారావాహకుని కొంత వికృతముగానే మల్చబడినది. కౌపీనము న్నది. వంగి యున్నందున మోకాళ్ళపై భారమువేసియున్నాడు. పాదములు రెండును, యేనుగు డెక్కలవలె లావుగా యున్నవి. చెవులు, యక్షగణమును బోలియున్నవి. వన్యమృగమైన కుందేలు, చెవులను నిక్క దీర్చి అతి త్వరితగతిని దూకులతో ముందుకు పోవునట్టిదిగదా! అట్లే ఈ గణముయొక్క స్వాభావుకతను తెల్పుటకు యిట్టి చెవులు చెక్కబడినవి కాబోలు. అన్నింటికన్న చిత్రతమమైనది నొసటయున్న, ఊర్ధ్వ త్రిపుండ్రము. ఇట్టి నొసటి అలంకారము వైష్ణవ సాంప్రదాయకులైన, వడగళై శాఖవారు ఫాలమున పెట్టుకొందురు. ఈ శిల్ప ఖండికపై క్రీ. పూ. 2 వ శతాబ్ది శాసనము గలదు. నేనెరిగిన భారతీయ శిల్పమున యిట్టి ఊర్ధ్వ త్రిపుండ్రక లక్షణము ఫాలముపైనున్న యక్షుడు లేక గణము మరెక్కడను కానరాలేదు. బార్హుత యక్షునికి చెవులు గజ కర్ణములైన, ధూళికట్ట గుహ్యాని పాదములు నిశితముగ గజపాదములే. కాని ముఖముపై లాంఛనములు వేరు వేరు శక్తి ప్రభావముల సూచించుచున్నవి.

*3. గుడిమల్లము: లింగముపైని గుహ్యస్వరూపము:-* ఇంచు మించు నిదేకాలమునకు చెందినట్టి పరశురామేశ్వరాలయము. (చిత్రము - 11) గుడిమల్లము (చిత్తూరుజిల్లా), లోని శివలింగముపై నున్న గుహ్యరూపము ఇటీవలి త్రవ్వకముల ఫలితముగా నీ గుహ్యాని పూర్ణస్వరూపము వెలికి వచ్చెను. బ్రహ్మభాగముపై నున్న నీ గుహ్యుడు, మోకాళ్ళపై కూర్చొని యున్నాడు. పూర్ణ స్వరూపుడైన రుద్రి యజమానుని భుజాగ్రములపైని మోయుచున్నాడు. ఈ దేవయానుడు కేవలము 46 సెం॥ మీ॥ యెత్తు గల్గియున్న హ్రస్వరూపి. ఈతని శరీరము, పైనున్న భారమువలన, కుదించుకొని యున్నది. పండ్లు గట్టిగా బిగించుట వలన బుగ్గలు పొంగి కనుదోయి వికారముగా ముడుతలు చుట్టుకొన్నది. ధూళికట్ట గణమును బోలిన ఇతని చెవులు కుందేలు చెవులవలె నిటారుగానున్నను, పత్ర దళములలోవలె గీతలు కనుపించుచున్నవి. చెవులకు రత్న లేక ముత్యాలు పొదిగిన బరువైన కుండలము లున్నవి. కంఠమున మాలలు మధ్యగా వక్షస్థలముపై రుద్రాక్షల నిరుకడలచే బంధింపబడిన పొడుగైన పూస యున్నది. ఈతని జుట్టు పొట్టిగా కత్తిరించగా దువ్వెన అంచువలె నొసటపై కేశములు చక్కగా కనుపించుచున్నవి, తలపై నుష్ణీషము బదులు రెండు పెద్ద బంతిపూలు కాండములతోసహా ముడిచియున్నవి. చిత్రాతి చిత్రమైన వీతని పాదములు భారతీయ శిల్పమున యిట్టి పాదరూపములున్న గణము కానరాలేదు. ప్రక్కకు ముడుచుకొనియున్న తిమింగిలము లేక పెద్ద సొరచేప (మాతంగనకర) తోకను బోలియున్నది. జలచర గణముగా చూపుటకు నిట్టి పాదములు తీర్చబడెను కాబోలు. ఈతని నుదుట, కనుబొమల మధ్యగా స్పష్టముగా నొక ఊర్ధ్వపుండ్రకమును తెలుపు గీత కానవచ్చుచున్నది. ఈ చిహ్నముకూడ, పైని పేర్కొన్న గుహ్యలేక గణములపై నున్న చిహ్నముల నిమిడి యున్న ప్రాభవములను చూపుచిహ్నముగా తీసుకొనవలయును.

పైన పేర్కొన్న నాలుగు స్వరూపములు వివిధప్రాంతములనుండి లభించినను రమారమి ఒకే కాలమునకు చెందినవి. మొదటి మూడు గుహ్యలేక గణములు బౌద్ధశిల్పములందును లభించినవి. గుడిమల్లంలోని గుహ్యాడు

శైవలేక రుద్రునితో నున్నాడు. ఇవన్నియు క్రీ॥ పూ॥ 3 — 2-వ శతాబ్దినాటివి. అన్నియును చాల అరుదైనవి. భారతీయ శిల్పము చిహ్నముల యేకత్వమును, శక్తి ప్రాభవమును చాటిచెప్పుచున్న శిల్ప రాజములు, ధూళికట్ట గుహ్యుడు గజపాదములు గల్గియుండుటేగాక, తూర్పు ఆయక పటమున చూపబడియున్నాడు. ఇంద్రుని వాహనము గజము. వైదిక దేవతయైన ఇంద్రుడు తూర్పు కధిపతి. ఈ గుహ్యుని యట్లు తూర్పున యుద్దేశించుటలో బహుశ నితడు ఇంద్రుని గణముగా యుద్దేశింపబడి యుండనగును.

కుపిరిక యక్షుని మోయుచున్న గణము యొక్క చెవులు గజముయొక్క చాటచెవులు. ఈ రెండు గణముల నీ విధముగా గజేంద్రుని యంశములుగా చూపబడినవి. ముఖముపైని గీయబడిన చిహ్నములబట్టి, ఈ ఐరావత గణము - శివ గణముగా తోచుచున్నది. అట్లగుచో ఊర్ధ్వత్రిపుండ్ర చిహ్నమున్న ధూళికట్ట గుహ్యుని వైష్ణవ గణముగా తీసుకొన వలసియున్నది. ఏకపుండ్రకముగల గుడిమల్లపు గణము, పాతాళలోకపు పద్మనాభుని అనగా వైష్ణవ గణముగానే చెప్పుకొనవచ్చును. కాలిరూపము గూడ జలాంతర్గమునున్న మాతంగలేక సొరచేపను బోలియున్నదికదా! క్రీస్త్వబ్దము నాటికి, చెందిన మరి కొన్ని శిల్పముల నిట్టి గుహ్య గణములను పరిశీలింతుము. ఇవన్నియు కుషాను చక్రవర్తుల, ఆ తరువాత గుప్త సామ్రాజ్య కాలమునకు చెందినట్టివి. మధుర - ఆగ్రా ప్రాంతములనుండి కుషానుల కాలమునాటి పాత్రావాహక గణ శిల్పములను పేర్కొందును. ఈ గణము కుంభోదరుడు, భద్రాసనుడై పెద్ద పాత్రను శిరముపై నెత్తికొని యున్నాడు. ఈ పాత్రను 'ఆచమన కుంభిగా' శ్రీ వాసుదేవశరణ ఆగ్రావాలా పండితులు పేర్కొనిరి. కాని ఈ కుంభి అంత లోతులేదు. పెద్ద పళ్ళెరమువలె నున్నది కాన స్తూపవేదికా ద్వార ప్రాంగణమున పుష్పములు, గంధము, కుంకుమ, పసుపు లేక విభూదివంటి పూజాద్రవ్యములనుంచుటకు వీలుగా పళ్ళెరముగా యేర్పాటు చేసియుండనగును. మరొక గణము అఘపూర్ (ఆగ్రా) యనుచోట లభ్యమయినది. యిదే విధముగా అహిచ్ఛాత్ర (యు. పి.)నుండి కూడనొక మృత్తికా ప్రతిమ లభ్యమయినది. సీతని ఫాలభాగముపై అడ్డముగా త్రయాంగుళిక చిహ్నమున్నది. అనగా క్రీ. శ. 1-2వ శతాబ్ది నాటికే సీ అడ్డగీతలు ఫాలముపై కుంకుమతోనో లేక విభూతితోనో అమర్చినట్లు అలాంటిదే మత యాచారమునట్లుగా గమనింపవలసియున్నది. అల్హాబాదు మ్యూజియమున కాల్చిన్టిన మట్టి ప్రతిమ, శ్రావస్తగరముునుండి లభించినట్టిది. భద్రపరుపబడియున్నది విభూతి గుర్తులు అనగా త్రయాంగుళీయకము, నొసటన స్పష్టముగా కానవచ్చుచున్నది. ఈ శిల్పము క్రీస్తబ్దము 3-4 వ శతాబ్దికిచెందినది.

ఈ విధముగా నీముఖ చిహ్నముల గణములలేక గుహ్యరూపముల ప్రకృతిని, శక్తిని తెలుపు మత లేక శాఖ చిహ్నములుగా నిలచినవి. ప్రాచీన భారతదేశమున యిట్టి సాంప్రదాయము యెప్పుడో వాడుకలోనికి వచ్చెను.

హరప్పా సంస్కృతి గల్గిన రాజస్థానములోని కాలిబంగయను పురావస్తు స్థలమున, త్రవ్వకములలో నొక మట్టితోచేసిన మానవుని తల లభించినది. ఈ తలనొసట భాగమున మూడు అడ్డగీతలు క్రమముగా గీయబడినవి. స్పష్టముగ త్రయాంగుళీయక చిహ్నములుగా తోచుచున్నవి,

అనగా క్రీ. పూ. 2500 సంవత్సరముల క్రిందనే ఈ వైదిక బ్రాహ్మణ యాచారమున్నట్లు బొట్టుకట్టులలో విదితమగుచున్నది. ఈ కాలమున ఊర్ధ్వ పుండ్రకములు, మూడు విధములుగ కుంకుమ, పసుపులేక తెల్లరంగులలో వైష్ణవులు నొసటన పెట్టుకొనుచున్నారు. శైవులు కుడిచేతి వ్రేళ్ళతో విభూతిని మూడు లేక ఐదు వేళ్ళకు పూసుకొని-త్రయ లేక పంచాంగుళీయ రేఖలను ముఖమున, భుజముల-వక్షస్థలమున నేటికీ పెట్టుకొనుచున్నారు.

క్రీ. శ. 10-11 వ శతాబ్ది నాటికి ఈ ముఖ చిహ్నములు, బొట్లు, శిల్ప శాస్త్రమునందు బ్రాహ్మణ మతశాఖలను బట్టి వేరు వేరుగా నిడుకొను సాంప్రదాయము వచ్చినది శ్రీ వైష్ణవులలోనే వడగల, మరియు తెంగలై యనుశాఖలు ప్రబలెను ఇక శైవులేగాక స్మార్తులు కూడ విభూతి అడ్డపట్టికలు ముఖమున ధరించుట యాచారమైయున్నది,

ఈ విభూదిని ఒక్క ముఖముపై మాత్రమేగాక పతంజలి కాలమున (క్రీ. పూ॥ 3 వ శతాబ్ది) శివభాగవతులు శరీరము నంతటను పూసుకొనుచుండిరట. ఈ విభూతి కేవలము శైవ చిహ్నమేకాదు. ఐశ్వర్య సంపదలకు పవిత్రతకు మారుగా వేదములయందు పేర్కొనబడినది.

క్రీ. శ. 4 వ శతాబ్ది అమరుడిట్లు చెప్పియున్నాడు

"విభూదిర్ భూదిరైశ్వర్యం అణిమాదికమష్టధా। అణిమా మహిమా చైవ గరిమాలఘిమాతధా।

ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వంవశిత్వంచాష్ట సిద్ధయః ''

అణిమాది అష్టసిద్ధుల ప్రసాదించు నీ విభూతిని, ఒకటి, రెండు, మూడు లేక ఐదువేళ్ళతో అద్దముగా ఫాల భాగమున అలంకరించుకొను ఆచారము చాల పురాతనమైనదిగా తోచుచున్నది అ చమన పాత్రలు బహుశ బౌద్ధజైన చైత్యాలయములకూడ నీ విభూతిని వుంచుటకై యుండనగును. మరొక విశేషమేమన నిది వైదికాచారము గాన, బ్రాహ్మణ మతమున, బౌద్ధజైనములందున కూడ వ్యాప్తి చెందినది. మధ్యయుగమున దేవాలయములందు విభూతి గుండును ప్రాంగణములలోనుంచుట పరిపాటియైనది. పైన వివరించిన గుహ్య, గణ శిల్పములు వేరువేరు చిహ్నముల ముఖముపై గలిగియుండుటవలన వీరి మతశాఖ సాంప్రదాయ చిహ్నములుకూడ వేరువేరని గ్రహింపక తప్పదు. విభూతిని రాచుకొనుట మానవ జీవితమున, ముఖ్యముగా మన భారతావనిలో వేదకాలము నుంచి ఆచారమునావచ్చినట్లు కొన్ని నిదర్శనములున్నవి. మానవ జీవితమున, పశు సంపద, భూమి, వృక్షసంపద వ్యవసాయం మున్నగునట్టివి స్థిర నివాసము లేర్పడిన నాటినుండి జీవిత విధానములయ్యెను. ఇట్టి గ్రామ జీవనమున కృషీవలురు పశువులను పెంచుట, పశువుల పాలు, వెన్న, పేడ, మూత్రములు గూడ పవిత్రములుగా భావింపబడెను. విభూదిని నొసటన పవిత్రముగా, శక్తి స్వరూపముగా నెరిగి నొసటను రాచుకొను ఆచారము యీ పశు సంపదయొక్క ఘనతను చాటుటకే; చూపుటకే. భారతావనిలో భూమి, పశు సంపదలే మానవుని పవిత్ర సంస్కృతికి దోహదములయ్యెను.

## అధోజ్ఞాపికలు


1. ఆనంద కె. కుమారస్వామి, యక్షులు (పునర్ముద్రణ 1971), I, పుట - - చిత్రము - 23, II, చిత్రము 12 నం. 4.
2. ''దియక్ష ఆఫ్ ది వేదాస్ అండ్ ఉపనిషద్స్" జర్నల్, ఆఫ్ ది మిధిక్ సొసైటి, సంపుటి 28 నం. 4 పుటలు 232-234, 243.
3. అరవింద ఘోష్, రిమైన్స్ ఆఫ్ బార్హుత్ ఇన్ది ఇండియా మ్యూజియం, సంపుటి 1, (కలకత్తా 1978) పుట 70 చిత్రము - 5.
4. ఐ. కె. శర్మ, "ది డెవలెప్‌మెంటు ఆఫ్ యెర్లీశైవ ఆర్ట్ అండ్ ఆర్కిటెక్చరు," (న్యూఢిల్లీ, 1982) పు 56-62 చిత్రములు 30-31.

# గుడిమల్లమున పరశురామేశ్వరాలయము రుద్రయజమానః

గుడిమల్ల యొక చిన్నగ్రామము. చిత్తూరుజిల్లా, కాళహస్తి తాలూకాలోనున్నది. రేణిగుంట రైల్వే స్టేషనునుండి పాపానాయుడుపేటకు పడమరగా బస్సులో 10 కిలోమీటర్లు ప్రయాణించి ఆపైని 3 కిలోమీటర్లు తూర్పుగా నడచినచో పై గ్రామమునకు చేరవచ్చును. ఈ వూరికి నేటికిని రహదారి యేర్పడలేదు. ఆంధ్రమున, బహుశ ఈ దేవాలయమును గూర్చి యే కొద్దిమందికో తప్ప తెలియదనే చెప్పవలసియున్నది. శ్రీ గోపీనాథరావు (పురావస్తువేత్త) 1911-12 లలో ఈ శివాలయమును దర్శించి గోడలపైని శాసనములను, లింగముపైనున్న శివ ప్రతిమను గూర్చి విపరముగా ప్రచురించిరి. అటు తరువాత ఈ లింగముపైని వినూత్నమైన శివాకృతిని యెందరో శాస్త్రవేత్తలు ముఖ్యముగ శ్రీ ఆనంద కుమారస్వామి, జితేన్ద్రనాథ్ బెనర్జీవంటి మహనీయులు శిల్పచరిత్రలోనే తలమానికంగా భావించి క్రీ॥ పూ॥ 1-2 శతాబ్దాలకు చెందియుండవచ్చునని చెప్పియున్నారు. ఈ శైవ ప్రతిమ ఆగమ విశిష్టత దేశమున మరెక్కడను కానరాదు. ఇది ఇట్లుండ, ఇటీవల, నేనీదేవాలయమున భారతీయ పురావస్తుశాఖ తరపున శిధిలమైన భాగములను పునరుద్ధరించటం జరిగినది ఈ కార్యక్రమంలో కొన్ని నూతనాంశములు బయల్పడినవి. ఈ వ్యాసం ఉద్దేశం ఈ మహత్తర శివాలయమును గూర్చి విశదీకరించుటయే;

స్థూలముగా దేవాలయ పలుభాగముల వివరింతును. వాటి కాల నిర్ణయమునుకూడ పేర్కొందును. (రుద్ర యజమాన: అనగా ఈ దేవాలయానికి అధిపతి యజమానుడని వ్యవహరించుట ఆగమశాస్త్ర సమ్మతము: ఈ దేవాలయమందు రుద్రుడు ప్రతిష్ఠింపబడియున్నందున ఈ దేవతామూర్తి రుద్ర యజమానుడని వ్యవహరింపబడియున్నాడు)

విశాలమైన ఈ దేవాలయ ప్రాంగణమున యెన్నియో చిన్నగుళ్ళున్నవి. అన్నింటిని చుట్టుచూ ఆవలి ఇటుక ప్రాకారగోడ, నలువైపుల కలదు. ఈ ప్రాకారమునకు పడమటివైపు పెద్ద గోపుర ద్వారము వున్నది. ఈ గోపుర ద్వారము, మరియు స్వామివారి అభిషేక జలమునకుగా కట్టిన బావి యాదవ దేవరాయల కాలమునకు (క్రీ॥ శ॥ 13-14 శతాబ్దికి) చెందినది. ప్రధాన దేవాలయము పరశురామేశ్వరస్వామి పేరున పిలవబడుచున్నది. ఈఆలయమునకు వాయవ్య దిశన అమ్మవారి దేవాలయమున్నది. దాని నానుకొని దక్షిణమున వల్లీ - దేవసేనా సమేత కార్తికేయస్వామి గుడి కలదు. పై రెండును తూర్పు ద్వారమును కలిగియున్నవి. తూర్పు చివర నానుకొని సూర్యనారాయణుని దేవాలయము కలదు. ఇట్టి ఈ చిన్న ఆలయములు బహుశ. మరికొన్ని వుండి శిధిలమై వుండవచ్చును. పరివార దేవతల గుళ్ళు, చక్కని శిల్పశైలి కలిగిన ప్రతిమలను కలిగియున్నవి. ఇవన్నియు బాణ, చోళరాజుల (క్రీ॥ శ॥ 9-12 శతాబ్దులు) కాలమునకు చెందినట్టివి. ఇక ప్రధాన దేవాలయముగూర్చి వివరింతును. ఈ దేవాలయ గోడలపైని, రాతి పలకలపైని పెక్కుశాసనములు కలవు. ఇవి తరువాత పల్లవులు, వారి సామంతులు గంగ పల్లవులు (క్రీ. శ. 897-904-5) బాణరాజులు, చోళరాజు విక్రమచోలుడు, మూడవరాజరాజు కాలమునకు చెందినవి. యాదవ దేవరాయల కాలమునకు చెందిన (క్రీ॥ శ॥ 1346) మరికొన్ని శాసనములుకూడ కానవచ్చుచున్నవి. విక్రమచోళుని కాలమున (క్రీ॥ శ॥ 1126), దేవాలయమును పూర్తిగా తిరుగకట్టినట్లు, రాతితో కట్టడములు చేసినట్లు తెలియుచున్నది. దేవాలయములో విశాలమైన మహామండపము గర్భగుడి ఆవలివైపు దాని నానుకొని యెత్తైనరాతి ప్రాకారమును కలుపుచున్న అరుగు, నలుప్రక్కల ప్రదక్షిణ

మునకు వీలుగా స్తంభములపై శాల నిర్మింపబడెను. ఈ కాలమున మహా మండపమునకు దక్షిణముగా ముఖ్యద్వారము, దానికి నేరుగా ప్రాకారమున కుడ్య స్తంభములతో చక్కని ద్వారశాలను యేర్పరచిరి. గర్భగుడి మాత్రము గజపృష్ఠాకారము కలిగియున్నది. ముందున అర్ధమండప, మహామండపములు కలవు. అన్నియును తూర్పు ముఖద్వారములు కలిగియున్నవి. గర్భగుడి, అర్ధ - మహామండపములకన్న, చాలా పల్లములోనున్నది. అందువల్లనే కాబోలు ఈ గ్రామ నామము గుడిపల్లిమని కూడ వాడుకలో నుండెను. శివుని ప్రతిమ, యవ్వనుడైన మల్లునిబోలి యున్నందున గ్రామ నామము గుడిమల్లమని ప్రతీతి. కాని శాసనములలో ఈ నామమెక్కడను కానరాదు. గ్రామము విప్రపీఠము అనగా విప్రులకు స్థానము, (బ్రాహ్మణ అగ్రహారముగా నెరుగవలయును.) పేర్కొనబడినది. తమిళములో విప్పిరమ్పేడు అని పిలవబడియుండెను. గుడిపేరు పరశురామేశ్వరాలయముగా చెప్పబడినది. చిత్రమేమన ఈ ఆలయము నెవ్వరు ప్రతిష్ఠించిరో, యెప్పుడు జరిగెనో, మొట్టమొదటి నామమేట్టిదో తెలియుటలేదు. శాసనములన్నియు స్వామికొనర్చిన నిత్యసేవలు ధూపదీప నైవేద్యములకు కావలసిన భూమి, ధన. ధాన్యదానములను మాత్రమే తెలుపుచున్నవి.

ఇటీవలి (1973), పరిశోధనల ఫలితంగా ఈ దేవాలయమొక పురాతన అవశేషములున్న దిబ్బపై యున్నట్లు తేలినది. ఈ దిబ్బ తూర్పు - పడమర భాగములలో క్రీ॥ పూ॥ 2-3 శతాబ్దములకు చెందిన మృణ్మయ పాత్రలు - నలుపు యెరుపు - నునుపు ప్రకాశించనట్టివి, క్రీ॥ శ॥ 1-3 శతాబ్దములకు చెందిన ఆంధ్ర శాతవాహన కాలంనాటి ఎరుపు జిలుగు కలిగి తెల్లటి రంగుతో చిత్రితములైన పాత్రావశేషములు. పెద్ద ఇటుకలు (42 × 21 × 6 Cms.) లభ్యమైనవి. గర్భ గుడి ఈ అవశేష స్థలమునకు మధ్యలోనుండుట ఇదివరలో విజ్ఞులు తలంచినట్లు, క్రీ॥ పూ॥ సంబంధించిన శివలింగ మును కలిగియుండుటను బట్టి అతిప్రాచీన ప్రతిష్ఠగానే భావింపబడుచున్నది. కాని ఇప్పుడున్న దేవాలయ కట్టడము మాత్రము క్రీ॥ శ॥ 9 వ శతాబ్దమునకన్న ముందున్నట్లు కనబడదు. గర్భాలయమున ఈ శతాబ్దమునకు చెందిన రాతి పరుపును, చతురస్రాకారపు పీఠము (రెండురాళ్ళను జోడించి చేసినది) (చిత్రము - 16) తీసి లోపలికి త్రవ్వకములను చేసితిమి. లింగము క్రింద భాగముననున్న గుహ్యాడు పూర్తిగా కానరానందునకూడ ఈ ఉత్ఖననము. అత్యంత అవసరమైనది కూడ. ఈ త్రవ్వక ఫలితములను క్లుప్తంగా వివరింతును.

(1) ప్రధాన దేవాలయములోని మూల విరాట్టు మొట్టమొదట, అనగా క్రీ॥ పూ॥ 1-2 శతాబ్దిలలో ప్రతిష్ఠింపబడెను. గుండ్రని రెండు రాతి పీఠములలోని (యోని), లింగము (అడుగు భాగమున చతురస్రాకారమైన స్తంభము) అమర్చబడెను. (చిత్రము 17—B). ఈ పీఠములు చాల నునుపుగా, లింగమెంత సుందరముగా నున్నదో అట్లున్నవి. కాని రాబుపేరు, ఇసుకరాయి ఈ నిర్మాణము కేవలము యోనిని బోలి యుండుట చాల చిత్రముగ నున్నది పీఠము చుట్టును 1.35 మీటర్లు పొడవులో నలుప్రక్కల చతురస్రాకారపు శిలా ప్రాకారము నిర్మింపబడెను. (చిత్రము—16). ఈ ప్రాకార చెక్కడము, స్తంభములశైలి, అమరావతి-మధురల స్తూప వేదికస్తంభములను బోలియుండుట గమనార్హము. ఈ స్తంభ ఫలకములపైని వివిధరీతుల పద్మములు, పూలు, చక్రములు మలచియున్నవి. ఈ కాలమునా దేవాలయ కట్టడము లేదు. కేవలము సవేదిక లింగమై ఆరు బయలు పూజింపబడుచున్నట్లు తెలియుచున్నది. ఈ లింగము దానిపైని శివుని ప్రతిమ అతి ప్రాచీనమైన శైవ పూజా విధానమును తెలుపుటయేగాక దక్షిణమున శైవ మత్యంత పురాతనమైనట్టిదని చాటి చెప్పుట కొక ప్రబలమైన యాధారమైనది. ఉజ్జయినిలో లభ్యమైన రాగి నాణెములపై (క్రీ॥ పూ॥ 2 — 3 శతాబ్దములకు చెందిన) గుడిమల్లము లింగమువలెనున్న చిత్రములు కలవు. (చిత్రము 18—B). అట్లే మధుర మ్యూజియంలో క్రీ॥ పూ॥ 1— వ శతా

బ్దికి చెందిన శిల్పము ఈ లింగమును బోలిన శిల్పమును చూపుచున్నది. (చిత్రము 20) ఇది చెట్టు క్రింద యెత్తైయిన ఆరుబయట వేదికలోనుంచి పూజింపబడుచున్న లింగముగా గోచరించును. ఈ సామ్యములు కొంతవరకే సరిపోవును. ఈ లింగ పీఠవేదికాస్థానము ఊరికి మధ్యగా నున్నటుల యాధారములు గలవు. పీఠములు రెండును అర్ఘ్యమునకే గాని అభిషేక జలము వెలికి పోవుట కనువుగా నెట్టి యమరిక కానరాదు. ఇక అర్ఘ్య మెట్టిది? అర్ఘ్యమును గూర్చివివరణము వీధి మధ్యగ వేదికలో బంధితుడైన యూరుద్ర లింగమునకు పచ్చి మాంసపు తునకలు ఆరగించినటుల త్రవ్వకముల లభ్యమయిన యెముక ముక్కలద్వారా తెలియుచున్నది (చిత్రము—19) వీటన్నింట కత్తితో చెక్కిన గాట్లు కానవచ్చినవి. నిప్పుతో కాల్చ లేక పండినట్లు కానరాలేదు. పొట్టేలు లేక మేక మరియు పంది మాంసము నారగించినటుల తెలియుచున్నది. శ్రీ కాళహస్తికి అతి చేరువలోనున్న ఈ రుద్రస్థానము క్రీస్తు పూర్వము 3-వ శతాబ్ది నాటిది! యిట్టి ప్రాచీన పూజాకైంకర్య విధానముల కాలవాలమై యున్నటుల పురావస్తు పరిశోధనలవలన ఋజువైనది. మన దక్షిణ సాంప్రదాయములో తిన్నడు కాళహస్తీశ్వరునికి మాంసము, పాలు. పుట్ట తేనెను అర్పించను దాన్ని ఆరగించుచున్నటుల-లింగ ముఖమునుండి కన్నీరు కారుచున్నంతనే, మహేశ్వరునికి తనరెండు కన్నులను వెలికితీసిసమర్పించిన మహోన్నత భక్తిగాథ చిరస్మరణీయము క్రీస్తబ్దము 7-వ శతాబ్దినుండి కన్నప్ప నాయనారుని కీర్తించి తరించిన ద్రవిడ కవుల (నక్కీరార్, సుందరమూర్తి, అప్పార్) గూర్చి యెరుగుదుముగదా! సరిగ్గా యిదే విధంగా గోవు లింగముపై పాలిచ్చుట, కీశము, మదపుటేనుగనుండి శివ లింగమును కాపాడుట కీటకము (సాలీడు) లింగమును కాపాడుటకై చుట్టూ నల్లుకొని యేనుగ తొండమున ప్రవేశించి దానిని హత మొందించుట, యిట్టి పెక్కు మహోన్నత భక్తిగాథలు సత్యదూరములు కాదు. రుద్రుని ప్రతి జీవరాశి కొలచుచుండెడిది ఆ భగవత్ రూపము అందరికి అందుబాటులో ప్రకృతిలో భాగముగా ఆరుబయట ప్రతిష్ఠింపబడెను. ప్రకృతి సిద్ధమైన తేనె, పాలు, మాంసము మున్నగునవి భక్తి ప్రపత్తులతో చరాచర జీవరాసులన్నియు సమర్పించుచుండెడివి. గుడిమల్లములోని ప్రతిమ మాత్రము లింగాగ్రముపై మరెక్కడను కాన రాలేదు. చదువరులెక్కడైన చూచినచో తెలియ జేయప్రార్థన.

ఇక ప్రధాన ప్రతిమను గురించి మరికొన్ని వివరముల తెలుపుదును. లింగముపై భాగము ఊర్ధ్వరేత శిశ్నినము బోలియున్నది. లింగోపరిభాగమున, మధ్యన, నరములవలె గీతలున్నవి. కావున రుద్రుని యిచ్చట లింగిగా చూపబడెనన్నమాట. లింగముఖస్తముగా చక్కని యవ్వనుడై శోభిల్లు అరుణారుణ రుద్రుడు మహాదేవుడు. స్వామి కన్నులు నాసికాగ్రమును చూచుటనుబట్టి యోగ లేక ధ్యాన పురుషుడుగను, విరూపాక్షుడుగను, చెప్పవచ్చును. (చిత్రము-17A) వామ భుజమున కానుకొని పరశువు, యెడమచేతిలో కుండిక - కుడిచేతిని హోమానంతరము వప తీశివైచిన పొట్టేలు (చర్మము) ను తలక్రిందుగా పట్టుకొని నిటారుగ నిల్చుకొనియున్నాడు. యజ్ఞపశువును అంగుష్ట - మధ్యమ అనామికలను చేర్చి వెనుక కాళ్ళను బంధించి యెత్తుకొనిపోవుచున్నట్లు యీ రుద్ర యజమానుని శిల్పించిరి ఆజ్యపాత్ర యెడమచేతి అంగుష్ట - తర్జనీల మధ్య నిడుకొనియున్నాడు. చక్కని ధోవతి, మేఖలతో బంధింపబడి, నుశువుముడి వేశిన వస్త్రబంధమున్నది. వస్త్రమున్నను పురుషుని లింగము ప్రేలాడుచు వెలికి కానవచ్చుచున్నది. ఇచ్చట రుద్రునిగా, శిశ్నదేవతగా ప్రతిమ కన్పించుచున్నది. ఋగ్వేద రూపమును నిర్ణయించి ప్రతిమను రూపొందించినట్లున్నది. రుద్రునికి యజ్ఞోపవీతము (జంధ్యము) లేదు ఈ ప్రతిమలో కూడనట్లే ఉన్నవి. ఈ రుద్రుడు (నిల్చుని ఉన్నందున) చలమూర్తి. క్రిందనున్న గుహ్యాని భుజస్కంధములపై ధృఢముగా నిల్చుకొనియున్నను. త్వరితగతిని ముందుకు సాగుచున్నట్లు సంసిద్ధుడుగా కనపడుచున్నాడు. వేలాడుచున్నట్లున్న

రేతము కామ పిసాసియైన రుద్రుని సూచించుచున్నది. మొదలు లింగమును గమనించిన ఊర్ధ్వరేతమని చెప్పక తప్పదు. అనగా రుద్రుడు సంకేతరూపమున మహాయోగిగను పురుషరూపమున కాముకుడుగాను చూపబడెను. తలపాగ చిత్రమైనది. పట్టబంధమున నొసలుకు పైగా బంధింపబడెను. రుద్రజటములు శిరముపై అగ్నిజ్వాలలను బోలియున్నవి. (లేక నత్తగుల్ల చిప్పలవలె) మొగలి పూవును-జడగానల్లి జటములను ఇరు వైపులనుంచి ఉష్ణీషమును అలంకరించిరి. ఈ మొగలిరేకుల తలపాగ మిక్కిలి ప్రశస్తమైన అలంకారము. యేలనన పౌరాణిక కాలమున శివపూజా విధానములో కేతకి నిషేధిపబడెను. కాని రుద్రునికి మహాప్రీతిపాత్రము కేతకి మరియు సర్పము.

శివపూజా విధానమున ఈ శ్లోకము గమనింపుడు

" నాక్షతైఃఅర్చయేత్ విష్ణుః। నతిలస్య గణేశ్వరమ్। దూర్వారైః నార్చయేత్దుర్గం। నకేతక్యాం మహేశ్వరమ్"॥

ఒకప్పుడు కేతకి అనగా మొగలిపువ్వు. శివునికత్యంత ప్రీతి పాత్రమైన పుష్పరాజమై జటలలో నలంకరింపబడియుండెను. బ్రహ్మదేవుడు లింగాగ్రమును చూడ నిచ్ఛగల్గి పైకి పోవుచుండ మధ్యమార్గమున కేతకి కనుపించగా తానెక్కడినుండి వచ్చితివని ప్రశ్నింప శివలింగాగ్రమునుండి దిగుచుండినని గర్వముతో నుడివెను. కేతకి సహాయమున బ్రహ్మలింగమునుండి దిగివచ్చి విష్ణుమూర్తికి తాను శివుని లింగాగ్రమును చూచితిననియు, ఆ మహేశ్వరుని తలపై నీ కేతకిని వెంట నిడుకొనివచ్చితినని అనృతము పల్కెను. విష్ణుభగవానుడు నిజమెరిగినంత, బ్రహ్మను, కేతకిని పూజార్హములు కావని శపించెనని గాథ ఉన్నది

ఇట్లు ఈ చిత్రమైన ప్రతిమ శివుని పెక్కు స్వరూపముల నొకే మూర్తిలో చూపుచున్నది. శైవాగమములో ప్రత్యేక స్థానమును బొందుచున్నది. ఈ విధంగా పలు రూపముల నొక్క విగ్రహములోనే పొందు పరచి చూపిన శిల్పము మరెక్కడను కానరాదు. ఇట్టి సంయుక్త ప్రతిమయే తరువాత వివిధ రూపములలో ప్రత్యేకముగా శివుని చూపుటకు దోహదమైయుండునని నా యభిమతము. యేలనన ఈ దేవాలయమును పూర్తిగా కట్టించి, పెద్దదిగా చేసిన తరువాత - పల్లవులు - చోళులు - బాణులు వివిధ రూపములలో శివుని ప్రతిమలను విడివిడిగా (దక్షిణామూర్తి, కంకాలమూర్తి, పశుపతమూర్తి, వీణాధర, ఉమా సహితమూర్తి) దేవకోష్ఠములయందు ప్రతిష్ఠించిరి ఈ వేదిక లింగము చుట్టును చేసిన త్రవ్వకములలో క్రీ॥ శ॥ 2 - 3 శతాబ్దములకు చెందినట్టి, ఇటుకలతో కట్టిన, గజపృష్ఠాకారపు గుడి గోడ కూడ బయల్పడినది - దీనిని బట్టి క్రీ॥ శ॥ 2 - 3 శతాబ్దములలో బహుశ శాతవాహన ఇక్ష్వాకుల కాలమున ఈ లింగము చుట్టును దేవాలయము కట్టియుండవచ్చును. ఈ ఆలయము శిథిలమగుటచే, పల్లవ - బాణ - చోళులు దీనిని రాతితో, అదే ఆకృతిలో విశాలముగా కట్టి కొన్ని మార్పులు, కూర్పులు గావించిరి అప్పటి వాస్తును బట్టి లింగము చుట్టునున్న వేదికను, గుండ్రని యోని పీఠమును, పూడ్చి వేయటం జరిగినది చతురస్రమైన చిన్న పీఠికనుమాత్రముచేసి అభిషేక జలము పోవుటకు పణాళిని (అనగా, అభిషేక జలం వెలుపలికి ప్రవహించుటకు మార్గం కట్టించిరి) గావించిరి. ఇట్లు ఈ దేవాలయపు త్రవ్వకముల ఫలితంగా వివిధ ఆరాధనా పద్ధతులను, కట్టడ శైలిలోని మార్పులను వెలికి తెచ్చుటయే కాక అత్యంత పురాతనమైన చిత్రమైన *రుద్రలింగ ప్రతిమ* క్రీ॥ పూ॥ 3-వ శతాబ్దములలో ప్రతిష్ఠితమై ఇప్పటి వరకు పూజలోనుండి నటుల తెలినది. ఆంధ్రమున శైవాగమము, ఉత్తర దేశము నంత ప్రాచీనమో, అట్లేననిగూడ నిర్ధారణ యగుచున్నది. బౌద్ధ కట్టడ మెంత ప్రాచీనమైనదో వివిధ రీతుల వృద్ధిచెందెనో అట్లే శైవ - వైష్ణవ వాస్తు విధానములు కూడననిగట్టిగా చెప్పవచ్చును. ప్రాచీన వాస్తుశాస్త్రము నిట్లు పలు మతములు, శాఖలు అనాదిగా వుపయోగించుకొన్నవని భావింపవచ్చును. యావత్ భారతమున మనమెరిగిన ప్రాచీన రుద్రలింగమిది ఒక్కటే, మరెక్కడను యిట్టి రూపము కానరాలేదు.

## ఉపయుక్త గ్రంథములు

1 ఇంగువకార్తికేయశర్మ, "ది డెవలప్‌మెంట్ అఫ్ యెర్లీ శైవ అర్ట్ అండ్ ఆర్కిటెక్చరు") న్యూఢిల్లీ, 1982). పుటలు 39 - 67. 2) ఇంగువ కార్తికేయశర్మ, "రిలీజియన్ ఇన్ ఆర్ట్ అండ్ హిస్టారికల్ ఆర్కియాలజీ ఆఫ్ సౌత్ ఇండియా కాంటాక్ట్స్ అండ్ కోరిలేషన్స్, మద్రాసు, 1987).

# ఆంధ్రదేశమున శైవము - అమరావతి చతుర్ముఖ శివలింగము

మౌర్య కాలమునుండి బౌద్ధ చైత్యారామములతో జగత్ప్రసిద్ధి గాంచిన గుంటూరు మండలములోని అమరావతి క్రీ. శ. 8-9 శతాబ్దినుండి శైవక్షేత్రముగా కూడా పవిత్రమయ్యెను. బౌద్ధ - శైవములు రెండునూ సమానముగా గౌరవింపబడినట్లు కోటకేతరాజోసగిన (క్రీ. శ. 1182) అమరావతిలో లభించిన శాసనముల వలన తెలియుచున్నది.

అస్తిశ్రీ ధాన్య కటకం పురం సుర పురాత్ పురం యత్ర అమరేశ్వరః శంభు రసురేశ్వర పూజితః॥
బుద్ధ దేవస్య సాన్నిధ్యాత్ యత్ర ధాత్రీ ప్రపూజితా। చైత్య మత్యున్నతం యత్ర నానా చిత్ర సుచిత్రితం॥

బౌద్ధ వాస్తు శిల్పగతిని గూర్చి నేనిదివరలో కొన్ని వ్యాసములను 'భారతి' లో (ఆగస్టు 1975, పుటలు 16-27 మరియు నవంబరు 1976 పు. 5-10) ప్రచురించియుంటిని. ప్రస్తుతం ఇచ్చట అమరావతిలో లభ్యమైన యొకమహత్తర ముఖలింగమును గూర్చి తెలుపుదును.

భారతి, ఆగస్టు - 1974 సంచికలో గుడిమల్లము శివాలయమున గావించిన పురావస్తు పరిశోధనల ఫలితంగా (iii), అచ్చటి శివలింగ ప్రతిష్ఠ క్రీ॥ పూ॥ 3,2 శతాబ్దిల జరిగినట్లున్నూ, శైవము ఆంధ్రతీర దేశమున పతంజలికాలము నాటికే ప్రబలి యుండినట్లుగాను పేర్కొంటిని. కానీబౌద్ధమువలె బహుళ ప్రచారములోనికి వచ్చినట్లు కనబడదు. ఇచ్చట వివరించబడిన ఈ చతుర్ముఖ శివలింగము క్రీస్తబ్దమున శివపూజా విధానమేరీతిగ నుండెనో తెలుసుకొనుటకొక ప్రబల ఆధారమై ఉన్నది. *చతుర్ముఖలింగము*:- (చిత్రములు - 21, 22)

ఈ చిన్న లింగము లేత పచ్చని పలనాడు సున్నపు రాయితో కావింపబడినది. అమరావతిలోని శిల్పములన్నియు నీ రాతితో మల్చబడినవే. ఈ లింగముయొక్క యెత్తు యేడు సెంటీమీటర్లు, వెడల్పు ఆరు సెంటిమీటర్లు. ఈ శిల్ప ఖండము 1954-55 లో డా॥ రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారివద్దకు చేరినది. రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడుగారి భవంతి - అమరేశ్వరాలయమునకు చేరువగానున్న "కోట దిబ్బలనెడి" యెత్తైన పాడు భూములలో లభ్యమైనట్లు తెలియుచున్నది. ప్రస్తుతము ఈ చిరులింగము హైదరాబాదులోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపురావస్తుప్రదర్శనాలయమందు భద్రితము అయి ఉన్నది. డా॥ యన్. రమేశన్‌గారు నాయందు దయతో ఛాయా చిత్రముల బొందుట కనుమతించిరి. ఈశిల్పందాచేపల్లి సుద్దరాయి కాన కొంత మేరకు అరగిపోయి చిన్న ముక్కలుగా విడిపోయి పైనక్రిందున పగిలిపోయి యున్నది. ఈ లింగమును కొయ్య లేక రాగితో చేసిన పీఠముపై నధిష్ఠించినట్లు తోచుచున్నది. అడుగు భాగమునకూడ యించుక యరిగిపోయియున్నది. పరిమాణమును బట్టి యీ లింగమొక శివోపాసకుని అర్చలింగముగా దేవతార్చన పేటికలో నుంచబడి పూజాభిషేకము లందుకొనుచుండినదిగా భావింపనగును. ఇట్టిది చల లింగమైన మానుష లింగముల కోవకు చెందినది. చిత్రమేమన రుద్ర లేక పూజా భాగమున నాల్గుదిశల కేంద్రీకరించిన ముఖములు కలిగియుండుట. (చిత్రములు - 21. 22). ఈ ముఖ కవళికలు, శిల్ప శైలినిబట్టి యిది క్రీ॥ శ॥ 1-2 శతాబ్ది శాతవాహన కాలమునాటిదని నిస్సందేహముగా చెప్పనగును. అమరావతిలోని ప్రదర్శనాలయమందున్న అర్ధ శిల్పముల కత్యంత సన్నిహితమైన రీతిలో యాశిల్పులే కావించిరని చెప్పుటకు వీలగుచున్నది.

## ముఖలింగ తత్త్వము:-

శైవాగమమున సదాశివుడు పరిపూర్ణ స్వరూపుడుగా, మహాయోగిగా మహాశక్తి సమన్వితమైన నిశ్చలమూర్తిగా పేర్కొనబడినాడు. ఐదు ముఖములున్న నీ లింగ రూప - నిష్కల శివుని తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాత మరియు ఈశాన స్వరూపునిగా నిర్ణయించిరి. ఈ ఐదు లక్షణములను పంచ బ్రహ్మములుగాకూడానెంచి - పరమాత్మ ప్రపంచము, బుద్ధి, అలంకారము మరియు భక్తి విజ్ఞాన తత్త్వముల నాపాదించిరి. ఈ పరమేశ్వరునిగూర్చి నారాయణోపనిషత్తు నందలి తైత్తిరీయ ఆరణ్యకమున (X. 43 - 47) సద్యోజాతాది మంత్రములలో వివరణ కలదు. వేద భాష్యకారుడైన సాయణాచార్యులవారు శివుని పంచభూత శక్తి స్వరూపునిగా పేర్కొని, నాల్గు ముఖములు నలు దిక్కుల, పై లింగ రూపము ఈశానునిగా ఆకాశమును సూచుచున్నటుల వివరించియుండెను. సాయణాచార్యుడు (క్రీ. శ. 1336 - 1404) విజయనగర పుర ప్రభువైన రెండవ హరిహరుని కాలమున బ్రాహ్మణక్రాక - కావలి ప్రాంతములందు పలువురు వేద భాష్యకారులతో కలసియుండి నటుల శాసన పూర్వకముగా తెలియవచ్చినది.

ఈ సదాశివ తత్త్వము చాలా ప్రాచీనమైనది. క్రీ శ, 5వ శతాబ్దినాటి విష్ణు ధర్మోత్తర పురాణమున ''శంభోర్ వదన పంచకమ్'' యని సంబోధన కలదు. అపరాజిత పృచ్ఛయను వాస్తు గ్రంథమున ద్వాదశ రుద్రారాధనలో యీ పంచముఖ మూర్తులను గూర్చి ప్రశక్తి కలదు. కారణాగమమున పంచముఖ శివలింగమును "శరాననం'' యని వర్ణింపబడుట గమనార్హము. శరము అనగా బాణము, ఐదు ముఖములు గలది. రూప మండనమున ఈశాన్య శివుని స్వరూపము యోగీశ్వరులకు కూడ అవగాహనకు మించినదై యున్నట్లు చెప్పబడినది.

## యోగినామప్యగోచరం :-

ఈ ముఖ లింగములు పలురకములు, రుద్రభాగమున ఒకటి, రెండు, మూడు, నాలుగు, లేక అయిదు ముఖములుగలిగి నలుదిక్కులు చూచుచున్నని, పాశుపత శైవులీ సద్యోజాతాది మంత్రముల ''బీజ'' మంత్రములుగా నుపాసించిరి. కౌండిన్యుడు పంచార్ధ భాష్యమున అట్లే పేర్కొనియున్నాడు. ఆగమశాస్త్రములందు ఈ పంచ ముఖములు పంచభూత శక్తులతో మేళవింపబడెను, అ॥ తూర్పు ముఖము - తత్పురుషుడు (చిత్రము - 21, A). ఈ ముఖము వాయుశక్తి స్వరూపముగా చెప్పబడినది, విశాలమైన ఫాల భాగము, కనుబొమలు, పొడుగాటి నాశిక, మిడిగుడ్లు, ఆకర్ణాంత కుండలములు భుజస్కంధములపై బడియున్నవి. కుడి చెవిని ఘట కుండలము, యెడమ చెవిని ముక్తసర కుండలము, శిరమున బావుటావలెనున్న కరండమకుటము, దాని యిరువంకల ముకుళిత పద్మములతో అలంకరింపబడినవి. ''తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహీ తన్నోరుద్రః ప్రచోదయాత్॥

ఆ. దక్షిణ ముఖము - అఘోరుడు, (చిత్రము - 21, B)

ఈ ముఖము, అగ్నిస్వరూపమును సూచించుచున్నది. ''సర్వాణి సౌమ్య రూపాణి దక్షిణం వికటంముఖం'' ఉగ్రముగా నోరుతెరచుకొనియున్నాడు, శిరమున జటామకుటము నిటారుగా జ్వాలలవలె నున్నది. ఘోర, ఘోరతర లక్షణ సమన్వితమైన రుద్రుని కూడ ఈ ముఖమున చూడనగును,

''అఘోరేభ్యో థఘోరేభ్యో ఘోర ఘోరతరేభ్యః
సర్వతః సర్వ సర్వేభ్యో నమస్తే అస్తు రుద్ర రూపేభ్యః॥

ఇ. పశ్చిమ ముఖము — సద్యోజాతుడు (చిత్రము - 22, A)

భూమికి ప్రతి రూపముగా పూజింపబడునట్టిదీ సద్యోజాత లేక నందివక్త్రము. చక్కని ముఖ కవళికలు కల్గి యున్నది. తీర్చిన పలువరుస, శిరముపై కరండ మకుటమును ధరించి యున్నను. యిరువైపుల జటములు కానవచ్చు చున్నవి, ఫాలభాగమున త్రినేత్రముగా కానవచ్చినది పగిలి - అరిగిపోయిన భాగము. ముక్కుకూడ పగిలిపోయిఉన్నది.

"సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమోనమః
భవే భవేన అతిభవే భవస్వమామ్ భవోద్భవాయనమః॥"

ఈ. ఉత్తరముఖము - వామదేవుడు :- (చిత్రము - 22, B)

మహాదేవుని వామభాగముగా పంచభూతములలోని జలమును సూచించుచున్నది ఈ వామదేవరూపము, కపర్ది జటములతో నొసటిపైని మకుటమణి, పట్టబంధముగల్గి అత్యంత రూపసిగా కనుపించు చున్నాడు. క్రీగంటి చూపు, విశాలమైన కనుహోయలు ఉమా స్వరూపమును మరపించుచున్నది,

"వామ దేవాయ నమో జ్యేష్ఠాయనమః శ్రేష్ఠాయ నమో రుద్రాయనమః
నమః కల వికరణాయనమో బల వికరణాయనమః
నమో బలప్రమథ నాయనమః సర్వభూతదమనాయ నమో మనోన్మ నాయనమః

ఈ వామదేవుడు నవలక్షణములు కల్గియున్నాడు. జ్యేష్ఠ, శ్రేష్ఠ, రుద్ర, కాల కలవికరణ, బలవికరణ, బల ప్రమథన, సర్వభూత దమన, మనోన్మన యని పిలువబడినాడు,

ఐదవ ముఖము — ఈశానుడు :-

అగోచరమైన, అరూపమైన యాకాశమును చూచుచున్నది లింగోపరిభాగము. ఈశానునిగా గ్రహింపబడినది. నిత్యాభిషేక ప్రియుడైన శివుని నున్నటి లింగాగ్రము మహా పవిత్రమైనది, అన్ని విద్యలకు, సర్వభూతములకు పరమేశ్వరుడు. వేద బ్రహ్మమైన మహా సదాశివుడు.

"ఈశానః సర్వవిద్యానాం ఈశ్వరః సర్వభూతానాం॥
బ్రహ్మాధిపతిః బ్రహ్మణోధిపతి బ్రహ్మా శివోమే అస్తు సదాశివోం।"

పైన చూపబడిన ముఖములపై నెక్కడను మూడవ కన్ను కానరాదు. కాని ఆగమముల వామదేవునికి తప్ప తక్కిన ముఖములు త్రిలోచనములు కలిగియున్నవి. (త్రిలోచనమ్ సర్వాణి వామదేవం ద్విలోచనమ్) ఈ కోవకు చెందిన లింగముల పైని ముఖములు స్తన సూత్రము వరకు మాత్రమే నుండవలెను. కాని యిచ్చట కేవలము కంఠము వరకు ముఖములుండుట గమనింపవలసి యున్నది. ఈ లక్షణములబట్టి ఈ ముఖ లింగము ఆగమ శాస్త్రములకు పూర్వకృతిగా నెర్పుంగవలయును. క్రింద భాగము యించుకచ్ఛిద్రమైనది.

**అమరావతిలోని శైవము:-** ఈ చతుర్ముఖ లింగమిచ్చోట లభ్యమగుట చాలా జుగుప్సాకరమైన పరిశోధనలకు నాందీ భూతమైనది. ప్రాచీనముగా శైవమేరీతిగా యుండెనో? యెట్లు వ్యాప్తి చెందెనో? కారకులెవరో? యెక్కడి వారో? మొదలగు ప్రశ్నలుద్భవించుచున్నవి. అమరావతి — ధరణి కోటలు హీనయాన — మహాయాన బౌద్ధములకు కూడలి సంగమములై బహుముఖ ఖ్యాతి గాంచినవి. ఈ అర్వాచీన చరిత్ర యుగమున శైవము ఈ తీరాంధ్రమున వ్యాప్తికి రాలేదని పలువురు దృఢముగా బల్కిరి. శైవమున్నటుల నిరూపించుట కెట్టి వాస్తు కట్టడములుగాని, శిల్ప శిలా శాసనాదులుగాని తెలియ రాలేదు. పైన చూపిన శివలింగమును బట్టి అమరావతిలో మహేశ్వరుని పూజ, క్రీ॥ శ॥ 1 — 2-వ శతాబ్ది శాతవాహనుల రాజ్య పరిపాలనలో యాచారముగా నుండెనని నిర్దుష్టమగుచున్నది. కొన్ని శతాబ్దుల తరువాత, పంచారామక్షేత్రములలో నొకటిగా ఖ్యాతి గాంచినది అమరావతిలోని అమరేశ్వరాలయము. కృష్ణానది గట్టున విశాల ప్రాకారములతో దక్షిణముగా గోపుర ద్వారశాలతో ఈ పట్టణము విలసిల్లినది. తక్కిన నాల్గు ఆరామక్షేత్రములలో, చేబ్రోలులోని భీమేశ్వరాలయము. మిగతావి గోదావరి తీరమున గలవు. ఇవి సామర్లకోటలోని భీమేశ్వర క్షేత్రము, ద్రాక్షారామములోని భీమేశ్వరాలయము మరియు పాలకొల్లులోని క్షీరారామము, ఈ శివక్షేత్రములన్నియు చాళుక్యనృపతియగు భీమేశ్వరుని (క్రీ॥ శ॥ 892-921) కృతములు. ఈ ఆలయములు అన్నింటిలో గర్భ గృహములోని లింగము దాచేపల్లి సున్నపురాయి కృతమై రమారమి 6 మీటర్ల యెత్తుగా నున్నది. చాలా పొడవుగా నుండుటచే కాబోలు గర్భగృహము రెండతస్తుల భవంతిగా నిర్మితమయ్యెను. క్రింద అంతస్థున లింగము చుట్టు పెద్ద పీఠమున్నది. అర్ఘ్యపాద్యాదులు ఈ పీఠముపై జరుగుచున్నవి. లింగముయొక్క బ్రహ్మభాగమెంత లోతున పీఠములో అమర్చబడినదో? ప్రతిష్ఠా విధానమెట్లు? యెప్పుడు? చేయబడెనో చెప్పజాలము. గుడి మల్లము గర్భాలయమున జరిగినట్లుగా, ఇచ్చటగూడ తవ్వకములు జరిపి పరిశోధన చేయవలసిన అవసరమెంతేని కలదు. విష్ణు, రుద్ర భాగముల చూపుటకుగాను లింగార్ధ భాగమున బ్రహ్మసూత్ర రేఖ గావించిరి. లింగో పరిభాగమున చతురస్రపు గుంట కలదు. అభిషేకము పై అంతస్తునుండి చేయుదురు.

ఈ పొడుగైన లింగము, నలుపలకల స్తంభమువలె చాలా పెద్దది. బౌద్ధ స్తూపములందు ఆయక స్తంభముల పోలియున్నది. లింగాగ్రమున కానవచ్చు గుంట, స్తంభముపైని గూర్చెడి చిహ్నముల బిగింపుకై నుద్దేశింపబడినది. ఈ చిహ్నములు - ధర్మ చక్రము, యేనుగ, వృక్షము, చైత్యము మొదలగు పూర్ణ శిల్పఫలకములు. శైవులిట్టి అయక స్తంభముల గుండ్రముచేసి. ఉపరి భాగమున లోహపు శేషనాగమునో లేక అభిషేక కుంభముతోనో యలంకరించిరి. ఈ శైవ క్షేత్రములైదున్ను, బౌద్ధ స్థలములందు నెలకొన్నవగుటచే "**పంచారామము**" లన్న పేర్లు వాడుకలోనికి వచ్చినట్లు తోచుచున్నది.

## శాతవాహన కాలమునాటి శైవము:-

శాతవాహన రాజులు బౌద్ధము నాదరించినను ఆ మతము నవలంబించలేదు. మొదటినుండి కూడ వైదిక ఆచారముల, ధర్మక్రతువులను మిక్కిలి శ్రద్ధతో పాటించిరి, ఈ వంశజులు విష్ణుభక్తులు. సూర్యనారాయణుడు వీరి కులదైవము. కానీ క్రీ॥ శ॥ 1 — 2 వ శతాబ్దినుంచి కుషాణ - క్షత్రపులతోటి వీరికి సంబంధము పెరిగినది. అంతవరకు విజృంభించియున్న బౌద్ధము. పాళీ ప్రాకృతముల ప్రాబల్యము క్రమేణ క్షీణింపసాగెను. వైదిక సాంప్రదాయము, ముఖ్యబ్రాహ్మణ మతములైన శైవ - వైష్ణవములు వృద్ధిలోకి వచ్చినవి. పరదేశీయులైన క్షత్రప - కుషాణ

చక్రవర్తులను యీ వైదిక మతము. శైవ - వైష్ణవ - శాక్తములు మిక్కిలిగా యాకర్షించినవి. మధుర గొప్పకూడలి యైనది. సంస్కృతమును వీరు శాసనభాషగా మొట్టమొదట గుర్తించిరి. ఈ వంశజులు వారి అనుయాయులు హిందూ నామములను కూడ పెట్టుకొనిరి, మహాక్షత్రపరుద్రదమన, వీర దమన, యశోదమన మున్నగునట్టివి పేర్కొనవచ్చును. శాతవాహన సామ్రాట్టు గౌతమీపుత్ర సాతకర్ణి వైదిక ధర్మములను కడు శ్రద్ధతో పరిరక్షించెను, ఆయన సంతతి కూడ బ్రాహ్మణ మతమును నవలంబించిరి. తమ కుమారులకు నామములుగూడ శివస్కంద శాతకర్ణి, శివశ్రీపుళుమావి యని పెట్టుకొనిరి. రుద్ర సాతకర్ణి విష్ణు రుద్ర శివలానంద శాతకర్ణి యనికూడ నీ శాతవాహన వంశ బంధువులు కూడ పిలువబడిరి. దక్షిణాదిన యజ్ఞశ్రీ శాతకర్ణి మొట్టమొదలుగా శాసనములందు సంస్కృత భాషను ప్రవేశపెట్టినట్లు అమరావతి శాసనమువలన తెలియుచున్నది. ఇటీవల కాలంలో జరిగిన కృష్ణా పుష్కరములలో (1980) అమరేశ్వర దేవాలయ ప్రాంగణమును పునరుద్ధరించిరి. ఈ కార్యక్రమములో నొక పెద్ద నందీశ్వరుని విగ్రహము లభించినది (1.30 మీ॥ యెత్తు) ప్రస్తుత మీ శిల్పరాజము అమరావతి మ్యూజియములో ప్రదర్శితము. (చిత్రము-23), ఈ నంది విగ్రహము శాతవాహన కాలమునాటిదని చూడగనే చెప్ప వీలగుచున్నది లింగమున కెదురుగా దేవవీక్షణతత్పరుడుగా సుప్రతిష్ఠితము. అమరావతిలోగల అమరేశ్వరాలయము క్రీస్తుశకము మొదటి శతాబ్దిదిగా ఈ శిల్పము వలన నిశ్చయమగుచున్నది. పరిశీలించినచో. సంస్కృతభాష, శైవములతో మిక్కిలియవినాభావ సంబంధమున్నటుల తెలియుచున్నది. క్షత్రప - శాతవాహనుల కాలమున పునరుజ్జీవముతైనట్లున్న తేలుచున్నది. ఆ తరువాత సాతవాహనాంత రీకులైన ఇక్ష్వాకులు, విష్ణుకుండినరాజులు, పల్లవులు సంస్కృత భాషను శైవమతమును మిక్కిలిగా పోషించి రాజశాసనములందు భాషగా సంస్కృతమునే ఉపయోగించిరి,

శైవమత వ్యాప్తికివీరొనరించిన సేవ, వీరునిర్మించిన ఆలయములు, దేవతామూర్తులు మరొకచోట వివరింతుము, ఆకాలమునాటివి, ఇటీవల కొన్ని ప్రాచీన శైవాలయములుకూడ బయల్పడినవి, జలాంతర్గమైపోవు శ్రీ శైలము జల విద్యుత్ ప్రాజెక్టు లోయలలో కృష్ణా - తుంగభద్ర - భావనాశి నదుల సంగమ స్థానముల పెక్కు శైవాలయ కూటములున్నవి. ఇవన్నియు కళ్యాణి చాళుక్యుల (క్రీ. శ. 7 వ శతాబ్ది) కాలము నుండి విజయనగర ప్రభువుల కాలము వరకు మహత్తర తీర్థక్షేత్రములుగా విలసిల్లినవి. ఇవిగాక తవ్వకాల్లోను పరిశోధనలవలననూ ఇటీవల కొన్ని ప్రాచీన యిటుక దేవాలయములు బయల్పడినవి. కాలాంతరముగా శిధిలమైన ఈ కట్టడముల స్థానముననే చాళుక్యరాజులు రాతి దేవాలయములను నిర్మించిరి. ఇట్టుతీర్థప్రదేశములన్నింటిని పరిరక్షించి వాటి మహిమను విస్తరింపచేసిరి. ముఖ్యముగ గమనింపవలసినది ఏమనగా ఈ అన్ని ఆలయములు శైవాగమ నిర్మాణములు.

ముఖ్యమైన కొన్నింటి మాత్రము యిచ్చట పేర్కొన వీలగును. మహబూబునగరు జిల్లాలోని కూడలి సంగమేశ్వరము, రంగాపురము, కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకాలోని సిద్ధేశ్వరము, వీరాపురము మున్నగుచోట్ల బయలుపడిన యిటుక దేవాలయములు చాల ప్రాచీనమైనవి. వీరాపురమున కృష్ణానది కుడిగట్టున సుమారు 14- చిన్న ఆలయములు ప్రాకారముతో సహా వెలికి వచ్చినవి. ఒక్కొక్క గుడి మూడు మీటర్ల చతురస్రపు కట్టడము, అర్ధ చంద్రాకారపు మెట్టుతో ద్వారము, గర్భాలయమున మధ్యగా నెత్తైన యిటుక అరుగుపై స్వయంభువ లింగము ప్రతిష్ఠింపబడినది. కొన్నింట అరుగుపై రాతిపీఠము ప్రణాళికతోసహా ఉన్నది. దీనిని బట్టి అభిషేక అర్చనలు జరుగుచుండెడివి. ప్రణాళిక ప్రక్క గోడలో నొక చిన్న మూయబడిన యిటుకలతో కట్టినకాలువకు చేర్చబడినవి. అభిషేక జలము బయటికి పోయెడి విధముగా నమరిక గలదు. ప్రదక్షిణము వెలుపలగా చేయ వీలగు యిటుక పరుప్ప నేల కలదు. ఈ చిన్న ఆలయములు ఒక దాని కొకటి యెట్టి సంబంధము లేక విడివిడిగానే ఉన్నవి. ద్వారముఖములుకూడ

యే ఒక్కదిక్కున నిర్దేశించబడినట్లులేదు. అప్సరసణాళికలుగూడ. గర్భాలయమున వెలుపల లభ్యమైన మట్టి పాత్రలు, సీసపు నాణెములు ఈ కట్టడముల కాలమును నిర్ణయించుటకెంతో యాధార భూతములు అయి ఉన్నవి. ముఖ్యముగా సీసపు నాణెములు మన యిప్పటి రూపాయలవలె పెద్దవి. యేనుగు చిహ్నముగలదు అంచున గుండ్రముగా బ్రాహ్మీ లిపిలో (1) మహారథిశివఖడ, (2) మహారథి శివపుశమానిస-మున్నగు రాజులపేర్లు తెలుపుచున్నవి. ఈ మహారథి వంశజులు, శాతవాహనుల కాలమున కర్నాటకములోని వనవాశి, చిత్రదుర్గ ప్రాంతముల, తెలంగాణములోని కరీం నగరు, వరంగల్లు, ఆదిలాబాదుజిల్లాలలోను చిన్న సంస్థానాధీశులుగా కొంతమేరకు పాలించుచుండిరి. వీరి నాణెములు క్రీ. శ. 1 వ శతాబ్ది మొదటి భాగమున చలామణి యగుచుండెను. గౌతమీ పుత్ర శాత కర్ణి దక్షిణ దిగ్విజయముచేసి యీ చిన్న స్వతంత్ర రాజ్యములను శాతవాహన సామ్రాజ్యమున కలుపుకొనెను. ఈ మహారథివంశీయులు పూర్వపు శాతవాహనులతో బాంధవ్యమును బొందియుండిరి. పైన లభించిన సీసపు నాణెములవలన, మృణ్మయ పాత్రలవలన యీ యిటుక ఆలయములన్నియు క్రీ. శ. 1 వ శతాబ్దివిగా నిశ్చయముగా చెప్పనగును. ఈదేకాలమునకు చెందిన మరి యొక ఆలయపు పునాదులు రంగాపురమనుచోట లభ్యమైనవి. కర్ణాటకములోని వనవాశి. ఐహోళెలోని రాతి దేవాలయ ముల క్రింద, ఇటుక ఆలయముల పునాదులు లభ్యమైనవి చాళుక్యుల కాలమునకు పూర్వము ఈ కట్టడములు నిర్మి తములైనట్లు నిశితముగా తెలియుచున్నది. యజ్ఞశ్రీ శాతకర్ణి సీసపు నాణెములు ఈ దేవాలయ స్తరములలో లభించు టచే, శైవవాస్తు శిల్పములీ శాతవాహనుల కాలమునాటికే స్థాపింపబడినవని దృఢముగా చెప్పవచ్చును. తరువాత రాజ్య మునకు వచ్చిన చాళుక్య వంశీయులు, యిట్టి పవిత్ర స్థలముల, తీర్థక్షేత్రములను ప్రసిద్ధిగావించిరి, రాతి కట్టడములతో శిల్ప శాసనముల గావించిరి.

ఉత్తర దేశమున ఉద్భవించిన వైదిక బ్రాహ్మణ మత ఆచారములు, పెక్కు శైవశాఖలు ముందుగా ఆంధ్రదేశ మున సుస్థావరము లేర్పరచుకొన్నవి. కాలాను గతముగా వృద్ధిపొంది దక్షిణ దేశమునకు వ్యాప్తి చెందినవి.

---

# పెద్ద వేగిలో లభించిన శైవ ప్రతిమలు

నేటిఏలూరు నగరానికి ఉత్తరమున 12-కిలో మీటర్లదూరమున పాడుపడియున్న గ్రామము పెద్దవేగి. చారిత్రకంగా యీ స్థలము ఆంధ్రావనికి ముఖ్యనగరమైన వేంగీపురముగా ఖ్యాతిచెందినది. ఇటీవల కేంద్రప్రభుత్వ పురాతత్వ సర్వేక్షణ పనుపున నేను గావించిన పరిశోధనల ఫలితముగా కొన్ని యపురూప శైవమూర్తులు లభించినవి. ఈ శిల్పములు క్రీస్తుర్వము 4-6 శతాబ్దిల నాటివని తెలియుచున్నది. ఇవిగాక తూర్పు చాళుక్యుల కాలమునకు చెందిన ఆలయ శిల్పములు, ప్రతిష్ఠామూర్తులు చాలా లభించినవి. ఇందు ముఖ్యమైన వాటిని వివరింతును.

*1. సోమాయ ఫలకము* (చిత్రము - 27 A). ఈ ఫలకము దాచేపల్లి తెల్లరాయి కృతము. దీర్ఘ చతురస్రము. 12 సెం. మీ. పొడవు 9 సెం. మీ. యెత్తు, మరియు 2.1 సెం. మీ. మందము కల్గియున్నది. పార్వతి పరమేశ్వరులు నొకే ''మంచక'' యధిష్ఠానముపై సుఖాసీనులైయున్నారు. "సుఖాసీనం సహోమాయ'' శివుని

జటలు చక్కగా బంధింపబడినవి. త్రినేత్రమున్నది. యజ్ఞోపవీతము మూడు పాయలదిగా కానవచ్చుచున్నది. అర్ధపర్యంకాసనమున అమ్మవారు శివుని వామభాగమున తొడపై కూర్చొనియున్నది. మహేశుడు యెడమచేతితో అమ్మవారిని దగ్గరగా తీసుకొనియున్నాడు, ఇరువురు నూతన దంపతులు. విలక్షణమైన సుఖవర్చస్సుతో ఈ ఆది దంపతులు వేంగీపురవాసులకు అర్చాదేవతలైరి. చిన్న ఫలకముగాన ఇదియొక శివభక్తుని పూజామందిరమున క్రీస్తుబ్దము 4-5 వ శతాబ్ది భక్త్యోపచారములను అందుకొనుటకు స్థాపింపబడినట్లున్నది. ఈసోమాయఫలకము అత్యంత ప్రాచీనమైనది. తరువాత పరిపాలించిన పల్లవులు - విష్ణుకుండిన ప్రభువుల కాలమున దేవాలయములందున ఫలకములపై శివపార్వతి రూపముల । స్కందుడు (చిన్నపిల్లవాడుగా), వినాయకుడుచేరి యుండుట గమనింపవలసిన విషయము. శివునితో పార్వతి మాత్రము గలిగిన యీ అర్చాఫలకము యిదివరలోలభ్యమైన పెద్దమడియము వాటికన్న ఎంతో ప్రాచీనమైనది. అచ్చటి తదితర దేవతలు ఇచ్చట కానరారు.

**2. పంచలింగ ఫలకం,** (చిత్రము - 29. A) మరియొక ముఖ్యమైన రాతి ఫలకము శివలింగములున్నది. లభించెను. ఈ ఫలకము 7×7 సె. మీ. 2 - సెం. మీ. మందము గలిగియున్నది. చక్కగా అర్ధ శిల్పమున, పంచలింగముల నొకే యధిష్ఠానముపై ప్రతిష్ఠించినట్లు తెలియుచున్నది. ఈ యధిష్ఠానము పద్మబంధము గలిగినది. ఈ తీరున పంచలింగముల నొకే వరుస క్రమముగా చిత్రించబడిన శిల్పము మరెక్కడనూ నాకిదివరలో లభ్యము కాలేదు. ఈ పంచలింగములు రుద్రని లేక మహా సదాశివుని పంచభూత లేక వక్త్రముల నుద్దేశించిన సంకేతములుగా నెరుగవలయును. ఈ ఫలకము శుద్ధ వైదిక మతానుసార సాంప్రదాయ పూజలోనుంచుకొన్నట్లు యెరుగ వీలగుచున్నది. శివుని పంచశరునిగా (బాణ), పంచ, ఆననునిగా పలు ఆగమ గ్రంథములు తెలుపుచున్నవి గదా! ఈ ఫలకము గూడ క్రీస్తుబ్దము 5 వ శతాబ్ధి నాటిదే!

**3. నాగ దేవత -** (చిత్రము - 29, B) పెద్దవేగి త్రవ్వకముల నొక కాల్చిన మృత్తికా ఫలకము లభించినది. ఈ ఫలకము అండాకారముగ 11×9×2 సెం.మీ. మందము గలిగియున్నది. ఒక విచిత్రమైన స్త్రీ రూపమును చూపుచున్నది. ఈమె సింహాక్షి, సింహముఖి లంబస్తని, సన్నని నడుము - చక్కని నాభిస్థానము కలిగియున్నది పూర్ణ వక్షోజములున్నవి. సర్ప శిరముపై (పడగ), యోని నుంచి మోకాళ్ళపై వంగి కూర్చున్నది. ఇక సర్పము లేభూషణములు, సర్పకుండలములు, కంఠమాల, కేయూరములు, మేఖల శిరోజములు అన్నియు సర్పములే రెండుచేతులందు ముకుళిత కమలముల కొండమునెత్తిపట్టుకొని యున్నది. ఈ దేవత కుమారియని తెలియుట కిదొక నిదర్శనము. ఈ నాగభూషిత యే సాంప్రదాయమునకు చెందినదో చెప్పజాలము. కాని బహుశ అదితి లేక పృధివీ దేవతగా నెరుగవచ్చును.

**4. ఏకాదశముఖ రుద్రుడు -** (చిత్రము - 28) ఈ మూర్తి శిల్పము పెద్దవేగి చేరువగా లభించినది. ఇది యెరుపు యిసుకరాయి కృతము. పదకొండు తలలు, 24-చేతులున్న ఈ రూపము, 1.05 మీటర్ల యెత్తు, 85 సెం.మీ. వెడల్పు, 32 సెం.మీ. మందము గలిగిన రాతిపై పూర్తిగా సంతరింపబడినది. క్రిందన కానవచ్చు బుడుపును బట్టి ఈ విగ్రహము ప్రతిష్ఠింపబడినదిగా నెరుగవచ్చును. దేవాలయ మెక్కడనుండెనో చెప్పజాలము. కాని వూరికి మధ్యలో నున్న పరమేశ్వరాలయమునకు చేరువగా నుండినటుల భావింపనగును. శిల్పించిన తీరు, భగవత్ స్వరూపము యీపత్ భాంతయమూర్తి కళా చరిత్రలోనే కానరాదు. అసామాన్యము, మొట్టమొదటనీ శిల్పరాజమును శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు 1-3-1947 లో ప్రత్యేకసంచికలో మరికొన్ని శిల్పములతోబాటు పేర్కొనిరి. (2) వీరుమొదట్లో రావణునిగా,

మరొకచోట యేకాదశకంఠునిగా 1961 లో ప్రచురించిరి గూడ. (3) శ్రీ బ్రిజేన్ద్రనాథ్ శర్మ యను రచయిత నీ మూర్తి శిల్పమును, గ్రానైటు రాతితో చేసినటుల, పదితలలు, యిరువది చేతుల స్థానకమూర్తిగాను, మహా సదా శివునిగాను తమ రచనలో పేర్కొనిరి. (4) ఈ శిల్పము కాకతీయ శైలిగలదిగా నెరిగి క్రీస్తబ్దము 13 వ శతాబ్ద కృత ముగా భావింపబడెను.

పై రచన లన్నియు ఈ శిల్పమును నిశితముగా పరిశీలించి వ్రాసినవిగాదు. మెత్తగా నున్న పలక లేక సుద్దరాయి-యెరుపురంగు గలిగినది చేకొని ఈ మూర్తిని చెక్కుట జరిగినది. భగవంతుని స్వరూపముయొక్క రంగు నుద్దేశించి చేసినదిగా తోచుచున్నది. రుద్రునే, *అరుణాయ, తామ్రాయ,* యని పేర్కొనిరి గదా! పదకొండు తలలు, 24-చేతులు సుస్పష్టముగా తెలియుచున్నవి. మహా సదాశివుని, లక్షణములో మూర్తి శిల్పమున కానలేము. అసలు శివ రూపము కాదనియే నా యభిమతము, ఈ రుద్ర మూర్తి శిల్పమును నిశితముగా పరిశీలింతును. మధ్యగానున్న రూపము సంపూర్ణ మానవ స్వరూపము. నిల్చొనియున్నాడు. కుడివైపుకు కొంచెము వంగియున్నటుల యెత్తుగానున్న పిరుదును బట్టి గ్రహింపనగును. జటములు తురాయివలె నిటారుగానున్నను. ముఖాగ్రమున మకుటము ఉన్నది. ఈ మకుటముపై రత్న ఖచితమగు వైదిక నిష్కములున్నవి ఫాలమున నిటారుగా త్రినేత్రమున్నది నాసిక, పెదిమలు, కొంతవరకు ఛిద్రములైనవి. కంఠమున త్రిరేఖలున్నవి. కంఠహారములు మూడును దళసరిగా, ముక్తములతోను రత్నములతోను పొదిగి యున్నవి. ఛాతి మధ్యగా మాలలన్నింటిని కూర్పుగాచేసిన ఆభరణము-తాబేలు లేక సాలీడును బోలియుండుట మిక్కిలి జుగుప్సాకరమైన లక్షణము, రుద్రునికి ప్రీతికరమయినది *మర్కటకము.* శివుని కచ్ఛపేశ్వరునిగాకూడ నెరుగుదుము, యజ్ఞోపవీతము, ఉదరబంధములు పూర్ణఘట ఖచితమైన మణులతో పొదగబడియున్నవి. ఆకర్ణాంతముతై కుడి యెడమల మకర - వ్యాఘ్ర కుండలములు భుజస్కంధముపై పడియున్నవి. పైన వస్త్రములేదు. కుడిచేయిపై కెత్తి వితర్కముద్రలో రుద్రాక్షమాల నిడుకొన్నట్లు కనుపించుచున్నది, యెడమ చేయి కంటిపైనున్నది. చేతుల నాగ భుజకీర్తులు, వలయ కంకణములున్నవి. అట్లే పాదముల సర్పనూపురములు, క్రిందగా గజ్జల పట్టెడగొలుసున్నవి. ధోవతి బదులు చర్మములను (గజేంద్ర చర్మవాసనః) ధరించినాడు. పట్టికలు రెండుపైకిలాగి ముక్త-రత్న మేఖల హారములచే బంధింపబడియున్నవి. మేఖలము (మొలత్రాడు) నకు చిన్న గంటలున్నవి. స్వరూపము పూర్తిగా నిల్చున్న రుద్ర పురుషుని మనోహరంగా చూపుచున్నది. శత రుద్రీయమున నీ రూపము ''నమోరుద్రేభ్యోయే పృధివ్యాం యే అంతరిక్షే, యేదివి,'' యని జపించి మోకరిల్లుచున్నాము. ఋగ్వేదమున (II 33, 5) బభ్రుడు ''బభ్రూ రః సుహవో బభ్రుః శుశిప్రో'' యని వర్ణితుడు, ఈ రూపమును "స్థిరేభిరంగైః పురురూప ఉగ్రో బభ్రుః శుక్రేభిః పిపిశె హిరణ్యైః (II, 33,9) ఈ పెద్దవేగి బభ్ర శివుడిట్లే విశాల భుజస్కంధములు, బాహువులు, యెరుపు వర్ణముతో అగ్నిరుద్రునిబోలె భాసించుచున్నాడు. ఈ మహాదేవుడు విశ్వరూపమును చూపుచున్నట్లున్నాడు. ఇరుప్రక్కల అయిదు తలలు. అనగా వక్త్రములుమాత్రమే ఒకదానివెంబడి మరొకటి యుద్భవించినవి. ప్రతి శిరస్సున ఒకేరకమైన జటా బంధములు - యిట్లు పదితలలపైన జటములన్నియు మధ్య పురుషుని శిరోజములతో చేర్చబడి శిఖరాగ్రమున ఒకేచోట బంధింపబడినవి, *జటా బంధోపేతః,* ప్రతిముఖము విలక్షణమైనది. విశాలమైనకనుదోయి, పెడల్పుగా నున్న మందమైన స్థూలమైన పెదిమలు, నాసిక ఫాలభాగము చూడనగును. తృతీయ నేత్రము లేదు. ఈ శిరోగ్రముపై అగోచరమైన, అరూపియైన ఈశానునిగా తీసుకొనుట సమంజసము. యేలనను 24 చేతులున్నవి. ఈశానుని ''సర్వ భూతానాం ఈశ్వరః సర్వవి ద్యానాం ఈశ్వరః'' యని ధ్యానించుచున్నాముగదా। ఇక మధ్యపురుషుని రెండు చేతులుగాక నిరుప్రక్కల 11 భుజములచొప్పున. 22 భుజములు ముంచేతినుంచి ఉద్భవించియున్నవి, 'భుజతరు' అనగా

చేతుల వృక్షమన్నమాట - ముంజేతులవలయ కంకణములున్నవి. ఈ చేతులన్నింటను ఆయుధములుండుట విశేష మైనలక్షణము. అందువలననే ఈ స్వామిరూపమును రుద్రునిగా నెరుగవలయును. హస్తములు, ఆయుధములు చాలవరకు విరిగియున్నందున నిర్ధారితముగా చెప్పజాలకపోయినను - వున్నవాటిని దృష్టిలో నుంచుకొని మిగిలిన ఆయుధముల నూహింప వీలగుచున్నది. (చూడుడు చిత్రపటము III)

| కుడిచేతులలోని ఆయుధములు (క్రిందనుండి పైకి వరుసగా) | ఎడమ చేతులలోని ఆయుధములు (పై నుండి క్రిందికి క్రమముగా) |
|---|---|
| 1) వితర్క లేక అభయహస్తము | 13) డిండిమము |
| 2) త్రిశూల దండము | 14) ఖట్వాంగము |
| 3) ఛురిక (లేక కృపాణము) | 15) ఖడ్గము |
| 4) అక్షమాల | 16) చంద్రబింబము |
| 5) నిషంగము | 17) వజ్రి |
| 6) పాశ | 18) మూసల |
| 7) ఖడ్గము | 19) టంకము |
| 9) కమండలము | 20) ధనుస్సు |
| 9) సూర్యబింబము | 21) శక్తి |
| 10) ఢక్క | 22) ఖేటకము |
| 11) కుఠరము | 23) నాగదండము |
| 12) జ్వాల (?) | 24) కటి హస్తము |

ఇక అధోవస్త్రము ధరించిన తీరుగమనార్హము. ఇదివరలో గజచర్మమని పేర్కొనియున్నాము. ఈచర్మవస్త్రము మోకాళ్లవరకేయున్నది. పట్టికలతో బంధింపబడి మేఖలతో ముడివేసియున్నవి. మధ్యగా రెండు కాళ్ళ నడుమ వ్రేలాడు చున్నది. రుద్రుని మేఢ్రము, ఈ అధోరేతము. స్ఖలనమైన రుద్రుని సూచించుచున్నది. ఈతడునుశిశ్న దేవుడు (శిశ్నైః దివ్యం తీతి శిశ్నదేవః). గుడిమల్లము లింగముపైని రుద్రునిరూపము ఊర్ధ్వఅధోరేతమును చూపెయుండుట గమనార్హము. ఆ రూపముగూడ "రుద్రయజమానుడు" గా నిర్ధారణయైనదిగదా! '' అంశుమత్ భేదాగమమున '' ఏకాదశ రుద్రుల ప్రస్తావనగలదు. మధ్య పురుషుని మహాదేవునిగా తక్కినరూపములను శివ, శంకర, నీలలోహిత, ఈశాన, విజయ, భీమ, దేవదేవ, భవోద్భవ, రుద్ర మరియు కపాలీశాలుగా చెప్పబడినవి. ఇవన్నియు వేరు వేరు మూర్తులుగా వర్ణితములు. శ్రీ శివరామమూర్తి (5) మధురలో నొక యేకాదశ రుద్ర శిల్పము క్రీస్తబ్దము నాల్గవశతాబ్ది నాటిది పేర్కొనియున్నారు. ఈ శిల్పమున రుద్రరూపములు వరుసగా ఒకదాని ప్రక్క నొకటి నాభిస్థానమువరకు విడి విడిగా అర్ధశిల్పమున కానవచ్చుచున్నవి. కాని పెదవేగి రుద్రరూపమున - ఒకే మూర్తిలో కుదింపుచేసి వేరు వేరు శీర్షములుకల - భుజముల ద్వారానే రుద్రరూపముల చూపబడుట గమనార్హము. ఈ మూర్తి శిల్పము, పైన వివరించిన

పంచలింగ ఫలకము నిష్ణాతులైన వైదిక శివభక్తులు క్రమబద్ధమై పరంపరగా సంక్రమించిన శాస్త్ర విద్యా, వైదికాచారముల పాటించుచు నీ బేరమును ప్రతిష్ఠించి ఆరాధించుచుండిరని తెలియుచున్నది. ఈ శిల్పమును క్రీస్తబ్దము 6-7 వ శతాబ్దిగా తీసుకొనవచ్చును. తరువాతి శాలంకాయనుల-పూర్వ చాళుక్యనృపులు వేంగిపురమున వైదికాచారములను, చతుర్వేద విదులైన బ్రాహ్మణులను గౌరవించినటుల శాసనములు స్పష్టము చేయుచున్నవి. నేనెరిగి నంతమటుకు దేశమందెక్కడను యిట్టి విశిష్ట ముద్ర రూపమును చూడలేదు.

*5.* **కాలభైరవుడు :** (చిత్రము-29, C) పెద్దవేగిచూట్టూ షుమారు ఒక కిలోమీటరు చదరమున వేంగిపురమును సంరక్షించు కోట గోడలు నిర్మింపబడెను. ఈ వేంగీనగరముయొక్క స్థాపన శాలంకాయన రాజవంశమువారు చేసిరి. ఈ నగరమునకధిదేవత దుర్గ లేక అంబ (6) ఈ దేవతామూర్తియేగాక ఈ కోటను సంరక్షించు నధిదేవతగా క్షేత్రపతిగా కాలభైరవులను ప్రతిష్ఠించినట్లు యిచ్చట లభ్యమైన శిల్పమునుబట్టి చెప్పవీలగుచున్నది. రెండు కాలభైరవ ప్రతిమల వివరింతును. మొదటిది కోట ఈశాన్యభాగమున, రెండవది పశ్చిమ ద్వారమున లభించెను. ఇచ్చట బహుశ చిన్న ఆలయముకూడ నుండెకాబోలు - ప్రకృతమున అట్టివి కానరావు. ఈ భైరవ దేవత నాలుగుచేతులు గలిగియున్నాడు, విరబోసిన జటములలో కుడిచేతిన త్రిశూల దండమునెత్తుకొని యున్నాడు. క్రింద హస్తము కటిపైయున్నది. వామ హస్తమున కపాలము, ఛురిక పట్టుకొనియున్నాడు. మూర్తి 1.07 మీ. యెత్తు, 70 సెం. మీ. వెడల్పు - 18 సెం.మీ. మందముగా ఉన్నది భుజములకు, కాళ్ళకు సర్పాలంకారములున్నవి. భైరవుడు క్షేత్రపతి. (క్షేత్రానాంపతయేనమః) ఇచ్చట ఛురికాయుక్తుడు మరియు ఖడ్గయుక్తుడు ఆదిశంకరులవారు (క్రీస్తబ్దము 720), మహానగరమైన కాశీ కాపురము నకు కాలభైరవుని ఈశునిగా పేర్కొని కాలభైరవాష్టకమును స్మరించెను. శాలంకాయన - తూర్పు చాళుక్య నృపులు యించుమించు ఈ కాలమున తమ రాజధాని నగరమైన వేంగిపురమున కాలభైరవుని క్షేత్రపాలకునిగా ప్రతిష్ఠించి ఆరాధించిరి (చిత్రము-30).

## అధోజ్ఞాపికలు


1. డా॥ కార్తికేయశర్మ, ''న్యూ లైట్ ఆన్ వెంగీపుర, ఎక్సవేషన్స్ అట్ ది ఏన్షియంట్ హిస్టారికల్ సిటీ ఆఫ్ ఆంధ్రదేశ'' పురాతత్వ, (న్యూఢిల్లీ, 1987), పుటలు-15-22.
2. వేంగీ సంచిక, డిపార్టుమెంటు ఆఫ్ ఆర్కియాలజీ మరియు మ్యూజియమ్స్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, హైదరాబాదు, 1974) పుట. 9.
3. రాళ్ళబండి సుబ్బారావు (సం), మ్యూసియమ్ కాటలాగు, ఆంధ్రహిస్టారికల్ రీసర్చి సొసైటి, (రాజమండ్రి) జూన్-4, 1961) పుట 69.
4. బ్రిజేన్ద్రనాథశర్మ, ఐకోనాగ్రఫీ ఆఫ్ సదాశివ, (న్యూఢిల్లీ, 1976), పుటలు XXX, 24, మరియు యీ రచయిత డా. కె. కృష్ణమూర్తి వ్యాసముపై నాధారపడి వ్రాశినారు. చూడుడు జర్నల్ ఆఫ్ ఓరియంటల్ రీసర్చి, (మద్రాసు, 1966-67), సంపుటి, XXXVI, నంబరు 1-4. పుటలు 1-2, ఏ. వి. నరసింహమూర్తి మరియు గురు రాజారావు (సం), రంగవల్లి, (నూఢిల్లీ 1983) పుటలు. 268-269.
5. సి. శివరామమూర్తి శతరుద్రీయ, విభూతి ఆఫ్ శివాస్ ఐకోనాగ్రఫీ, (న్యూఢిల్లీ 1976) పుటలు, 5, 10, 106 మరియు 122 చిత్రము - 67.
6. డా. కార్తికేయశర్మ, "ఏ కార్నీలియన్ ఇంటాగ్లియో ఫ్రామ్ వేంగీపుర" డా. అజయ్‌మిత్రశాస్త్రి ఫెలిసిటేషన్ వాల్యూమ్, (న్యూఢిల్లీ, 1987).

# విదర్భ నుండి రెండు శివమూర్తులు

వాకాటక రాజ్యవంశము క్రీ. శ. 4-6 శతాబ్దిల మధ్య - వింధ్య - విదర్భ ప్రాంతముల ఖ్యాతికి వచ్చెను. దక్షిణమున విష్ణుకుండినులు, వుత్తరమున గుప్త సామ్రాజ్యము వీరికి బంధువంశములై యుండుటచే సుస్థిరమైన రాజ్యమేగాక, శిల్ప వాస్తుకళా సంస్కృతులు మెండుగ వృద్ధి చెందినవి. వైభవోపేతమైన సులక్షణమైన శైలి అటు శిల్పమున, యిటు సాహిత్యమున (ప్రాకృత సంస్కృతముల) వుద్భవించెను. ఆంధ్రమునకు చేరువగానున్న అజంతా, కణ్హారి, నాశిక్య మొదలగు ఎంతో చారిత్రిక ప్రసిద్ధి గాంచిన ప్రదేశాలలో బౌద్ధగుహాలయములు ఈ వాకాటక కాలమునాటివే బౌద్ధమేగాక బ్రాహ్మణమతములైన శైవ-వైష్ణవములు విదర్భ ప్రాంతమున చక్కగా ప్రచారములోనికి వచ్చినవి. ఈ వ్యాసమున అరుదైన రెండు శివ ప్రతిమల గూర్చి వివరింతును. ఇట్టి మూర్తులు దేశమున మరెక్కడను కానరాలేదు. ఈ శైవ మూర్తులు సృష్టించినవారి లక్ష్యము. తాత్విక భావన, ఆకాలమునాటి శిల్పాగమ రీతుల కొన్నింటిని గూర్చి తెలుసుకొన ప్రయత్నింతుము.

## 1. మానసారలో లభించిన ప్రతిమ : (చిత్రము - 24)

మానసార యను గ్రామము నాగపూరు పట్టణమునకు 36 కిలోమీటర్లలో యీశాన్యముగానున్నది. మహాకవి కాళిదాసు వర్ణించిన రామగిరి యాశ్రమమునకు 5 కిలో మీటర్లు పడమరగా నున్నను యీ రెండు ప్రదేశములు ప్రాచీనముగా నొకే క్షేత్రముగా వెలసినవి. వాకాటక కాలమునకు చెందిన జీర్ణాలయములు శిల్ప-శాసనాదులు పెక్కులు ఈ ప్రదేశములందు లభించినవి. ఈ మూర్తి శిల్పము యెఱ్ఱరంగు ఇసుకరాయి కృతము. అడవిలో నొక కంట్రాక్టరు త్రవ్వకములు చేయుచుండగా కొన్ని యిటుక కట్టడములు మధ్య రాతి విగ్రహములుకూడ బయల్పడినవి. అట్టివానిలో నీ ప్రతిమ చూడముచ్చటగా నుండుటచే ఆ పనివారు దానిని ఛిద్రము చేయక అప్పట్లో నాగపూరు విశ్వవిద్యాలయ ఆచార్యుడైన డా॥ శాంతరామ ఫాలచంద్రదేవ్‌గారి దృష్టికి తెచ్చిరి. ఈ విగ్రహమును గూర్చి వారు కుబేరునిగా తలచి మరాఠీ దినపత్రికలో ప్రచురించిరి. మరొకరు జంభాలుని దేవతగా పేర్కొనిరి, ఈ మూర్తి 84 సెం, మీ, యెత్తు, 76 50 సెం. మీ. వెడల్పు గల్గియున్న రాతి విగ్రహము, ఈ స్వామి నాల్గు బాహువులు గలిగియున్నాడు. సుఖాసీనుడు మందహాసమున వీపునానుకొనుటకై 6-పలకల దిండుగలదు, ధరించిన వస్త్రయుగ్మమునుండి మడుతలు ఆసనముపై కానవచ్చుచున్నవి. స్వరూపము బొద్దుగా మరగుజ్జుగా నుండుటనుబట్టి యక్ష లేక కుబేరునిగా భావింపబడుట వుచితము. కాని నిశితముగా పరిశీలించినచో కుబేరునిగా కానవచ్చును. పై రెండు హస్తముల-కుడిచేతిని అక్షమాల, యెడమచేతిలో తామర పుష్పకాండము (పై పుష్పము విరిగిపోయినది) గలవు. రెండు ముంజేతుల కంకణములున్నవి. క్రింది రెండు చేతులలో, కుడియర చేతిని నొక మణిహారము, యెడమచేయి మోకాలిపైని పెట్టుకొనియున్నాడు. హారముంచుకొన్న తీరు గమనింపదగినది. హారము కుడిచేతిని మధ్యమ - అంగుళీయకములపై యుండ, (చిత్రము - 24, A), అంగుష్ఠకము, ప్రథమ కనిష్ఠకములు విడిగా నుండుటచే ఆ ప్రశస్త వస్తువును దానమిచ్చు రీతిని తెలుపుచున్నది. ఆరు పాయలున్న ముక్తా యజ్ఞోపవీతమునుబట్టి గృహస్థునిగా నెరుంగవలయును. నడుమునకు బిగించియున్న వస్త్ర ఉదరబంధము, కుడిచేతిమీదుగా యజ్ఞోపవీతమును మాలగా వేసుకొనియున్న తీరును బట్టి యీ స్వామి మహోన్నత దాన క్రతువును నిర్వర్తించుచున్నట్లు తెలుసుకోనగును. ఆకర్ణాంత నేత్రములు, దీర్ఘ నాశిక, విశాలమైన ఫాలము, చిక్కని పెదిమలు బొద్దుగా ముడుచుకొనియున్న కందరములు యీ గృహస్థుని పరిపూర్ణ శరీరమును చాటుచున్నవి. తలపైనికాననగు కేశాలంకరణ తీరు చిత్రమైనది. మిక్కిలి సొంపుగా దువ్విన జటాస

సమూహము, కుడిప్రక్కగా నాగవలయమున యమరికగా పొందుపరచి చంద్రకళను యాభరణముగా పొదివియుంచిరి. మిక్కుటమైన జటములు కొన్ని పాయలుగా పారాడుచున్నవి. యెడమ ప్రక్క అమరికగా దువ్విన జటముల పైని కపాలము వికృతముగా నుండినను, పై భాగమును అష్టపుష్పికలతోకూడిన పూలమాల శోభ నిచ్చుచున్నది. ఫాలమున అగ్రపట్టమున్నది. పరిశీలించిచూడ వామ భాగమును స్త్రీ రూపముగా నెరుగవలయును. ఒక్క శిరోలంకరణయేగాక, యెడమ చెవిని తాటంకవలయము, కాలికి నాగనూపురము, ముఖమున కానవచ్చు లలితమైన స్త్రీ లావణ్యం యీభగవత్ స్వరూపమును "సుఖాసీనం సహోమాయ" యను మంత్రవర్ణనకు ప్రతి రూపముగా చెప్పుకోనగును. శిరోజములు కట్టిన తీరును బట్టి ప్రొఫసర్ దేవ్‌గారు వకుట భైరవునిగా తలచిరి. కాని యట్టి లక్షణము లేవి యీ విగ్రహమున కానరావు.

పైన వివరించిన లక్షణాదులను బట్టి యీ మూర్తి శిల్పము కృష్ణయజుర్వేదములోని తైత్తిరీయ సంహితాంతర్గత శివనమోవాక మంత్రముల ఆపోశన చేసుకొన్న మహాపండితుడు తన పర్యవేక్షణలో శిల్పమును సుశిల్పిచే కావించినాడు. శివనమో వాకములోని, హ్రస్వాయ, వామనాయ, బృహతే, యను మంత్రములు ఈ స్వరూపమును అటుపైని జటములు, నమః కపర్దినేచ, హరికేశేభ్యో లేక కపర్దినేవ్యుప్తకేశాయ యను నామమున, ఉపవీతినేనమః, సుఖాసీనుడైనందున నమోఆసినేభ్యః। వామ భాగమున స్త్రీ రూపమున్నందున సహోమాయగా తెలుసుకొనవలయును. ఇట్టి మహోన్నత వైదిక కృతియైన మానసార రుద్రుడు క్రీస్తబ్దము 4-5 శతాబ్దని ఆలయమున ప్రతిష్ఠింపబడెను. ఈస్వామి మూలబేరమై అర్చనాదికము లందుకొనెనో లేక కోష్ఠదేవతగా తదితర భగవత్ స్వరూపములతోటి పూజలకు నోచుకొనెనో నిశ్చయముగా చెప్పజాలము. యేదెట్లున్నను, ఈ ప్రతిమ రుద్రుని లక్ష్య-లక్షణములన్నిటిని పొందుపరచుకొని భాసించుచున్నది.

## 2. మాండాలు శివప్రతిమ (చిత్రము - 25)

ఈ గ్రామము నాగపూరునకు 75 కి. మీ వాయవ్య దిశగానున్నది. ఇటీవల కాలమున నాగపూరు, విశ్వవిద్యాలయఅర్షశాఖవారు ఖనన పరిశోధనలు గావించిరి. ఈ త్రవ్వకముల లభించిన వాకాటక కాలమునాటి శాసనములు శిల్పములపై ఆచార్య డా॥ అజయ్‌మిత్రశాస్త్రిగారు నొక సమగ్ర వ్యాసమును మరాఠీ భాషలో ప్రచురించిరి. ఈ గ్రామమున ముఖ్యముగా ఖోలహుండ్కి యను ప్రాచీన స్థలము పెక్కు దేవాలయములకు, శైవ-వైష్ణవ శిల్పములకు ఆలవాలమైయున్నటుల తెలియుచున్నది.

ఈ చోట లభించిన మూర్తులన్నింట నొక శివప్రతిమ అత్యంత జుగుప్సాకరమైనది. రెండు చేతులు గలిగి స్థానక మూర్తియైన శివుడు పన్నెండు ముఖములు గలిగియున్నాడు, రెండు చేతులలో ఆయుధములు గలవు. అవి కటిపైనున్నవి, మోకాటి క్రింద భాగము విరిగినది. శిరోభాగమున యెనిమిది తలలున్నవి. పై నాలుగు మూలల కేంద్రీకరించియున్నవి. క్రిందవి నాలుగు దిక్కుల చూచుచున్నవి, కటిపైనున్న బాహుస్కంధములపై నిరువైపుల ఒక్కొక్క తలమొలచియున్నది, నాభిక్రిందుగా వస్త్రయుగ్మమున్నను ఊర్ధ్వమేఢ్రము సూచించబడియున్నది. మేఖలములగూడ వస్త్రముతోనే చుట్టబడి కుడి ప్రక్క అంచులు బంధింపబడినవి. రెండు ప్రక్కల తొడలనుండి శీర్షములుద్భవించియుండుట చిత్రముగానున్నది. ఈ విధముగా నీ మూర్తి - స్వరూపము పన్నెండు శిరస్సులు గలిగియున్నది. కంఠమున ఫలకహారము, వక్షముపై సవ్యముగ యజ్ఞోపవీతమున్నది. ముఖ్యమైన మధ్యశీర్షముపై జటములున్నవి. క్రిందివలయముతో బంధించినను చామరమునుబోలి పరుచుకొన్న జటలు చక్కగా దువ్వి తక్కిన శిరములపై అణగిన శిరోలంకరణ ముఖపట్టికలో బంధింపబడియుండుట గమనార్హము. ముఖ కవళికలు వలుదకములుగా నున్నవి. దళసరి పెదిమలు, విస్మయమునుచూపు పెద్దకళ్ళు, వంపుతేలిన మీసము, కుండలములు (లేకున్నను) సుదీర్ఘ కర్ణములు, ప్రత్యేకించి భుజస్కంధమును, తొడలయందున్న శిరములను మందహాసముతోనున్న, చిలిపిచూపులును కనబరుచుచున్నవి.

ఈ శిల్పమును శ్రీ అజయమిత్రశాస్త్రి మహా సదాశివునిగా పేర్కొనిరి. కాని అట్టి తాత్త్విక లక్షణములు ఈ ప్రతిమలో కానరావు, శివుని దిశపతిగా (దిశాంచపతయేనమః), శతరుద్రీయమున నెరుగుదుము. పై నెనిమిది శిరములు అట్టి రూపమును విదితము చేయునేమోకాని మిగత నాల్గు శిరములు అట్టి తత్వమునకు విరుద్ధములు క్రీ పూ. 1-2 వ శతాబ్ది నుండి సదాశివుని లింగ లేక వ్యక్తరూపమున తత్పురుష, అఘోర, సద్యోజాత, వామదేవ, ఈశానులుగా సద్యోజాత మంత్రముల ద్వారా సృష్టికరించిరి పై శిల్పికలు అట్టిసద్యోజాత త్వము నుద్దేశ్యించినట్టివిగా యెంతమాత్రము గ్రహింపజాలము.

నిశిత దృష్టితో పరిశీలించగా మన ఐతిహాసిక పురాణగ్రంధముల నిట్టి దైవరూపములు కొన్ని కాన వచ్చుచున్నవి. ప్రకృతమున ఈ శివరూపము మహాభారతమున ఆది పర్వములో I, 203, 26 మరియు XIII, 128, పేజీలు, 1-5) స్థాణుడైన శివునికి పెక్కు శిరములు, శరీరముపైని కనులు యుద్భవించినటుల కొన్ని గాధలున్నవి. అదెట్లనగా లింగ రూపియైన రుద్రుడు మహాతపస్వి - నిశ్చల శివుడు - ఊర్ధ్వరేతుడైన మహాయోగి, దీర్ఘతపోనిష్ఠలోనున్న శివుని విముఖుని చేయుటకై సౌందర్యరాశియైన తిలోత్తమను తక్కిన దేవతలు పంపిరట. ఈ అందాల యబల స్థాణుశివుని చుట్టు వయ్యారముగ ప్రదక్షిణముచేసి విచలితుని చేశెనట మరొకచోట నీ మోహిని నృత్యముచేసి స్థాణువును చెలింప చేసెనదికూడ కలదు ఈ సొగసుకత్తె శరీర సోయగము చూచుటకై కామాతురుడైన శివుడు తన శరీరముపైన పెక్కు శిరస్సుల సృష్టించుకొనెను. (అట్లే మరొక గాధలో యింద్రుడు సహస్రాక్షుడయ్యెనదికూడ తెలియుచున్నది.) పైన పేర్కొన్న ప్రతిమలోని శిరస్సులు, నీ కామరూపియైన శివుని చూపుచున్నవి. యీ మూర్తి శిల్పము దేవాలయమున శైవగాధల తెలుపు ప్రతిమయేగాని అర్చనా మూర్తిగా తీసుకొనరాదు.

ఈ మంథాల శిల్పమును యవగాహన చేసుకొన్న పిదప నేను మరికొన్ని శిల్పముల పునర్దర్శించితిని. ఇందుసు అలహాబాదు చేరువగానున్న భిటాయనుచోట లభ్యమయిన శివరూపము ప్రపంచఖ్యాతి చెందియున్నది. దీని పంచముఖ లింగముగా పలువురు పండితులు, ముఖ్యముగా శ్రీ జితేంద్రనాథ బెనర్జీ, గోపీనాథరావు, శివరామమూర్తి వంటి పెద్దలు పేర్కొనిరి. కాని ఈ ప్రతిమ అట్టి కోవకు చెందదు. ఈ శిల్ప ఖండిక 84 సెం. మీ. యెత్తుగల్గి బ్రహ్మ భాగము భూగర్భితమై యుండుటచే పూర్తిగావింపబడలేదు, ఈశానుడుగా తలచిన భాగమున శివుని చూపుచున్నది కాన ఈశానునిగా భావింపజాలము. విరిగి యున్నందున ముఖము స్పష్టముగా తెలియదు. కాని వెనకభాగము తాటి ఆకులబోలినట్టి జటలుశిరస్సుపై నమరియున్నవి. కుడి చేయి అభయముద్రలో క్రిందనున్న శిరముపై కానవచ్చుచున్నది. అట్లే ఎడమ చేతిని పాత్రయోలేక ఆయుధమో యుండినట్లు తెలియుచున్నది. యజ్ఞోపవీతమున్నది. నాభిక్రిందుగా ఊర్ధ్వమేఢ్రము, దీనికిరుపైపుల తొడలనుండి రెండు - శిరములుద్భవించుచున్నవి. అట్లే వెనుకభాగమున పిరుదులనుండి రెండు శిరములు వచ్చియున్నవి. ఈ నాల్గింట శిఖలు. కర్ణాభరణములు విశాలమైన కనుదోయి చిన్న ఫాలము వివిధ భావస్ఫోరకములైన ముఖములు కామప్రేరితుడైన శివుని సూచించుచున్నవి. కాని వైదిక యోగియైన సద్యోజాత తత్వమును ప్రకటించు ముఖ లింగముగా నెంత మాత్రము తీసుకొనుటకు వీలులేదు. ఈ భీట యందలి మూర్తి క్రీ. పూ. 1-2 వ శతాబ్దినాటి దనుటలో యెట్టి సందేహములేదు. అప్పటికే పురాణేతిహాసములు ప్రబల ప్రవారములోనికి వచ్చినవి. ముఖ్యముగా ఉత్తరదేశమున, మధుర, కాశి, కోసాంబి, అల్హాబాదు మున్నగు ప్రదేశముల శైవ-వైష్ణవములు వృద్ధి చెంది పెక్కు దైవస్వరూపములకు మాతృక లేర్పడెను. మహా పండితుడు, ఇటలీదేశస్థుడైన ఆచార్య గియసుప్పితుచ్చి వ్రాసినట్లు. ''ప్రాచీన దైవమూర్తులుగ్రంధములవంటివి, కొన్నివేలయేండ్ల భాగవతోపాసన, యోగధ్యాన, తాత్విక భావములతో నిగూఢకృతములు. సజీవములైన భారతీయ వైదిక పురాణేతిహాసములకివి ప్రతిబింబములు. అవగాహన చేసికొనవలెనన్న యెంతో సంస్కృతి నిశ్చల తపస్సు యవసరము''

# సప్తస్వర సుందరశివ - సోమాయు: (చిత్రము - 26)

సంగీత సాహిత్యములకు పెన్నిధిగా సరస్వతీదేవిని కొలచుట యాచారము. అట్లే నాట్యమునకు నటరాజ స్వామిని కొలచుదురు కాని శివునకు సంగీతమునకుగల సంబంధము అందరెరిగినదికాదు. ఈ సంప్రదాయమును తెలుపు మహత్తర శిల్పమొకటి బొంబాయి చేరువగానున్న 'పరేల్' యనుచోట రహదారి త్రవ్వకములలో (9-10-1931) వెలుగునకు వచ్చినది. దీనిని గూర్చి ఇదివరలో కొందరు పండితులు చర్చించిరి. కాని పూర్తిగానీమూర్తి శిల్పమున భావ గర్భితమైయున్న శివతత్వములను, సంగీత-స్వరూపములను నిశితముగా పరిశీలింపబడలేదు. ఇచ్చట నీ శిల్పరాజమును గూర్చి విపులీకరింతును. ఈ శిల్పము కొనకోసి తలక్రిందుచేసిన సీమ బాదంకాయ ఆకారములోనున్న పెద్దశిలాఫలకము పైని చెక్కబడెను. బింబములు మనకు శిలా తలమునుండి పై కెదురుచున్నట్లు కనుపించుచున్నవి. దీనిని వృద్ధృత శిల్పము (అర్ధశిల్పము) అనవచ్చును. క్రీస్తుశకము 6-7 వ శతాబ్దిని మహారాష్ట్ర - ఆంధ్ర - కర్ణాటకములను నేలిన కాలచూరి - రాష్ట్రకూటరాజుల కాలమునకు చెందినదిగా అర్చనామూర్తిగా నారాధింపబడుచున్నది. ఈ రాతి యెత్తు 3.48 మీటర్లు, మూర్తి 1 37 మీటర్లు నిడివి. బారాదేవి చదేవుల్ అనే ఆలయమున పునః ప్రతిష్ఠింపబడియున్నది. ఈ శిల్పమున ముఖ్యమైన యేడు స్వరూపములగూర్చి పేర్కొందును. చిత్రమేమన యేడు మూర్తుల ముఖ కవళికలు భావగర్భితములై నిండుగా నొకే శైలిలో కానవచ్చుచున్నవి. విశాలమైన అర్ధనిమీలితనేత్రద్వయము, ఫాలభాగమున నిటారుగానున్న మూడవనేత్రము చిక్కని పెదిమలు, నిండుబుగ్గలు, ఆజానుబాహువుల కమరికగానున్న ముంజేయి కంకణములు, సర్ప కేయూరములు, దట్టమైన కేశపాశములు, స్కంధముపై పారాడుచున్న జటాజూటములు, పొడుగాటి మకర కుండలములు, కంఠహారములు మరియు గ్రైవేయకము (హారము) నిస్సంశయముగా మహా సదాశివుని స్వరూపముగా నెరుగవలసియున్నది. మధ్యమున్న సంపూర్ణరూపమున పూర్తిగా పాదములవరకున్న కచ్ఛము, కటిసూత్రము చక్కని అర్ధ చంద్రాకారపు మడతలలో మోకాళ్ళవరకున్నది. యే రూపమునను యజ్ఞోపవీతము కానరాదు. మధ్య నిల్చున్న పూర్తి స్వరూపము సంపూర్ణముగా చూపబడియున్నాడు. తక్కిన ఆరు స్వరూపములు పాక్షికముగానే శిల్పింపబడెను. నొక దానిపై నొకటి క్రమముగా మధ్య పురుషునిలోనుంచి ఆవిర్భవించుచున్నవి.

శిలాఫలకమున మధ్యగా నిల్చున్న మూర్తులలో పైనున్న రూపము పదిచేతులు గలిగియున్నది బొడ్డువరకే చూడగల్గుచున్నాము. ఈ రూపము, దీని క్రింద ప్రతిమకు తృతీయ నేత్రమున్నది. సంపూర్ణుడైన నిల్చున్న స్వామికి త్రినేత్రములేదు. ఈ మధ్య పురుషుని భుజస్కంధములనుండి పై కెగిరిపోవుచున్నట్లున్న రెండు మూర్తులు నొకదానిపై నొకటి శిల్ప సంజలలో ఆకాశగమనమును సూచించు గంధర్వ - కిన్నరులవలె విహరించుచున్నట్లు కనిపించుచున్నారు. ప్రతిరూపములో హస్తముద్రలలో నరచేయి, వ్రేళ్ళ యభినయముల మార్పులు ప్రాముఖ్యముగా గమనింపవలసినది. అచరమైన ఈ అభినయ హస్తముల కాననగు సంగీత-స్వరముల ప్రదర్శించు హస్తవిన్యాసములు సంయుక్తముగనో లేక విడి విడిగనో ఈ హస్తముద్రలు సంగీత స్వరముల సంకేతములుగా చూడనగును. గోరక్షకర్ యను రచయిత యీ రెండు హస్తముల అక్షమాల, కమండలములున్నట్లు పేర్కొనుచున్నాడు. యెడమ చేతిని కమండలము కానవచ్చుచున్నది. కాని కుడిచేతుల వేరు వేరు నాట్య 'హస్తముద్రలు' స్పష్టముగా కానవచ్చుచున్నవి.

(1) మొదటి మూర్తి శిలాగ్రభాగమున శిల్పింపబడినాడు. జటముల అర్ధ చంద్రుడు, యేకావళి కేయూరము లున్నవి. ముఖమున మూడవ నేత్రము నిటారుగా యున్నది. పదిచేతులలోని యంశముల పరీక్షింతుము. ముందటి రెండు చేతులు పైకి యెత్తుకొని ప్రభామండలమును - బహుశ చర్మమును, కాబోలు పట్టుకొనియున్నవి. కుడిచేతులు పై నుండి క్రిందికి - సూర్య బింబము, ఖడ్గ లేక కృపాణము, శరము, టంక గలవు యెడమ వైపున్న చేతులలో వరుసగా కమండలము, చంద్రబింబము, ఖేటకము, ధనుస్సు, వజ్రాయుధములున్నవి. పై రెండు చేతులు సర్పశిర ముద్రలో శిరముపైని ప్రభవలెనున్నది. చక్రమండలమునకు సంకేతమగుచున్నది, ఈ దశభుజ మూర్తిరూపము తక్కిన ఆరురూపములకన్న ప్రత్యేక స్థానమును బొందియున్నది. సప్తస్వరములలోని మొదటిదైన షడ్జమము, అనగా 'స' యొక్క ప్రతి రూపముగా. సద్యోజాత శివునిగా భావింపనగును. విష్ణు ధర్మోత్తర, తంత్రప్రదీప యను గ్రంథముల యందు నిట్టి రూపమును సదాశివునిదిగా చెప్పుచున్నవి.

ఇక తక్కిన ఆరురూపములయందలి నాట్య హస్తముద్రల విడివిడిగా పరిశీలింతుము. ఛాయాచిత్రమున వీని వరుస క్రమమును చూపియుంటిమి. శ్రీ గోరక్షకర్ పై చివర భాగమును లింగాగ్రముగా యూహించి అగోచరుడైన ఈశాన స్వరూపముగా గమనించవలెనని చెప్పుచున్నారు. అట్లగుచో నీ స్వరూపమంతటిని అష్టమూర్తి శివునిగామహాకవి కాళిదాసు పేర్కొన్న మహా దేవునిరూపముగా పేర్కొనుచున్నారు, అష్టతనువు గల్గిన మహా శివునిగాకూడ నెరిగిరి.

(2) యెడమ ప్రక్కగానున్న యీ మూర్తి హస్తము పై కెత్తి వ్రేళ్ళముద్రలలో నంగుష్టము తర్జనిని తాకు చున్నది. తక్కిన వ్రేళ్ళన్నియు విడి విడిగా కానవచ్చుచున్నవి. దీనిని భ్రమర హస్తముద్రగా నెరుగవలయును. ఈ హస్తాభినయము 'రిషభా లేక 'రి' ని సూచించును. భ్రమరము 'రిం' కారమును చేయును, యెడమ చేయికటిపై నున్నను అరచేతిని కమలమున్నది, ధోవతియొక్క ముడుతలు యీ చేతిపై నెగురుచున్నట్లు చూడనగును,

(3) పై మూర్తివలె యెగురుచున్నట్లున్న ఈ రూపమున కుడిచేతిని అంగుష్టము మధ్య వ్రేలిని తాకుచున్నట్లు చూపబడినది. తక్కిన మూడువ్రేళ్ళు త్రిశూలాకారముగ అభినయించుచున్నవి. అందువలన నీ ముద్ర మూడవ స్వర మైన గాంధార లేక 'గ' ను సూచించును, యెడమ అర చేతి యందు పద్మ కాండము పై తట్టుగా పద్మకోశము పిడికి లోనున్నది.

(4) మధ్యనున్న సంపూర్ణరూపము- సుందరమూర్తి, పై చేయి చతుర హస్తముద్రలోనున్నను అర చేతి ని నిండైన పద్మమున్నది, ఇది సింహ హస్తముద్రకు సంకేతము, ఈ శివరూపము మధ్యమ స్వరమూర్తి 'మ' కు సంకే తముగా నెరుగవలయును, మూడవ నేత్రముగాని, యజ్ఞోపవీతముగాని కానరావు.

(5) ఈ రూపమున కుడిచేయి ధ్యానముద్రలో హస్తము వక్షస్థలము వైపుకున్నది. అంగుష్టము, తర్జనీలుకలసి యున్నవి. యెడమచేయి వరద హస్తముద్రలో పద్మము నిడుకొనియున్నది. ఈ చేతిని మధ్యమ-అంగుళీయకముల చుట్టుకొనియున్న రుద్రాక్షమాల, ఈ మాల శివపంచాక్షరీ సంకేతము, స్వరమండలమున పంచమ ('ప') స్వరమును స్థాయిని సూచించును.

(6) కుడి ప్రక్కగా నెగురుచున్న యీ రూపమున కుడి అరచేయి సొంపుగా పైకి చూపించుచున్నాడు. ఐదు వ్రేళ్ళుకలసి ''పతాక'' హస్త ముద్రను సూచించును. యెడమ చేతిని లీలాకమలమున్నది. కాడ, బొటనవ్రేలు తర్జనీల మధ్యగా వున్నది. ఆరవ స్వరమైన దైవత లేక 'ద' కు సంకేతము-కాన ఈ మూర్తి దైవత స్వరమూర్తిగా నెరుగ వలసియున్నది.

(7) కుడి వైపు పై భాగమున యెగురుచున్నట్లున్న ఈ మూర్తి కుడిచేతిని బొటన వ్రేలు, అంగుళీయ . కనిష్టి కములు కలిసియున్నవి. యెడమచేయి పైకిగా నుండి ఐదువ్రేళ్ళను చూపుచున్నది, కాన నీ సంయుక్త హస్తముద్ర లలో యేడువ్రేళ్ళు సప్తస్వరమైన నిషాద లేక 'ని' కి సంకేతముగా తీసుకొనవలసియున్నది.

ఈ విధముగ ఈ యేడు రూపములు యేడు స్వరముల ప్రతీకలుగ సుందర శివుని శిల్పించిరి. అంతటితో తృప్తిజెందక సప్తస్వర శివుని సంగీత ప్రదర్శనకు లయ - శృతుల చేకూర్చుటకై అయిదు గణములను కూడ ఫలకము క్రింద భాగమున నిలువైపులా చూపియున్నారు. ఈ మరగుజ్జు గణములు, కుడిప్రక్క ముగ్గురు, యెడమ వైపు యిరువురు తమతమ వాద్యకలాపములలో మునిగియున్నారు. కుడితట్టు కూర్చొన్న గణము ఫిడేలు (?) వలెనున్న తంత్రీవాద్యము, ఈ వాయిద్యమును మీటుచునోరు విప్పి ఆనందోత్సాహముగా నున్నాడు. ఇతని ప్రక్కవాడు వేణువును, పైన నిల్చున్న గణము శృతికై వీణను మీటుచున్నారు. యెడమవైపు గణములలో పై వాడునిల్చొని తంబుర నొకచేతిని పట్టుకొని శృతి పాడుచున్నట్లు కనబడుచున్నది. క్రింద కూర్చొన్న గణము యేడు తంత్రుల పరివాదినిని వీణను వాయించుచున్నాడు. ఇట్లీ గణములు సప్తస్వర శివునికి లయ - శృతుల (కంఠ, తంత్రీ, సుషిర కంజ, తాడనము) చేకూర్చుచున్నారు.

ఈ విధముగా నగ్రిభాగమున యెనిమిది చేతులమూర్తి మొదలుకొని వరుసగా షడ్జమము, (స) ఋషభ (రి), గాంధార (గ), మధ్యమ (మ), పంచమ (ప), దైవత (ద), నిషాధ (ని), ములుగా తెలుసుకొనగల్గితిమి. హస్తముద్రిలు కేవలము అచరములైన అభినయ హస్తములేగాని, నృత్యహస్తములలోవలె కదలికలను సూచించవు. ఈ అభినయ హస్తముద్రలు భరతుని నాట్యశాస్త్రమున అలపద్మ - చక్రహస్త - సర్పశిరమండల - స్వరమండల - త్రిశూల - కటక - సింహముఖ - భ్రమర - చతుర హస్తముద్రలుగా పేర్కొనబడినవి. ఈ శిల్పము చాళుక్య - రాష్ట్రకూట కాలమునాటిదిగా వారు రాజ్యముచేసినచోట్ల లభించుటవలన చెప్పుకొనుచున్నాము. కాని యిదే కాలమునకు చెందిన స్వరసంకేతముల వివరించు శిలా లేఖనము తమిళనాడులోని 'కుడిమియామల' (కుడిమిమలై) యనుచోట లభించినది. ప్రాచీనకాలమున నారదాదులచే చెప్పబడిన కేనోపనిషత్తునందు స, రి, గ, మ, ప, ద, ని, యను సప్త స్వరముల ప్రసక్తి కలదు. క్రీస్తుశకము 6-7 శతాబ్ది నాటికే ఈ సప్తస్వర సంగీతము మిక్కిలి ప్రచారము లోనికి వచ్చియుండెను. మహారాజులు కూడా సంగీత శాస్త్రమున గొప్ప పండితులుగా ప్రతిభకు వచ్చినట్లు తెలియు చున్నది. పల్లవరాజు మహేంద్రవర్మ (క్రీ॥ శ॥ 560 - 380) సంకీర్ణ రాగముల సృష్టించెనట. అందువలననే యీతనికి సంకీర్ణజాతి, విచిత్ర చిత్త యను బిరుదములు వచ్చెను.

ఈ 'కుడి మియామల' శాసనము పల్లవ గ్రంధ లిపితో సంస్కృత భాషలోనున్నది. కావించినవాడు పల్లవరాజు పరమ మాహేశ్వరుడు, రుద్రాచార్యుని శిష్యుడు. సాధన చేయగోరు విద్యార్థులకై నీ శాసనము గావింప జేసెనట. శాసనము చివర ''పరినాది నీయె'' యను పదమున్నది. ఇది కాకతమిళనాడున మరికొన్ని చోట్లకూడా నిట్టిసంగీత శాసనములున్నవి. తిరుమయము, మరియు తిరుగోకర్ణమనుచోట్ల కూడా నీ ''పరివాదినియె'' కానవచ్చును. ఈ స్వరముల 'పాట్టు' యనగా పాడువారికి, 'యాళ్' (వీణ) అనగా పరినాది నీ సాధకులకు మార్గ దర్శకముగా వ్రాయబడిన వని శాసనముల పేర్కొనబడినది. ఈ చోట్లన్నింట శివుని కంకితములైన గుహాలయములు పుదుక్కోట జిల్లాలోనే ఉన్నవి, ముఖ్యముగా కుడిమియామల శాసనమున స్వర సంకేతములపై, అ, ఇ, ఉ, ఎ అను అచ్చులను అనుసంధించిరి. పై నుదహరించిన శిల్పమును నిట్టి స్వరముల సంకేతముల ద్వారా నాట్య హస్తముద్రలలో సూచించుట గమనార్హము.

ఇంతగా సంగీతమునకు ప్రాధాన్యత వచ్చుటకు కారణము ఆనాటి ప్రసిద్ధ శైవ ప్రవక్తలు, శివోపాసకులునైన అప్పార్ (తిరునావుక్కరసు), సంబంధార్ (తిరుజ్ఞాన సంబంధార్), మరియు సుందరార్ (సుందరమూర్తి నయనార్)

యున్నారు. మహానుభావులు. తేవారములందు శివుని నాదబ్రహ్మంగా, స్వరాచార్యుడుగా, నటరాజుగా పలురకముల స్తుతించిరి. సదాశివుని ప్రణవ స్వరూపునిగా (ఓంకార), సామగాన చతురుడుగా పాడల్ వల్లాణ్ గా ప్రతిపాదించి ఆరాధించిరి. తరువాత కాలమున గూడ శివుని సంగీత స్వర నిధిగా నయనార్లు (నాయనమార్లు) విష్ణువును ఆళ్వారులు భక్తితో కొలిచి పాడుకొనిరి. వీరందరూ నొక గొప్ప దాక్షిణాత్య సంస్కృతీ సంప్రదాయములకు ఆద్యులుగా నిల్చిరి. కాని మన తెలుగు జాతి సగర్వంగా తర తరాలుగా తమదనే చెప్పుకో గలిగిన శాశ్వత సంగీత భండారముల సృష్టించినవారు నల్గురు మహనీయులు-తాళ్ళపాక అన్నమాచార్యులవారు, క్షేత్రయ్య, రామదాసు మరియు త్యాగబ్రహ్మలు. వీరందరూ భక్తి మార్గమున తమ కవితాగాన మాధుర్యములతో భగవత్ సాక్షాత్కారమును బొందిరి. వీరి సంగీత ప్రయోగములతో ప్రజలను తన్మయుల జేసిరి. ఈ భక్తి - మోక్షతత్వములు వైదిక పురాణేతిహాసములనుండి గ్రహింపబడినవేయైనను, ఈ భావ సంస్కృతి తరతరాలుగా భారతావనిలో వాస్తు - శిల్ప - సంగీత కళలద్వారా సజీవమై ప్రవహించుచుండెను. ఈ మహత్తర సంస్కృతీ ప్రభావమునకు, ప్రచార ప్రసారములకు భాషా ప్రాంతీయపు ఎల్లలు అడ్డురాలేదు. పైన వివరించిన శిల్పమిట్టి మహత్తర సంగీత సాహిత్య శాస్త్రముల సంయమమునకు ప్రతీకగా నిలిచి పోయినది. మరొక ముఖ్య విశేషమేమన ఈ మూర్తి శిల్పమును పైన పేర్కొన్న వాగ్గేయ కారులెవ్వరు చూడలేదు, యెరుగరు. సంకీర్తనాచార్యుడు పదకవితా పితామహుడైన అన్నమాచార్యులవారి కాలానికన్న (1408-1503) ఈశిల్పము యేడు శతాబ్దుల పూర్వము గావింపబడెను. వీరెవ్వరికి అందుబాటులో, కానరానిచోటున యుండెను.

కాని త్యాగబ్రహ్మ యీ సంగీత స్వరమూర్తిని సప్తస్వర సుందరులను తన్మయత్వంలో తనివితీరగా యెంతటి సత్యదృష్టితో వర్ణించి పాడుకొన్నాడో గమనించిన ఆ మహనీయుని కన్పిన భారతీయ వైదిక సంస్కృతి యెంతటి ఉత్కృష్టమైనదో తెలియును.

త్యాగరాజస్వామి రెండుకీర్తనల నిచ్చట పేర్కొనుచున్నాను,

1) సిద్ధరంజని — ఆదితాళం

నాదతనుమనిశం, శంకరం। నమామియే మనసాశిరసా ॥

అనుపల్లవి—

మోదకర నిగమోత్తమ సామ వేదసారం వారం వారం

చరణము: —

సద్యోజాతాది పంచవక్త్రజ
సరిగమ పదని వరసప్తస్వర
విద్యాలోలం విదళితకాలం
విమలహృదయ త్యాగరాజపాలం

2) జగన్మోహిని — రూపకము :

పల్లవి :- శోభిల్లు సప్తస్వర సుందరులభజింపవే మనసా
అనుపల్లవి :- నాభి హృత్కంఠ రసన - నా సాదులయందు
చరణము :- ధర ఋక్సా మాదులలో - వరగాయత్రీ హృదయమున
సురభూసుర మానసమున శుభ త్యాగారాజాదులలో

"*సప్తస్వర సుందరుల*" అనేది పుంలింగ బహువచనము, సుందరుడు అనేది శివునిపేరు. మధురలో వెలసిన దైవము మీనాక్షిసమేత శ్రీ సుందరేశ్వరస్వామి. సప్తస్వర సుందరులన సప్తస్వర మూర్తులైన శివులు. వీరందరూ యేకమైన నాదతనుం - సంగీతమే శరీరముగాగల శంకరుడైనాడు. ఈ మహత్తర వైదిక తత్వసంప్రదాయమునకు పై శిల్పమెట్లు ప్రతీకగా క్రీ॥ శ॥ 6-వ శతాబ్దిని సృష్టింపబడెనో అట్లే పదనొకొండు శతాబ్దుల అనంతరము వచ్చిన శ్యామశాస్త్రి (1762 — 1827), త్యాగబ్రహ్మ (1767 — 1847) మరియు ముత్తుస్వామి దీక్షితులను వారు యీ సప్తస్వరసుందరుల తమ సంగీతస్వర సాహిత్యములతో పునః సృష్టి చేశిరి. మరికొన్ని కృతులలో కూడ నీ సుందర రూపముల తత్వమును చక్కగా వివరించిరి.

''సామజవరగమన'' (రాగ - హిందోళ, ఆదితాళము) 'సామ నిగమ సుధామయగాన' మరియు "వేద శిరోమాత్రజ సప్తస్వర నాదాచలాధిప:- మరియొక కీర్తనములో "రాగసుధారస పానము" (రాగ ఆందోళిక - తాళము దేశాది) ''సదాశివ మయమగు నాదోంకార స్వరవిహిల్లు యని నాదము సదాశివుడు, నాదము ప్రణవము, సప్తస్వరములు ప్రణవమంత్రోద్భవములు అని తెలియజేయు గొప్పతత్వమును మహదానందముతో తానెరిగి ప్రపంచమునకు తెలుపుటకై రాగయుక్తముగ సృష్టించిన మన త్యాగరాజస్వామి ధన్యుడు. మనకందరకు వందనీయుడు. ఆటుశిల్పమును ముందుంచుకొని, యిటు శ్రీ త్యాగరాజస్వామి వారిపై కృతుల పాడుకొన్నను భక్తుడు పులకరించిపోవును.

సప్తస్వర సుందరుడు;— పరబ్రహ్మము ఆదికాలమున ''నాదము'' గా వ్యక్తమయ్యెను. ఆ నాదము క్లుప్తముగా అ-ఉ-ను శబ్దములు సంయుక్తముగా ''ఓమ్'' అను ప్రణవమున నిబంధింపబడియున్నది. ఇదియే ప్రణవము. ఇందుండి సప్తస్వరములు విశ్లేషింపబడినవి. ఇవియే స-రి-గ-మ-ప-ద-ని ఈ స్వరములనుండి స-ంగీతము-స్త-ఇత్యాది స్వరములతో కూడిన గీతము. పైన వివరించినట్లు ఈ నాదముయొక్క ప్రతీకరూపమును, సప్తస్వర సుందరులుగా సంయుక్తముగా శిల్పమున మలచబడినది. ఈ శిల్పరాజము బొంబాయివద్దనున్న పరేల్ అను స్థళమున 9-వ శతాబ్దిలో నిర్మించబడి పరమేశ్వరుని ప్రతిష్ఠించిరి. ఈ సంయుక్త ప్రతీకము ఉపనిషత్‌లనుండి సర్వ శాస్త్రముల తత్వములను బోధించు విగ్రహము; నమో సప్తస్వర సుందర మూర్తి నమోనమః ।

## ఉపయుక్త గ్రంథములు :

1) ''స్వరమయ" రూపలేఖ, (బొంబాయి, 1958) సంచిక, 18. నెం. 1-2, ఇంకను కె. ఆర్. శ్రీనివాసన్ ''అన్ ఇన్ట్ రెస్టింగు ఐ కాన్ ఆఫ్ శైవ సింబాలిజమ్ ఏ న్యూ అప్రిసి యేషన్'' ప్రోసీడింగ్సు. అనంతాచార్య ఇండోలాజికల్ రీసెర్చి సెంటరు. (బొంబాయి. 1981) పుటలు. 70-84.

2) సదాశివ గోరక్షకర్. ''ది పరేల్ మహాదేవ రిఅసెస్డ్'' లలితకళా, (న్యూ ఢిల్లీ, 1985), నంబరు 20, పుటలు 15 — 24

3) చూడుడు లింగ పురాణమునందలి విశ్వరూపలేక చతుర్ముఖలింగ (సద్యోజాతాది), తత్వముల సూచించు మూర్తిశిల్పముగా గ్రహించిన వ్యాసమునకై థామస్ మాక్స్‌వెల్. శైవ ఇమేజస్ ఆఫ్ మెడిటేషనల్ కంస్ట్రక్ట్స్'' మై ఖేల్ మీస్టరు. (సం. డిస్కోర్సస్ ఆన్ శివ, (న్యూ ఢిల్లీ, 1985) పుటలు 68 - 72.

# సోమాయ

"ఏ శిల్పం? ఏ సాహిత్యం? — ఏ శాస్త్రం? ఏ గాంధర్వం? — ఏ వెల్గులకీ ప్రస్థానం?

ప్రాచీన దేవతామూర్తులు ప్రామాణిక గ్రంధములవంటివి, సజీవములైన వైదిక పురాణేతిహాసములకివి ప్రతిబింబములు. అవగాహన చేసుకొనవలెనన్న యెంతో నిశితదృష్టి, నిశ్చలతపస్సు యవసరము. ఈ వ్యాసమందు నేను అరలగుప్పెయనుచోట చూచిన శివ - పార్వతి ప్రతిమ గూర్చి వివరింతును.

## అరలగుప్ప సోమాయ : (చిత్రము - 27, B)

కర్ణాటక రాష్ట్రములోని తుంకూరుజిల్లా తిప్టూరు తాలూకాలోని, మారుమూల "అరలగుప్పె" యను గ్రామమున్నది. ఇచ్చట కల్లేశ్వర యను దేవాలయముగలదు. అందున నొకమూల ఆగ్నేయముగా చిన్న అంగాలయమున నొక అపురూపమైన మూర్తి శిల్పముగలదు. ఈ ఆలయ సముదాయమును పశ్చిమ గంగ వంశీయులైన సత్యవాక్య రాజమల్లుడను రాజు క్రీస్తబ్దము 870-907 కాలమున తన సామంతరాజగు నోలంబాధిపునిచే గావించినటుల శాసనముల వలన తెలియుచున్నది. ఈ మూర్తి శిల్పము ఒకటిన్నర మీటర్లు యెత్తు అంతేవెడల్పు గలిగియున్న నల్లరాతి కృతము. ఈ చిన్న ఆలయమున యీ శిల్ప రాజమును దీర్ఘ చతురస్ర పీఠముపై సుప్రతిష్ఠించి అభిషేక అర్ఘ్య నిత్యపూజల ప్రాచీనముగా చేయుచుండి నటుల ఆధారములున్నవి. ఈ కాలమున శివాలయములందు సామాన్యముగ లింగ ప్రతిష్ఠయే యుండుట ఆచారము. గర్భాలయమున మరెట్టి శిల్పములు కానరావు. గర్భాలయమున అందున మానవాకృతిలో, భగవంతుని మూర్తి శిల్పమును ప్రతిష్ఠించుట, అందున ఉమాసహితుని కానరాము. పల్లవ - చోళ - చాళుక్య రాజుల కృత్యములలో ఆలయపు గోడలపైని, కోష్ఠదేవతలుగా మండపములపై కప్పున స్తంభములపైని త్రిమూర్తుల శిల్పించుట లేక విగ్రహముల నుంచుట ఆచారము. శివుని రూపములలో ముఖ్యముగా దక్షిణామూర్తి, కల్యాణ సుందర, గజాంతక, సోమస్కంద మున్నగు యెన్నియో భగవత్ స్వరూపములు, అర్ధశిల్పములుగాను, మూర్తిగాను కట్టడముల నుంచుట పౌరాణిక కాలము నుండి కలదు.

కాని ఈ 'సోమాయ' విగ్రహము స్వయం ప్రధాన దేవతగా ప్రతిష్ఠింపబడుట ప్రాచీన వాస్తు సంప్రదాయమున మిక్కిలి యరుదుగా భావింపనగును. నాకు తెలిసి నోలంబ - నృపుల పట్టణమైన హేమావతి (అనంతపురంజిల్లా, హిందుపూరు తాలూకా) లో సిద్ధేశ్వరాలయమున మహోన్నతమైన మరియొక శివప్రతిమ, లింగమునకు బదులుగా, గర్భాలయమున ప్రతిష్ఠింపబడి ఆనాటి (క్రీ. శ. 9 వ శతాబ్ది) నుంచి యిప్పటివరకును పూజలందుకొనుచున్నది.

ఈ అరలగుప్పె శిల్పము మంచక పీఠముపై ప్రతిష్ఠింపబడియున్నది. ఇందునయవ్వనుడైన శివుడు సుఖాసీనుడై దేవిని తనకు చేరువగా చేసుకొని యెడమ చేతితో నామె స్కందముల మీదుగా ఆవలికుచమును తాకుచున్నాడు. అమ్మవారు తన కుడిచేతితో స్వామి భుజమును పట్టుకొని కుడికాలును పైకి ముడుచుకొని (ముగ్ధయై) నవోఢగా క్రిందికి చూచుచున్నది. శతరుద్రీయమున నమోవాకములలో "సుఖాసీనం సహోమాయ" యను మంత్రమునకు శిల్పరూపమిదియే.

ఇక మహాదేవుడు మన్మధుని మించిన సౌందర్యముతో భాసించుచున్నాడు, అజానుబాహు విగ్రహము, గంభీర వదనము, విశాలనేత్రములు దీర్ఘమైన నాసిక, కంఠాభరణములు, ఆరుపాయల యుక్తా యజ్ఞోపవీతము (ఉపవీతినేనమః),

మేఖలాబంధములు, ముంజేతిని సర్పవలయములు. నాగభుజకీర్తులు (నమోహిరణ్య బాహవే) కర్ణములందు మకర కుండలము, తాటంకములతో భాసించుచున్నాడు. సుడులు తిరిగిన జటాసముదాయములను చక్కగా దువ్వి అమరికగా నాగవలయమున, అష్టపుష్పికలతోను, చంద్రకళతో నలంకృతమైన కిరీటమున పొందుపరచినను, మిక్కుటమైన కేశములు కుడి భుజస్కంధములపై బడిపారాడుచున్నవి. (నమఃకపర్దినేచ) వామ భాగమున ఉమాదేవి ముంచుక ముకుళితయై అప్పుడే పరిణయమాడిన వధువుబోలెవదిగి కూర్చొనియున్నది పెక్కు అభరణములతో నీ కల్యాణి భాసించుచున్నది. కంఠమున కాసులపేరుతోసహ పలురకములైన ఆభరణములున్నవి. వంకులు తిరిగిన ఆమె కేశ సంపద చక్కని కొప్పుగా (ధమ్మిల్లము) నమర్చి మధ్యపాపటను సువర్ణమాల, ఫాలమున ముకుటమణి, కర్ణముల నొంపైన పుష్పఘట కుండలములు, చీరికను బిగుతుగా పొందుచేసిన వడ్డాణముతోసహ పలురకములైన మేఖలా సరములు యీమెను సుకన్యగా తీర్చినవి. పరిపూర్ణ కుచద్వయము మరియు నాభిస్థానములు యీ కల్యాణిని ముగ్ధమోహన సౌందర్యరాశియైన నూతన వధువుగా చిత్రించి ఉన్నవి. ఈ సుఖాసీనులై ఉన్న ఆది దంపతులు ఈ సుఖాసీనులై యున్న నూతన దంపతులను గంధర్వులు సమ్మోహితులై "నమో అసినేభ్యః" యనిపైనుండే మోకరిల్లి పోవుచున్నారు. నిశ్చలమైన నంది క్రింద పరుండి గూడ యెదురుగా చూడవచ్చిన వారిని ప్రశ్నార్థకంగా తలత్రిప్పి యడుగుచున్నట్లున్నది ఈ సోమాయ కల్యాణ గుణమయుడు (వర్షీయసే) సర్వలక్షణ సమన్వితులైన యీ దేవతామూర్తుల గావించిన కృతికర్త కృష్ణ యజుర్వేదతైత్తిరీయ సంహితాగ్రత శత రుద్రీయమునందలి నమోవాక మంత్రముల బొపోసనచేసిన మహాభక్తుడనుటలో సందియములేదు. ఈతడు స్థాపత్య - శిల్పశాస్త్రములందు నిష్ణాతుడు కావుననే యట్టి మహోత్కృష్ట శిల్పమును గావించుటయేగాక స్వయం ప్రధాన మూర్తిగా సుప్రతిష్ఠించి తరించినాడు.

—o—

# కీసరగుట్ట శివాలయములు : వాస్తు సంప్రదాయము

కేసరిగిరి లేక కీసరగుట్ట యని పిలవబడు గ్రామము హైదరాబాదునకు 40 కి. మీ. ఈశాన్యంగా ఘటకేసరము పోవు రహదారిలో నున్నది. ఇచ్చటి శివార్లలో కోటగోడలు, శిథిలమైన యిటుక కట్టడములు విరివిగా కానవచ్చును. ఇటుకలు 50 × 25 × 8 సె. మీ. గలవి లభ్యమగుచున్నవి. చక్కని కొలనులు, యెత్తైన కొండలు, పెద్ద పెద్ద నిలువు బండలతో, నిమ్నోన్నతాలతో విశాలమై కానవచ్చు యీ వూరి పరిసరములు ప్రాచీన కాలమునుండి శాతవాహన ఇక్ష్వాకు, విష్ణుకుండినుల కాలమున గొప్ప సుక్షేత్రములుగా వెలుగొందెను.

### *కొండపై లింగములు :* (చిత్రము - 32)

రామలింగేశ్వరస్వామి దేవాలయమున కొండ పై భాగము కొంతమేరకు చదునుగా రాతిబండ కానవచ్చును. (చిత్రము) ఈ చదును ప్రదేశమున నల్లరాయి నునుపు దేలిన లింగములు వరుసగా పై నుంచి క్రింది వరకు (చిత్రము) హారములోని పూల వరుసవలె కానవచ్చును, ఈ కొండపై నెక్కి యెటు చూచినను యీ లింగ పీఠములుండుట విశేషము. ఈ విధముగ మన విశాఖపట్నము జిల్లా శంకరము (అనగా సంఘారామము) లోని బొజ్జనకొండపైని తొలచిన రాతి స్తూపముల వరుసక్రమములను కొండపైనుండి క్రిందివరకు హారములవలె కానవచ్చుచున్నవి. ఇన్ని శివలింగములిక్కడ యెవరు? యెప్పుడు? యెందుకు ప్రతిష్టించిరి? ఈస్థానముయొక్క విశిష్టతయెట్టిది? ఈవ్యాసమున పరిశీలింతును లింగములన్నియు నల్లరాతితో చెక్కబడినవి. రుద్ర భాగము గుండ్రముగా చేయబడినది. బ్రహ్మ సూత్రము చూపు గీతయుకలదు (చిత్రము) విష్ణభాగము అష్టముఖము చక్కగా నునుపు చేయబడినవి. ఇక బ్రహ్మభాగము

నలు పలకలుగా కొన్నింట కానవచ్చినను, యిటుక పీఠములో అంతర్గతమైనది. లింగ పీఠము చతురస్రమైన అరుగు లేదా దిమ్మవలె లింగము చుట్టునున్నది. అభిషేక జలము పోవు మార్గము కానరాదు అనగా అభిషేకాది సంస్కారము లకు, అనువగు కట్టడముగాలేదు. పైన రాతి ప్రణాళికా పీఠముకూడ యెచ్చటను కానరాదు. కాని యీ లింగము లన్నియు పెళాలమైన అంబరము క్రిందనే ప్రాచీన కాలమునుండి కూడ నుండినవి. ఇక పూజ, దీప, అర్ఘ్యములెట్లు పాటించుచుండిరి? లింగోపరి భాగమున అనగా రుద్ర భాగము, పుట్టతేనె లేక వెన్నపూయుట చూచితిని ఈ అవాటే అనాదిగా యుండియుండవలెనని తోచుచున్నది. పుష్పమును ఉంచికూడ మొక్కుదురు, అంతేకాని అభిషేకముచేయుట కానము. ఇటుక పరిమాణమునుబట్టి యీ లింగము లన్నియు క్రీ. శ. 3-4 వ శతాబ్దిని స్థాపించియుండిరని చెప్పనగును దేవతల నగరమైన మధురలోని శిల్పముల, ప్రాచీన కట్టడముల నిట్టి లింగ పీఠమును క్రీ శ 1-2 వ శతాబ్ది పాలించిన కుషానునల కాలమున గలవు. (చిత్రము), ఇందు చూపబడిన చిత్ర ఖండమున లింగము పెద్ద నలు చదర పు అరుగుపై ప్రతిష్ఠింపబడియున్నది. పైన గుడిలేదు. చెట్టుయున్నది. యక్షుడు దివ్వెను వెలిగించుచున్నాడు. ఆంధ్ర దేశమున శైవము చాల ప్రాచీనముగా వచ్చి నాటుకొనెనుగదా! ఈ లింగ ప్రతిష్టలుకూడ మధురలోని లింగ స్థానముల వలె రప్పరించి అదే లయిన గావించబడియుండెను. కొండపై పూజింపబడుచున్న రామలింగేశ్వరాలయము కాకతీయుల కృతము. ఈ ఆలయమునకు చుట్టూ సిమెంటు మండపములు తదితర కట్టడములతో పూర్వశైలిని భంగము చేసిరి. చేరువనేయున్న బండల మధ్యనొక పోధి (నీటిగుంట) గలదు. దాని చెంతనే నొక గుండురాతిపై స్థానకమూర్తియైన చతుర్భుజ నరసింహుని యూర్ధ్వశిల్పము, విష్ణుకుండినుల కాలపు తెలుగు శాసనము ''తొలచువాండ్రు'' అనగా రాతిని తొలచువారని తెలియజేయుచున్నది, ఇటీవల కాలమున అనగా 1975-79 ల నాస్థానమును ఆంధ్రప్రదేశ్ పురావస్తుశాఖ వారు త్రవ్వకముల గావించిరి ఒక పెద్ద వేద సంస్కృత కళాశాల, మరినీ ప్రదేశమును దర్శించువారి కనుకూలముగ నొక విశ్రాంతి గృహము యుండుటచే వినోద-విజ్ఞాన యాత్రికులకు హైదరాబాదు నగరమునకు చేరువనా నొక సుస్థల మేర్పడినది. ఆంధ్ర ప్రదేశము, పురావస్తు శాఖవారు త్రవ్విన స్థలములు కొండ పడమటి యంచునవున్న కొంత మెట్ట భూమికి చెందినది ఇటుక కట్టడములు పెక్కు శిథిలావస్థలో నున్నవి. అన్నియు శైవాలయ కూటములు పూనాది భాగములు మాత్రమే కాక కొన్నింట పాదార్ధ రెండు, రెండు మీటర్ల యెత్తువరకు కట్టడపు గోడలు లభించినవి పెద్ద దేవాలయములు దీర్ఘ చతురస్రములై యున్నవి గజపృష్ఠశైలిలో నెట్టి ఆలయము కానరాలేదు, కొన్ని ఆలయములందు మూడు గదులుగా నుండుటచే త్రికూటముగా భావింపనగును, మధ్యగా గర్భగృహము యిరువై పుల కొంచెము చిన్న గుడులుగా ఆలయములు, ముఖత నొకశాల దీని ముంగిట తూర్పు ముఖముగా సోపాన చంద్ర శిలాలంకృత ద్వారమున్నది, (చిత్రము - 31) ఈ దేవాలయములన్నియు విష్ణుకుండినుల కాలము నాటివి. రాగినాణెములు, మృత్తికాశకలశములు చాల లభించుచున్నవి. ఇచ్చటనే మరియొక దేవాలయము తూర్పు పక్కన వెలికివచ్చినది. ఈ దేవతా గృహము వరుసగా మూడు గదులుగా కొలతలు (2 0 × 2.65) ముందున అగ్రమంటపము 2,5 × 2. మీ ముఖద్వారమున అరుగు మధ్య చంద్రశిలతోటి సోపాన పంక్తి చక్కగా పూత పూసిన గోడలున్నవి. ఈ ఆలయమునకు పశ్చిమ భాగమున మరియొక గుడి, దీర్ఘ చతురస్రాకారము, 2.8 × 1.9 మీ. గలిగిన గర్భాలయము యింతుమించు అంతే పరిమాణముగల అర్ధమండపము (2 35 × 2.20 మీ.) బయల్పడినవి, ఈ ఆలయ యధిష్ఠానమున, యెత్తైన వుపానము. పైని జగతి, త్రిపట్ట, కుముదము, కంపము, పట్టిక వ పరికంపము మరియు ప్రతి పట్టిక చక్కగా చెక్కబడిన యిటుకలతో నిర్మితమైనది. గర్భాలయము వెనుక గోడనానుకొని ప్రధాన దేవతను ప్రతిష్టించుటకుగా నొక అరుగు చేయబడినది వెలుపలి గోడన కోష్ట దేవతలనుంచుటకుగాను కుడ్యస్తంభముల సొరుగులున్నవి. ఈ ఆలయమునకు ప్రత్యేకముగ యిటుకగోడ ప్రాకారము కూడ గలదు.

ఈ దేవాలయమును పరిశీలించుచుండగా త్రవ్వకమున, అట్టడుగు స్తరములలో కొన్ని జుగుప్సాకరమైన యవశేషములు లభించినవి ప్రాచీన వాస్తు విన్యాసములను తెలుపు నీ సామగ్రి మరియొక్కడను లభింపనందున, ఈ దేవాలయము చాల ముఖ్యమైనదిగా నెరుగవలెను.

## ఇచ్చట విన్యాసము:

ఈ దేవాలయము చుట్టును పునాది భాగముల స్తరములలోను, నేలపైని కొన్ని వస్తువులు ప్రతిష్ఠా పద్ధతులను తెలుపునట్టివి లభ్యమైనవి. అట్టడుగు స్తరములలో, గర్భాలయమునకు వెలుపల ప్రాకార గోడకు చేరువగా, నొక మృత కళేబరము లభ్యమయినది, తలదాచుకొని మోకాళ్ళపైని చేతులుంచి, నమస్కరించుచున్నట్లుగా కానవచ్చు చున్నాడు. వాస్తు పురుషుని ఆవాహనము గావించునపుడు ఈ మధ్య వయస్కుడుగానున్న మానవుని బలిగా నొసగినట్లు తెలియుచున్నది. ఈ కర్మ బహుశ వాస్తుమండలము నిర్ధారించిన వెంటనే యాచరించిరి. ఈ విధముగ వాస్తు పురుషునికి ఆహుతి - శాంతిచేయుట, సంకల్పించుకొనిన నిర్మాణమునకెట్టి అవాంతరములు రాకుండుటకుగాను చేసిరి కాబోలు. నరుని బలిగా నొసగుట వాస్తుశాంతి, వాస్తుహోమ, వాస్తుబలి ప్రకరణములలో కానరాలేదుగాని శతపథ బ్రాహ్మణమున నీ పురుషమేధమును చేయుట, వాస్తుపూర్వము యాచరించు విధిగా పేర్కొనబడియున్నది బలికర్మ విధానమునందు దిక్కులనున్న అధి దేవతలకు శాంతి సూచించబడినది. మాయమతి (క్రీ. శ. 8వ శతాబ్ది) మన వాస్తు గ్రంథమున పశు మాంసము, మేక, జింక, లేక పంది గృహక్షత, పాపరాక్షసి అంతక, మున్నగు క్రూరదేవతలకు ఆరగించుట చెప్పబడియున్నది.

## మృణ్మయ కలశము: (చిత్రములు - 35, 36)

ఈ దేవాలయము యొక్క అర్ధ మండపమున, నైఋతి దిశన నేలమట్టముపై నొక మృత్తికా భాండమును, ప్రతిష్ఠించిరి ఈ కలశముపై చక్కగా నమర్చబడిన గుండ్రటి మూత, గలదు. క్రిందన కలశభుజముపై వస్త్రములుగా స్కంధమున్నది. ఈ స్కంధముపైన కుండ మధ్య భాగమున చుట్టూ కొన్ని మట్టి బొమ్మలు చేతితో చేసినవి, నతికింపబడియున్నవి ఈ విధముగానీకలశముపై ఆరు స్త్రీ యాకృతులు గలవు. ఇందున అయిదు కలశోదరముపైన, అనగా చుట్టును: ఒక్క స్త్రీ మాత్రము తూర్పు ముఖస్తయై సుఖాశీనురాలై మూతపైని యున్నది. అన్ని స్త్రీ మూర్తులు ప్రలంబ పాదాసనస్థలై యుండుట గమనింపవలసియున్నది అన్నింటను పొత్తికడుపు, నాభియందు కొంచినట్లు చూపబడియున్నది. ముఖములు వికృతముగా కానవచ్చును. ఈ స్త్రీ మూర్తులేగాక కలశ మధ్యభాగమున చుట్టును యేడు సర్పములు, పడగల నెత్తుకొన్నట్లు, చూపబడినవి. అన్ని సర్పములు తోకలు కుడి ప్రక్కగానే త్రిప్పుకొని యున్నవి, కలశము చుట్టును యివి ప్రదక్షణము చేయుచున్నట్లు చూపబడినను యందు రెండు సర్పములు దక్షిణ ముఖముగా నున్నవి. (చిత్రము) కొంచెము పెద్దవి, పడగలు రెండు దగ్గరగా. తోకలయిరు ప్రక్కలకు పోవునట్లు చూపబడెనవి. ఈ దక్షిణ ముఖమున స్త్రీ మూర్తి కానరాదు, ఈ పెద్ద నాగములనుబట్టి బహుశ (8) పాతాళలోకము సూచించబడి యున్నట్లుగా ఊహించవచ్చును చిత్రమే మన యీ భాండముపైని తీర్చియున్న సర్పములు. స్త్రీమూర్తులు దిక్కుల. విదిక్కుల చూపబడియుండుటయేగాక, నిర్దిష్టముగా నొకక్రమమున యీ అలయపు నేలమట్టము ప్రతిష్ఠింపబడుట కానవచ్చుచున్నది.

*1.* *పూర్వదిక్కు :* (చిత్రము — 36 A) కుంభముపైని మూత వికసించిన అష్టదళ పద్మము వలె కాండముతో సహా చూపబడియున్నది. ఈ పద్మముపై స్త్రీ మూర్తి మధ్య భాగమున కూర్చొని, కాళ్లను పద్మదళములపై నుంచినట్లు కానవచ్చు చున్నది. ఈ ప్రతిమకు చేరువగా నైఋతి కోణమున కానవగు స్త్రీమూర్తి శిరోజాలంకారము, కంఠాభరణములు, చెవిని కుండలములు చక్కగా నున్నవి.

*2.* *దక్షిణ ముఖము :* (చిత్రము — 36 B) : ఈ వైపున స్త్రీ మూర్తి లేదు రెండు సర్పములు పడగలు దగ్గరగా చేర్చుకొని తోకల నిరువైపు విస్తరించి యున్నవి.

*3.* *పశ్చిమ ముఖము :* (చిత్రము — 37, A) మూతపై నదిష్ఠించియున్న వెనుక భాగము మాత్రము కానవచ్చుచున్నది. దాని క్రిందుగానున్న స్త్రీ ప్రతిమ ప్రలంబ పాదాసనమున యున్నది. తలపై జడను కొప్పుగా కట్టుకొని యున్నది.

*4.* *ఉత్తర ముఖము :* (చిత్రము — 37, B) : ఈ స్త్రీ మూర్తి చూడ సౌమ్యముగా నున్నది. సర్పము యొక్క తోక కుడిప్రక్క తిరిగియున్నది.

## రాతి ఫలకము : (చిత్రము - 34)

ఇచ్చట చతురస్రాకారమున 9 × 9 సె. మీ. కల రాతిఫలకము గర్భాలయ త్రవ్వకములలో లభించెను. దాని పైని చూపబడిన దేవతా స్వరూపములు ఆంధ్రదేశమున క్రీస్తుశకము 4-5 వ శతాబ్ది బ్రాహ్మణ మత మేరీతిగ నుండెనో, యెన్ని శాఖలుగా విస్తృతించెనో తెలుసుకొనుట కొక నిర్దిష్టమైన యాధార శిల్పము. ఇంతటి ప్రాచీన ఫలకము అందున దైవ గృహములో నిక్షిప్తమై యుండి నట్టిది. మరెక్కడను కానరాలేదు శైవ ఆగమ సాంప్రదాయ చరిత్ర పరిణామ ముల నుపాసన చేయగోరు విద్యార్థులకిది యత్యంత ప్రాముఖ్యమైనది, ఈ చిన్న ఫలకమునందు శిల్పింపబడినది భగవత్ స్వరూపములు గూడనట్లే విచిత్ర ప్రకృతిని కలిగియున్నవి. మధ్యగా నొక పెద్ద స్త్రీ మూర్తి గలదు, అంగ సౌష్టవముతో వెలుగొందే ఈ మాత శిరము విశాలమైన వికసించిన పద్మమువలె అనగా 'మస్తకే పద్మం' కంఠమున ముత్యాలసరము భుజకీర్తులు. పూర్ణకుచములు, మేఖలతో బంధించిన నీవి గలిగి, అసామాన్యముగ కూర్చొనియున్నది యీ స్త్రీ మూర్తి రెండుచేతులతోయున్నది. ఈ రెండు చేతుల శివ-విష్ణు సంకేత స్వరూపములను ధరించి యున్నది. ఈ బృహత్ భారమున కనువుగా కాళ్ళ నొక ప్రక్కగా తిప్పుకొని పిరుదులపై భారముంచి కూర్చొని యున్నది. కుడి చేతిన లింగ పీఠము నెత్తుకొని యున్నది. ఈ లింగము కొండపై కానవచ్చిన లింగ పీఠములలోవలె రుద్ర భాగమున ముఖమువైపు సూత్రముకూడ చక్కగా కానవచ్చుచున్నది. ఫలకము క్రిందుగా కుడి అంచున నంది, దేవవీక్షణ తత్పరుడుగా చూపబడియున్నాడు. యెడమ చేతిలో సింహ ముఖమున్నది. క్రింద భాగమున నరుడు మోకాళ్ళపై వంగి నమస్కరించుచున్నాడు, పైని సింహము-క్రింద నరుడు, నరసింహము వ్యూహరూపముగా నెరుగవలయును, మధ్య నున్న ముఖ్యదేవత మహాశక్తి స్వరూపిణీ-శివ-నరసింహ విష్ణురూపముల నెత్తుకొనియున్న మాతృదేవత. ఇట్టి ఫలక ములు బొంబాయి చేరువ ఘూరాపురియను చోట, కర్ణాటకములోని మజటి (బెల్గామ్) నందును లభించెను, ఇంచుమించు యిదే కాలమున యీ ప్రాంతములకూడ నీ పూజాచారములున్నట్లు స్పష్టముగా తెలుయుచున్నది.

గుజరాతులోని సామల్జీయను చోటగూడయిట్టి స్త్రీమూర్తి ఫలకములు క్షాత్రపుల కాలమునకు చెందినవి. లభించినవి క్షాత్రపనహపాణ - చష్టనులు రుద్రోపాసకులు బహుశ, తక్కిక వైదిక - బ్రాహ్మణ మత దేవతలైన, శక్తి, నరసింహ సూర్యరూపులు తంత్ర రూపములనుకూడ కొలచిరి, ఈ శక్తిరూపిణి విష్ణు ధర్మోత్తరమున (3-82-8). ఈ విధముగా జపింపబడి యున్నది,

''దేవ్యాశ్చ మస్తకే పద్మం తథాకార్యం । మనోహరం, సౌభాగ్యం తత్ విజానాహి॥

ఈమెయే మహాలక్ష్మి, సర్వమంగళ, మరియు మా- దేవత. అమరుడు క్రీ. స్తుశకము 4వ శతాబ్ది యిట్లు చెప్పియున్నాడు.

''ఇందిరా లోక మాతా మారమా మంగళ దేవతా"

పైన వివరింపబడిన ఆలయము, దేవతాస్వరూపములు, వాస్తు విన్యాస ప్రక్రియల నుద్దేశింపబడిన వస్తువులు మరెక్కడను నేనెటిగినంతలో కానరాలేదు, మరొకమారు వీటి ప్రాశస్త్యమును నెమరు తెచ్చుకొని శాస్త్రీయపరముగా వాస్తుశిల్ప కళాచరిత్రకు, కేసరిగుట్టలోని యవశేషముల ప్రాముఖ్యతను వివరింతును.

1) ఆలయములు లేక కేవలము యిటుక దిమ్మలపై ప్రతిష్ఠింపబడిన లింగములు మధుర (చిత్రము - 33) శిల్పములలోను త్రవ్వకము లందును కానవచ్చు. శివస్థలముల టోలియున్నది, ఇటుక పీఠములు ర్ఘ్యపీఠములేకాని అభిషేకమునకు పనికిరావు. అప్పటి పూజా విధానము కేవలము అర్చనార్ఘ్యములతో గావింపబడెను- పుట్టతేనె, వెన్నవంటి పదార్థములు యీనాటికిని లింగాగ్రముపై పూయుట నిచ్చట సుగాలీలు, రాజులు అచరించుచున్నారు,

ఈ లింగ పీఠములు. బౌద్ధస్థలములైన, శైల విహారములందున్న రాతిస్తూప ప్రతీకవలె, క్షేత్రమును దర్శింపవచ్చిన భక్తులు మొక్కబడిగా గావింపబడి యుండనగును. సర్వజనులకు పూజార్హములుగా, కులమత రహితమై అందరి కందుబాటులో నుండెను. జైన బౌద్ధము లందలి "దేవాయం-చెయ్యం" మాదిరివిగా గ్రహింపవలసియున్నది.

2. త్రవ్వకముల వెలికి వచ్చిన దేవాలయ సముదాయము విష్ణుకుండినరాజుల కృతముగా వీరి నాణెములు గర్భాలయములందు లభ్యమగుటను బట్టి స్పష్టమగుచున్నది. ఇదే రీతిని పెక్కు శైవాలయములు ఒక్కచోట కూటమిగా వుత్తర భాగమున మధురలోను, గుజరాతులోని కాయావరోహణ మందున లభ్యమయినవి. ఈ కాయావరోహణ పాశుపత శివాచార్యుడైన లకులీశ పండితుని గ్రామము, ఇటీవల కర్నూలుజిల్లా వీరాపురమనుచోట త్రవ్వకములలోకూడ క్రీ. శ. 2-4 వ శతాబ్ది శివాలయ కూటములు కృష్ణానది తూర్పుగట్టున బయల్పడినవి. వీరాపురములోని శివాలయముల అభిషేక-అర్చనార్ఘ్యముల కనువుగా కట్టడముల పూర్తియేర్పాట్లుగలవు. పైన కప్పుకూడా ఉన్న గుడులుగా గ్రహించవలెను.

3. పైని వివరించబడిన మృత్తికా కలశము మరెక్కడను ఇంతవరకు దొరకలేదు. ఈ పాత్రను నిధి కలశముగా లేక గర్భ పాత్రగా మాత్రమే నెరుగరాదు.

4. దైవస్వరూపములున్న రాతి ఫలకమున మహాశక్తి స్వరూపిణి. త్రిమూర్తులందు బ్రహ్మ (సృష్టి), స్థానమున తానే యుండి శివ - విష్ణుల నెత్తుకొని యున్నది. గర్భ విన్యాస కార్యక్రమమున గుండము మధ్య హోమాగ్ని నుంచు ప్రదేశమున యీ శక్తి నాహ్వానించి పూజించుచుండిరి కాబోలు, గురువు గర్భ పాత్రను రెండు చేతులతో నెత్తుకొని తూర్పుదిక్కున తిరిగి నూరు మార్లు శక్తి మంత్రమును జపించి అర్థ రాత్రిని హోమగుండమున మంత్రయుక్తముగా గర్భన్యస్తము చేయవలెను, ఈ ప్రకియ ఆలయ నిర్మాణమునకు పూర్వము ఆచరించుట పాటి. వాస్తు దేవత పాతాళవాశి. ఈ దేవతను వాస్తునాగముగా చేసి లేక భావించి కొలచుట కద్దు. ఇచ్చట దేవాలయమున లభించిన భాండము పైని వాస్తునాగములున్నవి. ప్రేతలు వికారమైన స్త్రీ రూపములుగా చేసిరి. ముఖములు స్పష్టముగా దిక్కుల చూచునట్లు నిర్దేశింపబడినవి. ఇచ్చట గావింపబడిన త్రవ్వకములు మరింకెన్నియో విశేషములను తెలుపు చున్నవి.

ఆగమ పండితులతో విమర్శన చేసి. అవశేషముల ప్రాముఖ్యతను తెలుసుకొని చక్కగా మరికొంత త్రవ్వకమును చేయవలసిన అవసరమున్నది. త్వరిత గతిని త్రవ్వకముల సాగించి అవశేషములను స్వస్థలము నుండి తొలగించి (భండాగారముల) ప్రదర్శనశాలల నింపిన శాస్త్రయుక్తముగాదు. ప్రదేశ సంస్కృతికి వివరణలకుహానికల్గును, ఆంధ్ర ప్రభుత్వ పురావస్తుశాఖ బాధ్యతతో నీ పవిత్ర స్థలములను నిశితముగా పరిశోధించవలసి యున్నది.

---

## ఉపయుక్త రచనలు :

1. ఇండియన్ ఆర్కియాలజి, ఏ రెవ్యూ. 1975 - 76 పుట - 1, మొత్తము 70 - లింగాలని, ఏ. పి. జర్నల్ ఆఫ్ ఆర్కియాలజి (హైదరాబాదు, 1979) I సం॥ 2 పుట 135 లు పేర్కొనబడినది. చూడుడు, ఇండియన్ ఆర్కియాలజి, ఏ రివ్యూ, 1975 - 76, పుటలు 1-2, 1976 - 77, పుట 3 మరియు 1978 - 79 పుటలు 63 - 64,

2. డా. ఇంగువ కార్తికేయశర్మ "దేవతల మథుర" ఆంధ్ర పత్రిక కాళయుక్తి నామ సంవత్సర సంచిక (ఏప్రియల్ 1978)

3. స్టెల్లా క్రామ్‌రిచ్ "ది హిందూ టెంపుల్ (కలకత్తా 1946) I పుట - 78, నోటు-44 మరియు పుట 80. నోటు 52,

4. డా॥ ఏ. కె. కుమారస్వామి ''ఏంజెల్ అండ్ టిటాన్. అన్ యెస్సే ఆన్ వేదిక్ ఓంటాలజి'' జర్నల్ ఆఫ్ అమెరికన్ ఓరియంటల్ స్టడీస్. సంపుటి - 55 పుట - 401

5. బ్రూనో డా జిన్స్. మాయామత, (పుదుచ్చేరి, 1970) పుటలు 99-105, ఎన్. వి. మల్లయ్య స్టడీస్ ఇన్ సాన్స్క్రిట్ టెక్స్ట్ ఆన్ టెంపుల్ ఆర్కిటెక్చరు'' విత్ రెఫరెన్సు టు తంత్ర సముచ్చయ. (కాలికట్ 1949) పుట 128, పి. కె. ఆచార్య, ఆర్కిటెక్చర్ ఆఫ్ మానసార, సీరీస్ - 4 (రెండవ ముద్రణ 1980) పుట - 61 అధ్యాయము - 8.

6. ఎన్.పి. జోషి మధుర స్కల్ప్చర్సు ఇన్ ది ఆర్కిలాజికల్ మ్యూజియం (మధుర 1966) పుట 80 నం10

7. యు. పి. షా ''బిగినింగ్స్ ఆఫ్ ది సూపర్ స్ట్రక్చర్ ఆఫ్ యిండియన్ టెంపుల్సు'' ప్రమోద చంద్ర, స్టడీస్ ఇన్ టెంపుల్ ఆర్కిటెక్చర్ (వారణాశి, 1975) పుట 82

8. ఇండియన్ ఆర్కియాలజీ, 1974 - 75 ఏ రెవ్యూ పుటలు 15-16; 1975-76 పుట 15 చిత్రములు

9. ఎన్. వి. మల్లయ్య (1949) పుటలు 130 - 136, తంత్ర సముచ్చయ, పుటలు I 96 - 100

10. స్టెల్లా క్రామ్‌రిచ్, (1946) I పుట 128

11. మైఖల్ మీస్టర్, ''డిస్కోర్స్ ఆన్ శివ,'' (బొంబాయి, 1985) పుటలు - 286, 287, 288.

***

# దేవతల మధుర

ఉత్తర భారతమున మహాభారత రచనాకాలమునకే మధుర మహాపవిత్ర స్థలముగా నుండినది. మథురా నగరము- కృష్ణ పరమాత్మ, గోపులు, గోపికలు యమునాతీరము తలపునకువచ్చినంతనే మనోజ్ఞమైన భావములు కల్గును ప్రాచీనముగ కూడ నీ ప్రదేశము వివిధ మత సాంప్రదాయముల కాలవాలమై శిల్ప కళారీతులకు మాతృకగా షుమారు రెండువేల యేండ్లు సుదీర్ఘమైన చారిత్రక నగరముగా పెక్కు రాజవంశములకు దేవతల కధివాసమై విరాజిల్లినదీ మధురాతి మధురమైన మధురాపురము

మొట్టమొదటగా 1936 లో నీ స్థలమును కల్‌నల్ స్టాసీ కొన్ని ప్రాచీన శిల్పములను కనుగొనెను, ఆ తర్వాత అలెగ్జాండర్ కన్నింగ్‌హాము, గ్రౌసి, ఫరర్ మొదలగువారు త్రవ్వకములు సాగించి పెక్కుకళాఖండముల సేకరించిరి. ఇవన్నియు స్వదేశముననున్న మధురా - లక్నో - పాట్నా - కలకత్తా - ఢిల్లీ (నేషనల్ మ్యూజియం),

మొదలైన భండాగారముల ప్రదర్శితములుగా నున్నవి. విదేశముల, ముఖ్యముగ జర్మనీ - పారిస్ - లండను - న్యూయార్క్ మ్యూజియములలోకూడ నీ మధురశిల్పములు చూడవచ్చిన వారి నెంతో ముగ్ధులను చేయుచున్నవి. ఈ శతాబ్దపు మొదట్లో వొగెల్ - అగ్రివాలా మరియు వాడింగ్టన్, మధుర చుట్టుపట్ల స్థలాన్వేషణలు గావించిరి. కాని సశాస్త్రీయముగా పరిశోధనలు జరుగలేదు. ఈ కొరతను తీర్చు నుదేశ్యముతో శ్రీ వేంకటరామయ్యా మరియు శరణ్ 1954 - 55 లలో "కట్రయచవిహార" యను స్థలమున త్రవ్వకములు గావించిరి పాటిమట్టి దిబ్బలచుట్టుచూ కోట గోడలు కొన్ని బయల్పడినవి. ఐదు ప్రత్యేక కాలములకు చెందిన పురావస్తు సంపదను క్రీ॥ పూ॥ 6-వ శతాబ్దినుండి క్రీ. ఆరవ చెందినట్లు విశదీకరించిరి. ఆ తర్వాత 1973-74 నుండి 1976-77 వరకు శ్రీ జోషి మధుర చుట్టుపట్ల ముఖ్యముగా "అంబరీషతీల" యనుచోట త్రవ్వకములు చేసెను, పైన లభించినట్లుగనే ఐదు కాలములకు చెందిన పురావస్తు సముదాయము లభ్యమయినది. ముఖ్యముగ కుషానుల పూర్వకాలమునకు చెందిన అపురూప శిల్పములు, మట్టి బొమ్మలు - వొరల బావులు - ఇటుక కట్టడములు లభ్యమయినవి. వీటితో బాటుగనే మధురకు 30-కిలో మీటర్ల నైఋతి దిశగానున్న ప్రాచీన స్థలమైన "సోంఘ్" య ను చోట బెర్లిన్ మ్యూజియం డైరెక్టరుగానున్న హెర్బర్ట్ హార్టెల్ అతని అనుచరులు సర్వశ్రీ అవాన్ మ్యూలర్ - జిమ్మర్ మన్ , మరియు గ్రీసల్ పెద్దయెత్తున త్రవ్వకముల గావించిరి. మౌర్యకాలమునకు పూర్వమునుండి - జాట్ల పరిపాలనవరకు దాదాపు 37 - స్తరములలో మధుర చరిత్రను వెలికి తీసిన ఘనత శ్రీ హార్టెల్ వారి బృందమునకు దక్కినది. మధురలో కుషాను రాజుల కాలమునాటి శైవ - వైష్ణవ దేవాలయములు, అపురూపమైన కంచు, రాగి విగ్రహములు నాగపూజ ఆచారములోనున్నటుల తెలియుచున్నది, ఇచ్చట చూపిన మధుర దాని చుట్టుపట్లనున్న ప్రాచీనస్థలములు చూపుచున్నది. (చిత్రము — II) ఈ వ్యాసమున పలుచోట్ల లభించిన దేవతలను, దేవాలయములను గూర్చి వివరింతును.

**క్రీస్తుపూర్వపు మధుర :** పార్థహోము, మహోలి, అంబరీషతీల, కట్రా, సోంఘ్, భూతేసర ,మున్నగు చోట్ల గావించిన త్రవ్వకములవలన- క్రీ॥ పూ॥ 6-వ శతాబ్దినుండి నాల్గవ శతాబ్ది వరకు ఈ ప్రదేశాలకు చేరువన మధుర చిన్న పల్లెగానుండినటుల తెలియవచ్చినది, (కాలము — 1) ఆ తర్వాత కాలమున (కాలము — 2). క్రీ.పూ. నాల్గవ శతాబ్దినుండి — రెండవ శతాబ్ది వరకు మౌర్య వంశీయుల పాలనలో మధుర నగరమైనది. కోట గోడలు పెద్ద యిటుక కట్టడములు నిర్మింపబడెను. మౌర్యకాలపు మాతృక బొమ్మలు. రాగి నాణెములు. శోభాయమానమైన మెరుపు - నలుపు బంగారువర్ణములుగల్గిన యన్. బి. పి. అను మట్టి పాత్రలు బౌద్ధ - జైన యవశేషములు, శిల్పములు పెక్కులభించినవి. యక్షపూజ, నాగపూజ ప్రచారములోనుండెను. పార్థహోములు లభించిన మణిభద్ర యక్ష శిల్పము. మధుర మ్యూజియమునగల యక్ష ప్రతిమలు బరోడా గ్రామమున లభ్యమైన కుబేర, హారతి ప్రతిమలు యీ కాలమునకు చెందినవి. క్రీ॥ పూ॥ 1-వ శతాబ్ది చివర వరకు (కాలము — 3) కుషానుల పూర్వ యుగముగా పేర్కొనవచ్చును. ఇండో గ్రీకు రాజులొసగిన కంచు - రాగి నాణెములు మధురను పాలించిన శుంగ మరియు మిత్ర వంశజుల కృతములైన స్తూపారామములు. తరువాతి కాలపు నిర్మాణముల క్రింద మరుగై శిథిలములుగా కాన వచ్చినను, యిచ్చట లభించిన శిల్ప శాసనముల చాల ముఖ్యమైనవి భూతేసరలో లభ్యమైన వేదికస్తంభములు (చిత్రము — 39) వాని పైనున్న చక్కని స్త్రీమూర్తులు సాలభంజికలు, యక్ష - యక్షిణులు, యిటీనల సంఘోల్ నందు లభ్యమైనవాటికి చక్కని సంబంధమున్నది. గజపృష్ఠాకారపు (చిత్రము - 38) నొక యిటుక దేవాలయము నాగపూజ స్థలవాలమైనటుల హెర్టల్ కనుగొనెను ఈ కాలమునకు చెందినదేయైన యొకకాల్చిన యెర్రమట్టి ఆలయ చిత్ర ఫలకము పొడుగుపాటి శాలవలెనుండెడి దేవాలయపు ప్రతిగా వాస్తు రీతిని తెలుపుచున్నది.

**కుషానుల కాలపు మధుర** : క్రీస్తుశకము 1 నుండి 178 వరకు (కాలము - 4) మంగోలు కుషానులు రాజ్యము చేశిరి. వీరి రాజ్యము ఉత్తరమున మధ్య ఆసియా, దక్షిణమున ఘధురానగరము, తూర్పున మగధ-ఉత్కళమువరకు వ్యాప్తి చెందెను. ఈ వంశజులలో ముఖ్యులు మొదటి కాడ్ఫీసు, రెండవ కాడ్ఫీసు, కనిష్క, హువిష్క మరియు వాసుదేవులు వీరి కాలమున మధుర చరిత్ర స్వర్ణయుగమనియే చెప్పనగును. వివిధ మతముల కూడలియై, ప్రాచీనశిల్ప కళాపీఠముగా ప్రపంచమున శాశ్వతకీర్తి నార్జించెను.

శిల్ప కళలో కొన్ని నూతన ప్రక్రియలు యిచ్చట వుద్భవించెను. ఈ మూర్తులకళ, సంస్కృతులవల్ల, భక్తిమార్గమునకు గట్టిగా పునాది చేకూరెను. ఆరాధన కవసరమైన దేవతామూర్తులు విరివిగా చేయబడెను. మత మేదియైనను, శాఖలై ఉద్భవించినను బౌద్ధ - జైన - హిందు శిల్పకళలయందు పెక్కు సామ్యములుండెను ఈ కాలమున దేవతామూర్తులు యే మతశాఖలకు చెందినవో మహారాజు కనిష్కునికే గుర్తింప కష్టమాయెనని అశ్వఘోషుడు 'సూత్రాలంకారమున చమత్కరించినాడు

మధుర కుత్తరమున 12 కిలో మీటర్ల దూరములో 'మాంట్' అనుచోట కుషానుల దేవకుల (దేవాలయం) ముండినది. ఇచ్చట రాజదర్బారును బోలిన శిల్పశాలయుండెను. ఇచ్చట లభించిన శకనృపుల నిజరూపములు బోలిన ప్రతిమలు ప్రపంచ ఖ్యాతిచెందినవి.

## శైవ - వైష్ణవములు :

సోంఘ్యనుచోట హార్టల్ గావించిన త్రవ్వకములలో కుషాను కాలమునకు చెందిన శైవ-వైష్ణవ దేవతామూర్తులు, ఆలయ శిథిలములు వెలుగునకు వచ్చినవి. కార్తికేయ, సింహముఖియైన మాతృక, విష్ణువు, సూర్యభగవానుడు, అగ్ని. కామదేవ, లక్ష్మి సరస్వతుల ప్రతిమలు దొరికినవి. (చిత్రము - 41) ఇవిగాక దుర్గ మహిషమర్దిని, స్కంద (చిత్రము-40) మున్నగు విగ్రహములు చాల ప్రాచీన మూర్తి శిల్పములు. ఒక దేవాలయ సముదాయమున గర్భగృహము గజపృష్ఠాకారములనుండి విశాలమైన ముఖమండపము చుట్టును 15-గుండ్రని స్తంభములుగల ప్రాంగణము కలదు. ఈ దేవాలయ (చిత్రము-38) తూర్పు ప్రాంగణమున తూర్పు ముఖద్వారము నాగ-నాగిణి శిల్పములతో నలంకరింపబడియున్నది. నాగపూజ వివిధ రీతులుగా ప్రబలియుండెను. పెద్దనాగశిల్పము (2.5 మీటర్లు నిడివి) చార్గాంఅను చోటలభించినది. దధికర్ణనాగ, భూమి నాగ శిల్పములుకూడ లభించినవి. కృష్ణభగవానుని అన్నబలరాముడు శేషనాగుని యవతారము, విష్ణువు శేషశయనుడు, నాగులు జైనతీర్థాంకరులైన పార్శ్వనాధుడు,సుపార్శ్వులకు చిహ్నములు. బుద్ధుని రక్షించినది. ముచిలింద నాగుడు, నాగజాతివారైన నంద-ఉప నందులు గౌతముని పురిటి స్నానము గావించునట్లు పెక్కు శిల్పములే తెలుపుచున్నవి. ఇప్పుడుకూడ నీ ప్రదేశమున నాగదేవాలయ ముండుట సజీవమైన సాంప్రదాయమునకు నిదర్శము. గాంధారశైలిలో పంట్లాము బూట్లువేసుకుని సప్తాశ్వరథారూఢుడైన సూర్య భగవానుని శిల్పము కనిష్కుని ప్రతిమను బోలియున్నది.

## గుప్తరాజ్యకాలపు మధుర :

వీరి కాలమున. క్రీ. శ. 3-4 వ శతాబ్దాలనుండి 6వ శతాబ్దవరకు సాంచి. సారనాథము, ఉజ్జయినీలవలెమధుర ఖ్యాతిబడసెను. కాత్రయనుచోట వైష్ణవాలయముండెడిది. చంద్రగుప్త విక్రమాదిత్యుడు పరమభాగవతుడు, అయినను

యాతని కాలపు కృతమైన బుద్ధ విగ్రహము ప్రతిమాలక్షణమున మణిపూసగా, ఉదాత్తమై, భక్తిభావస్ఫోరకమైన కళా మూర్తిగా భాసించుచున్నది. 'కంకలితీల'లో శిథిలమైన శివాలయము గుప్తరాజుల కాలము నాటిది. పలువిధములైన శివలింగములు - ఏక, త్రిముఖ, చతుర్ముఖ మరియు అష్టముఖ విగ్రహములు కానవచ్చినవి. ఇందలి లకులీశ, అర్ధ నారీశ్వర, మున్నగు శైవ శిల్పములు, నరసింహ, వరాహ విష్ణు, మహావిష్ణు, విశ్వరూప విష్ణు త్రివిక్రమ శిల్పములు ప్రపంచ ఖ్యాతిగాంచినవి. విష్ణుని ఆయుధములు వేరువేరు పురుష రూపముల మొదటగా మధురలోనే చూడగలము. శ్రీ కృష్ణ భగవానుని జన్మస్థలంగా, పలుమత సాంప్రదాయములకు కూడలియై, భారత ఐతిహాసిక చరిత్రకు మూల స్థానమైన యీ మధురను తలపుకు తెచ్చుకొని విశ్రామ ఘట్టమునుండి యమునా తీరము పక్కగా ప్రయాణము చేయుచూ యిప్పటి కట్టడములమధ్య మరుగుపడిపోయి శిథిలావస్థలోనున్న బృందావనము, దేవాలయములు, ఆశ్రమాలు తన్మయత్వాన్ని కలిగించుచున్నవి.

## ఉపయుక్త రచనలు


1. మధుర, మార్గ్. (బొంబాయి, మార్చి-1962) సంపుటి XV నం. 2.

2. త్రవ్వకములగూర్చి - ఇండియన్ ఆర్కియాలజీ, ఎరెవ్యూ, 1966-67, పుటలు 40,43, 1968-69, పుటలు, 40.,

   1969-70, పుటలు, 42-43, 1970-71, పుటలు 39-40.,

   1971-72, పుట 48, మరియు హెర్‌బర్ట్ హార్టెల్, జర్మను స్కాలర్స్ ఆన్ యిండియా, సంపుటి II, (బొంబాయి, 1976), పుటలు 69-99.

3. డా. యమ్. సి. జోషి, "ప్రీ కుషానుల మధుర" సెమినార్ పేపర్సు, (న్యూఢిల్లీ, 1977).

# హరిహరతత్త్వము: మూర్తిలక్షణములు

శివకేశవాద్వైతరూపమైన 'హరిహర' తత్త్వము ఋగ్వేదమునందలి '' ఏకంసత్ విప్రాబహుధావదంతి '' యనుసూక్తిని విశదీకరించుచున్నది. అట్లే శతరుద్రీయమున 'ఓంశిపివిష్టాయ' యనుమంత్రము శివ-విష్ణువుల కలయికను సూచించుచున్నది. సాయణాచార్యుడు-విష్ణుః శిపివిష్టః యితిశృతేః యని వివరించియున్నాడు. తైత్తిరీయ ఆరణ్యకమున ''ఓంనమో భగవతే రుద్రాయః విష్ణవే మృత్యుర్మేపాహి'', యను మంత్రము కలదు. పంచభూత స్వరూపియైన శివుని యేక, ద్వి- త్రి, చతుర్ముఖ, పంచముఖ, అష్టముఖ లింగస్వరూపిగా ఆర్చించుట అనాదిగా వాడుకలో నుండెను. అట్టి స్వరూపములందు వామదేవుని ముఖము ఉమావక్త్రముగా పేర్కొనబడినది. విష్ణువు తో బుట్టువు దుర్గ, పల్లవ, చాళుక్య శిల్పములను మహిషమర్దని, దుర్గ శివుని యర్ధాంగియైనను, వైష్ణవ లాంఛనములైన శంఖ చక్రముల గలిగియుండుట గమనార్హము. స్థూలముగ పరిశీలించిన అర్ధనారీశ్వర స్వరూపము హరిహర మూర్తితత్త్వమునకు అనుయాయి.. నీలకంఠ దీక్షితులవారు

''శివఘోరాచేతి శ్రుతీషు విదితే యేమమ। తన్ను తరయోబాద్యామూర్తిః పరమరమణీయత్వమసిమే ॥

త్వమస్యార్ధం దేహే త్వమపివదనం। దక్షిణామితిత్వయిప్రియేః'' (నీలకంఠ చంపు 114.26) ॥
వివరించియున్నారు. ఇక సంధ్యావందనమున ఈశ్వర ధ్యానము కలదు. ఇచ్చట.

''శివాయ విష్ణు రూపాయ శివరూపాయ విష్ణవే। శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చహృదయంశివః ॥

''యథాశివమయోవిష్ణుః యేవంవిష్ణుమయశ్శివః యథాన్తరం ననశ్యామి తథామేస్వస్తిరాయుషి॥ ''

విష్ణు రూపుడైన శివునికిని, శివరూపుడైన విష్ణువునకును నమస్కారము. శివుని హృదయమే విష్ణువు, విష్ణుహృదయమే శివుడు, విష్ణువే రీతిని శివమయుడైయుండెనో- అట్లే శివుడును విష్ణుమయుడైనాడు, వీరిరువురిని భేదము లెక్కింపని వాడు ఆయుష్మంతుడగును.

ఇంతయేల! గాయత్రి మంత్రము త్రిమూర్తుల యేకత్వమును ఘోషించుచున్నది కదా? ప్రాతఃకాలమున బ్రహ్మ, మధ్యాహ్నమున విష్ణువు, సాయంకాలమున శివుని, సూర్య భగవానుని గతిలో ముడిపెట్టి నారాధించిరి. ఉపనిషత్తుల లోని ''నమో రుద్రాయ విష్ణవే'' యను మంత్రమును మహాకవి తిక్కన ''విష్ణురూపాయనమః శివాయ''యని మంగళాది శ్లోకమున స్తుతించెను. వేదాంతుల, స్మృతికర్తల, ధర్మమాయని వైదికాచారములున్న శివకేశవాద్వైతతత్త్వములున్న శాశ్వతముగ హిందూ సంప్రదాయమున పాతుకుపోయినవి. కాని అప్పుడప్పుడు మతశాఖల వైషమ్యములు పెరిగి, కొన్ని విపరీతములకు దారి తీసెను.

ఉత్తర భారతమున హరిహర పూజ చాల ప్రాచీనము. వేదభూమిగా ఖ్యాతిగాంచిన సింధుదేశము - సరస్వతీ దృషద్వతీనదుల ప్రాంతముల నీ శివకేశవుల సమన్వయము, పలువైదిక దేవతల యారాధన వాడుకలో నుండినటుల తెలియుచున్నది. ముఖ్యశాఖలైన శైవ- వైష్ణవ, సౌరములీగాంధార, సింధుదేశములందు పరిణతికి వచ్చెను, కాలక్రమేణ దక్షిణ దేశమునకు వ్యాప్తిజెందెను. వాయవ్యముగనున్న సింధు గాంధార దేశములు క్రీ. పూ. 2వ శతాబ్ది మొదలు క్రీస్తబ్దము 2-వ శతాబ్ది వరకు ఇండోగ్రీకు నిధియను (పార్థియనులు) కుషాణరాజుల పాలనములోనుండెను.

ఈ ప్రాంతములో అనాదిగానున్న బ్రాహ్మణమతము, ఆచార సంప్రదాయముల నీ పరదేశీయ ప్రభువులు మిక్కిలి మక్కువతో నాదరించిరి. పరిపాలనా దక్షులగుటచే, ముఖ్యముగ కుషాణరాజులు, శైవ-వైష్ణవములను, సంస్కృత భాషను, బ్రాహ్మీలిపిని అధ్యయనము గావించుటయేగాక తామొసగిన నాణెములపైని, సిక్కాలపైని శివ-విష్ణు, దుర్గ, కార్తికేయ స్వరూపములను చిత్రించిరి. పెక్కుశాఖల సమన్వయమునకు పాటుపడినట్లుగూడ తోచుచున్నది. వైదిక మతమును గౌరవించిరి.

మొట్ట మొదటగా హరి-హర ప్రతిమను హువిష్కుని నాణెములపై చూడగల్గుచున్నాము. ఈ రా జొ స గి న మరికొన్ని నాణెములలో శివ-విష్ణు, సూర్య లేక బ్రహ్మ విడివిడిగాను లేక త్రిమూర్తులు వాహన సమేతముగా (అనగా నంది, చక్ర పురుషుడు, గజము), నుండుట విశేషము, కానీ ఈ పార్థియనులు, కుషాణులు, శకనృపులు, తమ ప్రాచీన సంస్కృతులను వాసనలను విడనాడలేరు. భారతదేశమునకు వచ్చిన తోడనే వైదికదేవతలను, ఆచారములను చూచి ముగ్ధులైరి. వీరిపాలన క్రీ. శ. 1-2 వ శతాబ్దిలో ఆంధ్ర ప్రాంతమునకు గూఢ వ్యాపించినది. ఈ కాలమున మధురా నగరము దేవతల మధురమైనది. హరి హర లేక హర్యార్థ, అర్ధనారి, త్రిమూర్తి, శిలాశిల్పములు పెక్కులు గావింప బడెను. (చిత్రము-42) గిరిధారిపురమనుచోట లభించిన రెండు శిరో భాగములు అత్యంత ప్రాచీన 'హరిహర' మూర్తి స్వరూపములుగా పేర్కొనవలసియున్నది. కుడి భాగమున మణి ఖచితమైన కిరీటము గలిగియున్నది. ఇవి క్రీ. శ. మొదటి శతాబ్దికి చెందినది.

గుప్తకాలమునకు చెందిన (క్రీ. శ. 5 వ శతాబ్ది) నలందలో లభ్యమైన శిక్కా, హరిహర మూర్తిని చూపు చున్నది. దేముడు త్రిశూలము, చక్రము గలిగియున్నాడు. ఇదేకాలమునకు చెందినట్టి మరియొక హ రి హ ర మూర్తి పాట్నా వస్తు ప్రదర్శనశాలయందు చూడనగును. సమపాదస్థానకమూర్తియై, కుడిప్రక్క శిరముపై జటాజూటమున నెలవంకతో. వామభాగమున కరండ మగుటధారియైయున్నాడు. ఫాలభాగమున నిటారుగా మూడవకన్ను దానినంటు కొనియే నామము గలవు. కన్యాకుబ్జమున అసాధారణమైన మరొక శిల్పము క్రీ. శ. 5 వ శతాబ్దికి చెందినది ఉన్నది. చతుర్భుజములు గలిగియున్న ఈ సమపాద స్థానికమూర్తి కుడి భాగమున, ఫాలమున త్రినేత్రము, జటాజూటముపై నెలవంక. ఊర్ధ్వశిశ్నమును చూపుచున్నను, అజినమును ధరించియున్నాడు, యెడమప్రక్క విష్ణుస్వరూపుడు చక్కని సౌందర్యరాశిగా, కిరీటము గలిగి మోకాలి క్రిందుగా జారిన వైజయంతీమాల. యిరు ప్రక్కల క్రిందుగా నమస్కార ముద్రలో గణములు చూడనున్నారు. తీరాంధ్రమున యిటీవల వేంగిపుర త్రవ్వకముల (1986-87) అందు నొక హరి హర ఆలయము వెలికి వచ్చినది. ఈ హరిహరాలయము చతుర ప్రాకారము గలిగిన యిటుక నిర్మాణము. మూర్తి యొక్క ఊర్ధ్వ భాగము, భుజముల వరకే లభ్యమైనది. కుడి ప్రక్క హరుడు దండపరశు గలిగియున్నాడు. వామ భాగమున చేతితో శంఖమున్నది. ముఖలక్షణములు వాకాటక శిల్పమును బోలియున్నది. ఈ ఆలయము విష్ణుకుండిన ప్రభువుల కాలమునకు చెందినది. హరిహరపూజ దేవాలయములు క్రీస్తబ్దము 5-వ శతాబ్ది నాటికే ఆంధ్ర ప్రాంతమున ప్రచారములో నుండెననుటకీ వేంగిదేవాలయము నిదర్శనముగా నెరుగవచ్చును. ఉత్తర హిందూస్థానమున (క్రీ. శ. 7-9) శతాబ్దులలో గుజరాతు, రాజస్థానము, బీహారు ప్రాంతముల హరి హర మూర్తులు ఆలయ కోష్ఠములందు కాన వచ్చుచున్నవి. భువనేశ్వరమున భేతాళ దేవుని ఆలయమున (క్రీ. శ. 775) నొక శిల్పముకలదు. పుష్పగుచ్ఛమున యోగాసనములో హరిహరుడు చూపబడినాడు. (చిత్రము-1) లోవలె ఊర్ధ్వశిశ్నముున్నది. ఈకోటకు చెందినదే ముఖ లింగమున మధుకేశ్వరాలయ కోష్ఠములోనున్న హరిహరుడు ఈ ప్రతిమలు శాక్తుల రీతిని అనుకరించుచున్నవి.

గూర్జర దేశమున హరి హరునికి ప్రత్యేక దేవాలయములున్నట్లు తెలియుచున్నది. ఈ యాచారము బహుశ శక క్షేత్రపుల నుండి సంక్రమించి యుండవనగును. ఉత్తర గుజరాతులోని విశాలనగరమున హరిహర దేవాలయమున ప్రతిష్ఠితమైయున్న విగ్రహము చాల చక్కనిది. చతుర్భుజుడైన ఈ స్వామి అన్ని లక్షణ - లాంఛనములతో శివ పరిచారకులైన భృంగి - శృంగి విష్ణుపరిచారకులైన జయ విజయులతో చూపరుల నాకట్టుచున్నాడు. రాజస్థానములోని దేవాలయ పట్టణమైన ఓసియా యనుచోట పంచాయతీనాలయమున హరిహరమూర్తి ఖ్యాతిగాంచిన శిల్పము కలదు. ఈ హరిహర శిల్పము అన్నియు, ఆగమశాస్త్రములు పేర్కొన్న (కామికాగమ కారణాగమ అంశుమత్ భేదాగమ వైఖానసాగమ) మందువర్ణించినట్లు తెలియుచున్నది.) విధముగా నన్ని లక్ష్యలక్షణ సమన్వితములై యున్నవి. మన భాషా - సంస్కృతుల కత్యంత చేరువైన కర్ణాటక దేశమున కొన్ని మహత్తర శిల్పములు గావింపబడెను. ఇవన్నియు చాళుక్య నృపతుల కాలము నుండి లభించుచున్నవి గోపీనాథరావుగారు పేర్కొన్న బాదామి గుహలోని హరిహర మూర్తులు పలువురి ప్రశంసలందుకొన్నవి. (చిత్రము-44) లో చూపినయర్ధ శిల్పము బాదామి మొదటి గుహలోగలదు. నాలుగు భుజములు గలిగిన యీ మహోదాత్తమూర్తి కిరువైపులా శివ-వైష్ణవ గణములేగాక, కుడి భాగమున పార్వతీదేవి, యెడమ ప్రక్కగా లక్ష్మి యుండుట ప్రత్యేక శోభనిచ్చుచున్నది. సంపూర్ణ హరిహరతత్వము జూపు నిశితమైన ఈ కళాఖండమును మరికొంత వివరముగా పరిశీలింతును. కుడి భాగమున శివుడు శిరముపైని కపాల నాగభూషిత జటా జూటము గలదు. కుడిచేతిలో పరశువుతో ముడివడిన నాగము, క్రింద చేయి అభయ ముద్రలోనుండి నాగభుజకీర్తి కంకణముల గలిగియున్నది. వామభాగమున పై చేతిని శంఖము, క్రింద చేయి కటిభాగముపైనున్నది. శిరముపైని కరండ మకుటము, కర్ణమున మకర కుండలములు కలవు. ఫాలభాగమున త్రినేత్ర పుండరీకములున్నట్లు కానరాదు. క్రిందుగా గణములు వివిధ నాట్య భంగిమలలో నున్నారు. పై భాగమున యిరువైపుల గంధర్వ - కిన్నర దంపతులు కానవచ్చుచున్నారు.

బాదామిగుహ - 3 లో మరియొక శిల్పరాజము కలదు (చిత్రము—45) శాసనమును బట్టి యీ శిల్పము క్రీ. శ. 578 నాటిది. ఇచ్చట చతుర్భుజుడైన హరిహరుడు మాత్రమే యున్నాడు. సౌదర్యరాశి కుడిపై చేతిలో నాగబంధమైన పరశువు, క్రిందిచేయి వరముద్రలో నున్నను నేదో పిండము నరచేతిని కల్గియున్నాడు. నాగమేఖములతో ముడివడిన అజిన వస్త్రము. యజ్ఞోపవీతము కుడి ముంజేయిమీదుగా సర్పముతో నున్నది. వామ భాగమున శిరస్సుపై రత్నఖచితమైన కిరీటము, చెవిని మకర కుండలములు, చేతుల కంకణకేయూరములు గలవు, పై చేతిలో శంఖము క్రింది చేయికటిపైనున్నవి. కాళ్ళపై జీరాడుచున్న వైజయంతిమాల, పట్టుపీతాంబరము- మేఖలాసరములలో బంధింపబడి యున్నది. శిరశ్చక్రము, ఆకర్ణాంత నయనములు, సుదీర్ఘముల నాగ - మకర కుండలములు, కంఠాభరణములు, చక్కనిచెక్కిలియీ ముగ్ధమోహనమూర్తికి మరింత శోభ నొసగినవి. ఫాల భాగమున త్రినేత్రము, పుండరీకములు చూచాయగా కానవచ్చుచున్నవి. దక్షిణదేశపు ఆగమగ్రంథములైన కామికావైఖానసాగమములలో పేర్కొన్న లక్షణ - లాంఛనములన్నియు నీ శిల్పమున కానవచ్చుచున్నది. తీరాంధ్రమున కొంతమేర తొండ మండలమునంతను క్రీ॥ శ॥ 7 - 8 వ శతాబ్దిని పల్లవులు పాలించుచుండిరి. చాళుక్యరాజులతో వీరికి వైరముండినను దేవాలయ వాస్తు. మూర్తిశిల్పపూజావిధానముల పెక్కు సామ్యములుండెను. పోటీలు పడి వీరు తమ తమ రాజ్యములందు దేవాలయములగట్టి అందు మూర్తుల ప్రతిష్ఠలు గావించిరి. మహాబలిపురమున ధర్మరాజరథమున ఆగ్నేయమూల గోడపై కోష్ఠమున హరిహర మూర్తి యర్ధశిల్పమున్నది. ఈ మూర్తి చతుర్భుజుడు సమపాదస్థానకమూర్తిగా నున్నాడు. (చిత్రము - 48) శిరముపై పొడుగాటి జటాజూటబంధము, వామభాగమున కిరీటమునున్నవి. కాని

తృతీయ నేత్రము కానరాదు, వస్త్రమునకూడ భేదము గోచరించదు. అర్ధనారీ కోష్ఠము ప్రక్కగనే ఈ హరిహరమూర్తి దక్షిణముఖియైయున్నది. చాళుక్యశిల్పములలోనున్న సజీవశైలి భావుకతకానరాదు, ఇదే కాలమునకు చెందినట్టివి, కొన్ని బాదామి చాళుక్యప్రభుకృతములు మహబూబునగరు జిల్లాలోని కూడలి సంగమేశ్వరము, అలంపురము. భావనాశి సంగమేశ్వరము మొదలగు తీర్థక్షేత్రముల, దేవాలయకోష్ఠములలో చక్కనిశిల్పరాజములుకలవు. ఇచ్చట చూపిన (చిత్రము - 47) శిల్పము మకర తోరణాలంకృతమైన భద్రకోష్ఠములోనున్న హరిహర మూర్తిది. రూపాలగుడియని ఖ్యాతిగాంచిన యీ చక్కని చాళుక్య ఆలయము భవనాశి సంగమేశ్వర కూటమిలో చేరియున్నది. అన్ని లక్షణములతో నున్న ఈ స్వామి మహామండపముయొక్క ఉత్తరపు గోడపై భద్రకోష్ఠమునగలదు. ఇంచుమించు పల్లవులశైలిని బోలియున్నను కుడి పై చేతిలో త్రిశూలమును కలిగియున్నాడు. (చిత్రము — 47) లోని హరిహరుడు కూడలి సంగమేశ్వరాలయ మండపము వెలికి ముఖమున భద్రకోష్ఠమున అమర్చబడి యున్నాడు. విమాన తలము, చంద్రముఖములతోటి కపోతప్రస్తరము రెండు కుడ్యస్తంభములపై నిల్చియున్నది, నాలుగు భుజములుగల్గి బొద్దుగా చక్కని బాలునివలె నున్న ఈ హరిహరుని చాళుక్యకృతమని చెప్పకయే తెలియుచున్నది. వామభాగమునపై చేతిలో ప్రయోగ చక్రమున్నది. క్రింది చేయి కటిపై నున్నది, మేఖలములతో బంధించియున్న పీతాంబర వస్త్రము మధ్యన ధోవతి మడతలతోడ చక్కగా కానవచ్చుచున్నది. కిరీటమున పద్మాకారమకుటమణి కర్ణకుండలములు, భుజకీర్తులు కంకణ కేయూరములు విష్ణుమూర్తి లాంఛనములు, కుడిప్రక్కన శిరముపై జటాజూటపుముడులలో నెలవంక, కర్ణమునందు సర్పకుండలము పై చేతిలో డమరుకతోడి దండము. ముందు అరచేయి యభయముద్రలోనున్న ఈ శిల్పముపై నుదాహరించిన హరిహరులకు భిన్నముగా నొక ప్రత్యేకతను చూపుచున్నవి. ఈ ఆలయ శిల్పము క్రీ॥ శ 6 వ శతాబ్దికి చెందినది. బాదామి గుహల శిల్పమున నంది, గరుడులుకూడ చూపబడియున్నారు. విష్ణు, ధర్మోత్తర పురాణమున చెప్పబడినటుల శివభాగమున పార్వతి, విష్ణు ప్రక్క లక్ష్మీదేవికూడ చూపబడుట యాచారము. తరువాత కాలమున కూడ నక్కడక్కడ హరిహర మూర్తులు కానవచ్చుచున్నవి. చోళరాజులకాలమునాటిదైన తంజావూరులోని బృహదీశ్వరాలయమున, గంగైకొండ చోళపురమున కోష్ఠములనుంచి పూజించిరి. ద్రాక్షారామమున నొక శాసనమున హరిహరనాథుని ఆలయమున్నట్లు ప్రస్తావనకలదు. కాని ఇది చిన్న అంగాలయముగా తోచును. దక్షిణ భారతమున హరిహరుడు స్వయం ప్రధానమూర్తిగా అర్చావతారముగ యెక్కడను కానరాడు, కేవలము ఉపాసనా మూర్తిగా మాత్రమే కొలువబడుతున్నాడు. (వంద్యుడైనాడు.) నెల్లూరుపట్టణమున పెన్నానదీ తీరమున శ్రీరంగనాథుని ఆలయము - రోడ్డు వంతెనలమధ్య ఎక్కడనో హరిహరనాథ ఆలయమున్నట్లు, అచ్చోటనే కవి తిక్కన తన రచనను కొనసాగించి నటుల ప్రబల నమ్మకమున్నది. ఈ దేవాలయ అవశేషము లేవియు ఇప్పుడు కానరావు. బహుళ కట్టడముల క్రింద మృగ్యమైపోయి వుండవచ్చును. శాసనములందెచ్చటను ఇట్టి గుడిని గూర్చి ప్రస్తావనలులేవు. తిక్కన ఊహించిన ఈ మూర్తియే ఆంధ్ర మహా భారత కృతిభర్త : తిక్కన సోమయాజి ఆంధ్రావళి మోదమునకై వ్రాసిన పదిహేను పర్వములుగల భారతమునందు (1) ప్రస్తావనలో తన స్వప్నమందు తండ్రి హరిహర మూర్తిని గూర్చి వర్ణించి ఉన్నాడు. (2) పర్వాంతములయందు హరిహరులను స్తుతించుటలో రూపవర్ణనలను చేసి ఉన్నాడు.

## *విష్ణు కుండినులనాటి హరిహరతత్వము :*

నెల్లూరు మండలమున ఉదయగిరికి చేరువగా భైరవకొండయను చోట గుహాలయములు కొనసాగినవి. ఈ గుహలు 7-8 వ శతాబ్దిని తొలచబడినవి. ఇచ్చట గుహాంతర్గత ఆలయమున శివలింగ పీఠమున్నను, ముఖ ద్వారమున కిరువైపులను బ్రహ్మ - విష్ణుమూర్తులు శివ ద్వారపాలకుల చేరువనే శిల్పింపబడిరి. పరిశీలించిచూచిన లింగరూపియైన శివునికే ముఖ్య స్థానమివ్వబడినది కాని శాసనములందు బ్రహ్మేశ్వర విష్ణుగృహములని సంబోధించుటచే త్రిమూర్తులు సమానముగా పూజింపబడిరని యెరుగవలసియున్నది. ఇక్కడనొక చక్కని హరి హరమూర్తి యర్ధచిత్రము నాట్య

శివుని ప్రక్కగా నొక కోష్ఠమున చెక్కబడియున్నది. (చిత్రము-46) అష్ట భుజములు కలిగిన ఈ స్వామిపైన పేర్కొన్న శిల్పములన్నింటికన్న విలక్షణముగానున్నాడు. కుడియర్ధభాగమున శిరముపై జటాజూటమున నెలవంక, ఫాలమున తృతీయ నేత్రము, చెవిని సర్పకుండలము చేతుల పైనుంచి వరుసగా దండపరశు, త్రిశూల దండము. రుద్రాక్షమాల, అభయ హస్తములు నున్నవి. అజిన వస్త్రముమేఖలతో ముడిపెట్టిన కౌపీనమువలెనున్నది వామభాగమున రత్నఖచిత కిరీటము, మకర కుండలము, ఫాలమున పుండరీకము నుంజే కటిపై నున్నవి, పై చేత శంఖము, మూడవ చేతిలో చక్రము చివరగా క్రింది చేతిలో పొడుగాటి ఖడ్గము కలవు. పీతాంబరమును ధరించియున్నాడు. ఈ త్రిమూర్తి గృహములు క్రీ. శ. 12-13 వ శతాబ్దిలోకూడ ఖ్యాతి గాంచి యుండినటుల శాసనముల వలన విదితమగుచున్నది.

వ్యాస భారతమున హరి హర తత్వమును గూర్చి యెట్టి ప్రసక్తి కానరాదు, కాని కవి తిక్కన భారతమందు ప్రతియాశ్వాసమున మంగళాదిగా హరి హరనాథుని యిష్టదైవముగా ప్రార్థించియుండుట గమనార్హము. తిక్కన బహుశ భైరవకొండలోని హరిహరుని చూచియుండెను కాబోలు! ఈ కాలమున నీ దుర్గ - భైరవకోన ఉపాసకుల కాటపట్టయి యుండెను. మారుమూల కొండ లోయలో మధ్యయెత్తైన జలపాతముతో ప్రకృతి సౌందర్యముతో నలరారు ఈ ప్రదేశ మీనాటికిని తాపసుల నాకట్టుచున్నది, హరిహర రూపము తిక్కన సోమయాజి భావనా కల్పితమనెడి వాదము కలదు. కాని ప్రాచీనముగానున్న యీ తత్వమును, శిల్పరూపమున ఆగమములందు పూర్తిగా అవగాహన చేసికొన్న విజ్ఞాని తిక్కని. అందువలననే ఈ పరతత్వమును గొల్చి మహాభారతాంధ్రీకరణకు ద్యుక్తుడయ్యెను. ఈ మహనీయునికి కలలో హరి హరుడు "నన్ను నీ కృతికి పతిని గావింపుము" అని ప్రేరేపించెనట. ఆ మహాద్భాగ్యము ననుభవించిన తిక్కన "నీ కరుణనిట్లు పదస్థుడనైతి"నని హరిహరనాథుని పునర్జన్మ రాహిత్యము కోరెను, ఆంధ్ర కర్ణాటకమునందు ఈ కాలమున వీరశైవ, విశిష్టాద్వైతములు ప్రబలి శివకేశవుల యనుయాయులు పరస్పర వైషమ్యముల పెంచుకొనిరి వీరికి తోడు శాక్తేయులు పెక్కు వామాచార మార్గములబట్టిరి. కవి తిక్కన ద్వైతరూపమైన హరిహర తత్త్వమును లోకములో బహుళముగా ప్రకాశితము చేసి యీ శాఖల సమన్వయమున కెంతేనిపాటుపడిన మహామనిషి, జ్ఞాని, ఈతడు హరిహరనాథుని ప్రతి యాశ్వాసాంతమున స్తుతించెను. మొత్తమున 193 శ్లోకములు, కావ్యమున వలుచోట్ల హరి హరనాథుని కీర్తించుచున్నవి. కవి తిక్కనయందపారగౌరవముగల నాచన సోముడు (క్రీ॥ శ॥ 1354- 77) తన కావ్యమైన ఉత్తర హరివంశమును హరిహరుని కంకిత మొనగెను. ఇంకను శ్రీ వై. బి, రాజు నారాయణ కవితన పంచ తంత్రమును శ్రీ కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశతి కావ్యమును హరిహరనాథునికే అంకిత మొనర్చిరి. అప్పయ్య దీక్షితులవారి సమకాలికుడైన (16 వ శతాబ్ది) బోధేంద్ర సరస్వతి సంస్కృతమున హరిహరాద్వైత భూషణమును సిద్ధాంత గ్రంథములను రచించిరి ఇట్లే హరహర స్వరూపము రాజులను, మహాకవులను, కొన్నిశతాబ్దములుగా భక్తిపారవశ్యమున ముంచి వేసినది.

## ఉపయుక్త గ్రంథములు


1. డా॥ చిలంబూరు శివరామమూర్తి, "శత రుద్రీయ విభూతి ఆఫ్ శివాస్ ఐకొనాగ్రఫీ", 1976)
2. డా॥ దివాకర్ల వెంకటావధాని "ఆంధ్ర మహాభారతము - కవిత్రయము" (1975).
3. జితేంద్రనాధ బెనర్జీ, 'ది డెవలెప్‌మెంట్ ఆఫ్ హిందూఐకొనాగ్రఫీ' తృతీయ ముద్రణము, (న్యూఢిల్లీ 1974)
4. గోపీనాధరావు 'ఎలిమెంట్స్ ఆఫ్ హిందూ ఐకొనాగ్రఫీ' (1914) VOL II
5. ముల్కరాజ్ ఆనంద్, ఇన్‌స్పైర్స్ ఆఫ్ ఐహోళె బాదామి, మహాకూట అండ్ పట్టడకాల్. మార్గ్, XXXII, (1979)
6. శ్రీ ఓరుగంటి లక్ష్మీనారాయణ - గుంటూరు. తిక్కనామాత్యుని హరిహరతత్వము - ఆశ్వాసాన్త పద్యముల గూర్చి.

# ఆంధ్రమున కొన్ని అపురూప వైష్ణవ ప్రతిమలు

మహావిష్ణువు వేదకాలము నాటికి ముఖ్యదేవతగా కొలువబడుటలేదు. ఋగ్వేదమున భూనభోంతరాళములలో చరించెడు ఉపక్రమ, విక్రమ మున్నగు రూపముగ పేర్కొనబడెను. బ్రాహ్మణములలో విష్ణువు ఆదిత్యలేక అగ్ని స్వరూపముగ సూర్యభగవానుని అంశగా పేర్కొనిరి. మహాభారతాంర్గతమైన నారాయణీయమునుండి వాసుదేవునిపూజ పంచరాత్ర, భాగవత, సాత్వత క్రమములుగా తరువాతి కాలమునకు వేరు వేరు యాచారములు ప్రబలినటుల తెలియు చున్నది. వాసుదేవుడు అధిదేవతగా, వృష్ణివీరుడుగా యేకాంతమతాను యాయులు పూజించుచుండిరి. కృష్ణ - వాసుదేవ పూజ మధురలోను, మధ్యదేశమున మిక్కిలివాడుకలో నున్నటుల శాసనములేగాక దేవాలయములను బట్టి గ్రహింప వీలగుచున్నది వైష్ణవము రెండు మార్గముల అభివృద్ధి చెందినది. మొదటిది వ్యూహ, రెండవది విభవము, వ్యూహ మున పంచవీరులను అర్చించుట వీరు - వాసుదేవ, కృష్ణ, సంకర్షణ లేక బలరామ. ప్రద్యుమ్న, అనిరుద్ధ లేక సాంబ. విభవ రూపములు విష్ణు భగవానుని పది యవతారముల పూజించుట యాచారమైనది. ఈ దేవతా రూపములగూర్చి శతపథ బ్రాహ్మణమున (I, 8, 1-6), ప్రస్తావనయున్నది. ప్రజాపతి మత్స్య - కూర్మ వరాహావతారముల నెత్తినట్లు తెలియుచున్నది. ఈ యవతారరీతులను విష్ణుమూర్తికి సంక్రమింప జేశిరి. మొదటగా వ్యూహ అనగా పంచవీరుల గూర్చి నాణెఘాటు (మహారాష్ట్ర) లోని శాసనమునగలదు. ఈ శాసనము క్రీ. పూ. 2 వ శతాబ్ది సాతవాహన రాజ్ఞినాగ నిక యొసగెను. అదే కాలమునకు చెందిన, ఇండో-గ్రీకు చక్రవర్తుల నాణెములపై వాసుదేవ - కృష్ణ, సంకర్షణ - బల రామమూర్తులున్నవి. ఈ నాణములు 'ఐఖనుం' యనుచోట త్రవ్వకములలో లభించెను. ఈ ప్రాచీన స్థలము (1) రష్యా - ఆఫ్ఘనిస్థానము తీరముల ఆక్సస్ నదిగట్టున గలదు. ఉత్తర భారతమున మోరా యనుచోట (మధురకు చేరు వగా) బావిలో లభ్యమైన శాసనముద్వారా క్రీస్తుపూర్వము ఒకటవ శతాబ్ది పంచవీరుల ప్రతిష్ఠించిన రాతి దేవాలయ మున్నటుల తెలియుచున్నది. ఈ ఆలయమునకు గ్రీకువనిత తోషా భాగవతపూజ కైంకర్యములకు దానముల నొసగెను.

మధురలో లభ్యమైన మరియొక శాసనము రాజు శోడశ క్రీ. పూ. 1 వ శతాబ్దిని మహాస్థానమున వాసుదేవ మూర్తిని ప్రతిష్ఠించి చుట్టును వేదికను తోరణాలంకృత ప్రాంగణమును గావించెను. చిత్తోర్‌గఢ్‌లోని ఘోసుండి యనుచోట లభ్యమైన శిలా శాసనమునందుగూడ సంకర్షణ - వాసుదేవులకుగా నిర్మింపబడిన ఆలయములు, పూజాశిలా ప్రాకారములగూర్చి చర్చింపబడియున్నది. ఇది నారాయణ వాటికగాగూడ ఖ్యాతిబడశెను. చిత్తూరుజిల్లా గుడిమల్లము లోని నైష్ఠిక స్థానమును బోలి నారాయణునికి ఇచ్చట శిలా వేదికతో ప్రాకారవాటిక గావింపబడెనన్న మాట. ఉదయ పూరుజిల్లా నగరి యనుచోటను సంకర్షణ - వాసుదేవులకు పూజా శిలా ప్రాకారమున్నటుల శాసనమున్నది. ఇక విదిశ (మధ్య ప్రదేశ్), చేరువగానున్న బీస నగరములోని గరుడ ధ్వజ శాసనమును వేరుగా చెప్పనవసరములేదు. ఈ ధ్వజ మును ఆలయ ప్రాంగణమున ముఖస్తముగా సుప్రతిష్ఠించిన భాగవతోత్తముడు హెలియడోరసురాజు, దియాసుని కుమారుడు, క్రీస్తు పూర్వము రెండవ శతాబ్ది పాలించెను. ఇచ్చట గావింబడిన త్రవ్వకముల నీ వాసుదేవుని ఆలయము పెక్కు గరుడ ధ్వజములతో విలసిల్లి నటుల విదితమైనది.

ఇక ఆంధ్రదేశమున వైష్ణవ సాంప్రదాయము యెప్పుడు వచ్చెను? రూపలక్షణములెట్టివి? యను ప్రశ్నలకు సమాధానముగా, నిటీవల పరిశోధకుల కృషి పేర్కొనవలశియున్నది. వైష్ణవ మతమునకు సంబంధించిన కొన్ని యపు రూప శిల్పకళా అవశేషములు అప్పుడప్పుడు బయలుపడినను, బౌద్ధ శైవ ఆలయములున్నంత మెండుగా, ప్రాచీనమైన వైష్ణవ స్థలములు కానరాలేదని చెప్పవచ్చును ఆంధ్ర తీరమున బౌద్ధము బాగా నాటుకొని క్రీ. పూ. 3 వ శతాబ్దినుండి

క్రీస్తుశకము 4 వ శతాబ్దివరకును యెక్కడో అరుదుగాతప్ప, శైవ-వైష్ణవ, ఆలయములు-పూజ అంతగా కానరాలేదు, తెలంగాణమున అట్లుగాదు, వృష్ణివీరుల పూజ క్రీ. పూ. రెండవ శతాబ్ది సాతవాహన శాసనముల (నానెఘాటు) ద్వారా ప్రబలియున్నదని పైన పేర్కొంటిని. ఈ కాలమునుండియే, అక్కడక్కడ వైష్ణవ పూజా చారములు తెలంగాణమున చోటు చేసుకొని ప్రబలి తీరాంధ్రమునకు ఇక్ష్వాకు-విష్ణుకుండినుల కాలమునాటికి వ్యాప్తమయినటుల కొన్ని నిదర్శనములు లభించినవి.

## "కొండమోటు" ఫలకము : 3

గుంటూరుజిల్లా పిడుగురాళ్ళ గ్రామమునకు చేరువగా కొండమోటు యను ప్రదేశమున లభ్యమైన ఈ దాచేపల్లి రాయి ఫలకము నాగార్జున కొండలోని శిల్పఖండికలను బోలియున్నది, ఈ తెల్ల సున్నపురాయి (దాచేపల్లి) శిల్పము 1.5 × ·61 మీటర్ల పరిమాణముగల్గి ముఖ్యముగ ఆరు దేవతాస్వరూపముల అర్ధశిల్పశైలిలో చూపుచున్నది.

మధ్యగానున్న ముఖ్యదేవత రెండు చేతులున్న నరసింహుడు, చేతులు స్పష్టముగ మానవహస్తములే; సింహవక్త్రము, కుదించుకొన్న లావైన పిరుదలు కాళ్ళు. కూర్చొనియున్న మృగరాజును బోలియున్నవి. దేహమంతా పశురూపమే. శ్రీవత్స చిహ్నము వక్షస్థలముపై నున్నది. రెండు చేతుల గద, డిండిమములున్నవి. తక్కిన అయిదుగురు వీరులు కుడినుంచి యెడమ వరుసగా నీ ప్రకారము నిల్చుకొనియున్నారు.

మొదటి దేవత, అభంగములో కుడిచేతిని ఇక్షుచాపము, యెడమ మకర ధ్వజము కలియున్న ప్రద్యుమ్నుడు, రెండవ దేవత సమపాద స్థానకుడై కుడిచేయి అభయముద్ర, ఎడమచేతిన శంఖమును కటిపై నిడుకొనియున్నాడు, శిరస్సుపై కిరీటము ఇంద్రునిబోలిన కిరీటము, విష్ణువుగా నెరుగవలయును. మధ్య ముఖ్యదేవత నరసింహుడు. వామ భాగమున నాల్గవ స్వరూపము అతి భంగమున నిల్చున్నది వాసుదేవ - కృష్ణుడు చేతుల విల్లు, వేణువు కల్గియున్నాడు. అయిదవ స్వరూపము బలరాముడు - కుడిచేతిలో సురాపాత్ర, వామ హస్తము కటిపై నుంచుకొని యున్నాడు. చివర నున్న దేవత ఖడ్గము, ఖేటకము గల్గియున్న అనిరుద్ధుడు. ఈ ఫలకము క్రీస్తుబ్దము 4 — 5 వ శతాబ్దికి చెందిన దనుటలో యెట్టి సంశయములేదు.

## 2. ఏలేశ్వరపు విష్ణుమూర్తి : 4

నాగార్జున కొండ కెదురుగా కృష్ణానది పశ్చిమతీరమున యేలేశ్వరపు కొండ ఉంది నాగార్జునసాగరమువల్ల ఈ లోయలన్నియు నేడు నీటిలో కలిసిపోయినవి. ఈ చరిత్ర ప్రసిద్ధిగాంచిన రెండు పర్వతములు చాలయెత్తైనవగుటచే ఈనాటికిని కానవచ్చునున్నవి.

యేలేశ్వరము గ్రామము కొండచుట్టును క్రింద యుండెడిది. ఇది ఇక్ష్వాకుల తదనంతరము ప్రసిద్ధికివచ్చి తరువాత చాళుక్యులు, తెలుగు చోడులు, కాకతీయ సామ్రాజ్యముల క్రింద ప్రసిద్ధమైయుండిన చారిత్రక ప్రాంతము, ఈ చోట 1960 లో జరిగిన పురావస్తు పరిశోధనల ఫలితముగా నొక దాచేపల్లి రాయి కృతమైన విష్ణుమూర్తి శిల్పములభించినది, దాన్ని ఇందు వివరించుచున్నాను.

ఈ ప్రతిమలో తల, చేతులు, కాళ్లు ఛిద్రములైనవి. అయినను కుడి చేతిని దండము వామహస్తమున శంఖము ఉండుటవలన నీమూర్తి విష్ణువుగా గ్రహింప గల్గుచున్నాము. ఇక్ష్వాకు శిల్పములైన కార్తికేయ విగ్రహములలో నున్న రీతిని పింజపోశి కట్టిన ధోవతి-చెవులకున్న ఆ కర్ణాంత కుండలములు-భుజస్కంధముపై వాలి పడియున్నవి, ఇట్టి కుండలములు మకర, వ్యాఘ్రి, చక్ర పతకముల బోలినవి పలు విధముల నాగార్జునకొండ - అమరావతి శిల్పముల చూడనగును. (5) ఈ స్వామికి యజ్ఞోపవీతములేదు. సాలార్ జంగ్ మ్యూజియము డైరక్టరుగానున్న శ్రీ యం. యల్. నిగమ్‌గారు,(6) ఈ యేలేశ్వరపు మూర్తిని వైకుంఠ నారాయణునిగా గ్రహించిరి. ఈ ప్రతిమకు మూడు శిరములున్నట్లు వూహించిరి. మధ్యన విష్ణుస్వరూపము - కుడి ప్రక్కగా సింహవదనము, యెడమ - వరాహ వదనముగా భావించిరి. వీరిట్లు పొరబడి కుండలములను శిరములుగా భావించి నీ యేలేశ్వరపు మూర్తిని మూవద్భారతావనిలో మొదటి శిల్పముగాను, అత్యంత ప్రాచీనమైనదిగా పలుతావుల పేర్కొని యుండినారు. ఈ శిల్పమున వైకుంఠ నారాయణ ప్రతిమా లక్షణ - లాంఛనములను కానరాము. భుజస్కంధములపై వాలియున్న కుండలములను శిరములుగా నెరుంగుట పొరబాటు. ఇటీవల నేను, మాసహచరులు శ్రీ శ్రీనివాసరావు, ఖురేషి, నాగపూరులోని ఉత్ఖననశాఖ, తరపున రంగారెడ్డి జిల్లాలో కొన్ని చారిత్రక స్థలములను దర్శించితిమి. యేలాల - గోవిందరావుపేట గ్రామముల కొన్ని చక్కని వైష్ణవ ప్రతిమలు అదృష్టవశాత్తు మా దృష్టికి వచ్చినవి. ఈ వ్యాసమున సచిత్రముగా వీనిని గూర్చి పేర్కొందును

## గోవిందరావుపేట - వరాహస్వామి : (చిత్రము - 1)

గోవిందరావుపేట - యేలాల గ్రామములు తాండూరు రైల్వే స్టేషను నుండి 21 కిలో మీటర్ల ఆగ్నేయముగా కాగ్రనేణి యను చిన్ననది ఒడ్డున వున్నవి. ఊరికి ఉత్తరముగ శిథిలమైన రాతి గోడల మధ్యగా నొక దేవాలయమున్నది. చతురస్రాకారమున్న గర్భాలయము, ముందున అంతరాలము కానవచ్చుచున్నవి. పై కప్పు, గోడలు శిథిలమగుటచే వూరి ప్రజలు చుట్టునున్న రాళ్ళను అమర్చి కొంత మరుగు ప్రదేశముగా చేసిరి. ప్రాంగణమున సోపానము చంద్రశిల మట్టిలోనున్నట్లు తెలియుచున్నది. ఈ దేవాలయమును వరాహస్వామి ఆలయమని యిప్పటికిని ప్రజలు ఆరాధించుచున్నారు. గర్భాలయమున సుప్రతిష్ఠితమై, మన అదృష్టవశాత్తు చెక్కుచెదరకయున్న మూర్తి శిల్పము భూవరాహస్వామి, ఆంధ్రదేశమునే కాక, యింతటి ప్రాచీన విలక్షణ దేవతా శిల్పము మరెక్కడను కానరాము. ఈ శిల్ప రాజము దాచేపల్లి సున్నపు రాయి కృతము, అమరావతి - నాగార్జునకొండల శిల్పములన్నియు యిట్టి రాతితో మలచినవే. ఇటువంటి రాయి తాండూరు ప్రాంతములందుకూడ లభించుచున్నది. ఈ శిల్పమున స్వామి ముఖము వరాహాకృతి- "వరాహవనః:" తక్కిన శరీర మంతయు మానవ రూపము, కుడి కాలు శేషనాగుని యొక్క శరీరముపై ఉన్నది. నాల్గు చేతులున్నవి. కుడి తట్టున్న పై భుజముపై భూదేవిని కూచుండబెట్టి, క్రిందుగా రెండవ చేతిని ఆమెను పై కెత్తిపట్టుకొని యున్నాడు. ఈ చేయి వంగిన కాలిపై నాధారముగానున్నది. వామభాగపు పై చేతిని శంఖమున్నది. క్రింద హస్తము కటిపైని, వస్త్రపుమడతలపై నుంచి యున్నాడు. ధోవతి వస్త్రమేఖలముతో బంధింపబడియున్నది. ఉదరబంధము, ముక్తా యజ్ఞోపవీతములే గాక కంఠమున పట్టెడలు మూడు కానవచ్చుచున్నవి. అమ్మవారు చక్కని సౌందర్యవతి. ఇక్ష్వాకు శిల్పములలో సాధారణముగా నవచ్చు స్త్రీ రూపము కలిగి, అంగసౌష్ఠవము కంఠమున హారములు, ఆ కర్ణాంత కుండలములు, బాహువలయములు, మధ్యగా పాపట తీసిన చక్కని ధమ్మిల్ల శిరోజాలంకారము యీ విలక్షణమైన భూదేవి, ముఖము, చేతులు, క్రిందభాగములు కొంత విరిగియున్నను. క్రీస్తబ్దము నాల్గవ లేక అయిదవ శతాబ్దినాటి శిల్ప కృతముగా స్పష్టము చేయుచున్నది క్రిందనున్న శేషనాగుడు పైనున్న భగవంతుని సూచించుచున్నాడు.

భూ వరాహస్వామిని స్వయం ప్రధాన దేవతగా సుప్రతిష్ఠితమైన ఆలయము - ఇంత ప్రాచీనమైనది నాకు తెలిసి యెక్కడను కానరాలేదు. శతపథ బ్రాహ్మణమున పేర్కొన్నటుల మత్స్య, కూర్మ, వరాహాది భాగవతార్చ మూర్తులు ఆలయముల ప్రతిష్ఠింపబడు ఆచారము క్రీస్తబ్దము నాల్గవ శతాబ్ది నాటికే తెలంగాణమున ప్రసిద్ధికి వచ్చినదనుటకే వరాహస్వామి ఆలయము దృష్టాంతరముగా నిల్చియున్నది. సాతవాహన రాజులు అప్పటికి అనగా క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దిని మొదలు ఈ ప్రాంతముల తమ పాలనములో ఉంచుకొనిరి. వీరి వృష్ణివీరుల పూజించిన నారాయణ భక్తులు తరువాతి సాతవాహనుల ఇక్ష్వాకు ప్రభువుల కాలమునకు కోస్తా ఆంధ్రమున వైష్ణవము విస్తరింపబడినది.

మహారాష్ట్రములోని విదర్భ ప్రాంతమున రామ్‌టెక్, ఆ మధ్య ప్రదేశములోని ఏరన్, ఉదయగిరి (గుహ) మున్నగుచోట్ల వరాహావతారమును విపులీకరించు పెద్ద శిల్పములున్నవి. ఇవన్నియు గుప్తరాజుల, విష్ణుకుండి-వాకాటక ప్రభువుల కాలము నాటివి. గోడలపై మలచిన శిల్పరూపమున వరాహస్వామి, పౌరాణిక గాథలమధ్యగా ఉదయగిరి గుహలలో కానవచ్చును. ఇటువంటి కోవకు చెందిన శిల్పములలో సముద్ర మథనము, విష్ణుమాయ ఘట్టములను అర్ధ శిల్పమున చెక్కిరి. కాని గోవిందరావుపేట భూ వరాహస్వామి మూల విరాట్టుగా ప్రతిష్ఠింపబడిన అధిదేవత.

## నరసింహమూర్తి (చిత్రము - 2)

ఈ ఆలయ ప్రాంగణమునకే చెందిన మరొక చక్కని నరసింహమూర్తి శిల్పము విలక్షణమైనది. నాభిక్రింద భాగము, ముంజేతులు విరిగిపోయినను ఈ శిల్పము 15 సె. మీ. నిడివి. 11 సెంటి మీటర్లు వెడల్పు. 7½ సె. మీ. మందము గలిగిన దాచేపల్లి రాతి కృతము. సింహముఖము, హ్రస్వదంష్ట్రములతోనున్న యీ నరసింహుడు, కంఠమాల, లలాటముపైని అష్టదళ పద్మము, చక్కని వంకులజుట్టు పైనశిఖ (శిఖందినః) ఇక్ష్వాకుల కృతములైన బుద్ధ మూర్తులలోవలె కానవచ్చుచున్నాడు, శిరాగ్రమునుండి కంఠము చుట్టుతూ హారముగా నీ శిరోజము తీరు చాల శోభనిచ్చుచున్నది. ఉదరబంధము, ముక్తా యజ్ఞోపవీతములు చక్కగానున్నవి. ఈ స్వామిని ఉత్సవమూర్తిగనో లేక ఇష్టదేవతగా కోష్ఠమునందునో బహుశ ప్రతిష్ఠితమై ఉండెనేమో! ఈయన యోగ నరసింహుడుకాదు. ఈ స్వామి కేవల నరసింహ స్వరూపముగా నెరుగవలయును.

పైనవిశేషించిన మూర్తులేగాక కొన్ని ఫలకములు యిటీవల లభించినవి. ఈ చిన్న ఫలకములందు తక్కిన బ్రాహ్మణమత దేవతలతోబాటు నరసింహరూపమున విష్ణువును - చూపబడియుండుట గమనించవలసియున్నది. గుంటూరు జిల్లా, నరసారావుపేటలోని కునిదెన, కృష్ణాజిల్లా, నందిగామ తాలుకా ముక్త్యాల కడపజిల్లా సిద్ధవటము తాలూకాలోని పెద్ద ముడియము లందుఇట్టి ఫలకములు విరివిగా లభించినవి ఇందున పద్మముపై త్రిముఖబ్రహ్మ నందివాహనముపై లింగము, లేక శివ పార్వతులు, పద్మముఖియైన లక్ష్మి, లేక పార్వతి, సింహవదనమున్న నర్మ. సింహ వరుసగా చూపబడెను. అనగా ఇవి త్రిదేవ ఫలకములు క్రీస్తబ్దము 4 - 5 వ శతాబ్దినాటివి.

కీసరగుట్ట (రంగారెడ్డి జిల్లా), 9 విష్ణుకుండినుల యిటుక దేవాలయ పునాదుల వాస్తు కర్మ విధానము తెలియు అపూర్వ విశేషములు ఖనన పరిశోధనలందు వెలికివచ్చెను. ఒక దేవాలయ పునాదిన యెఱ్ఱ రాతిఫలకము లభించినది. ఈ ఫలకము 9 సెం మీ. గల్గిన చతురస్రాకారము గల్గియున్నది, (చిత్రము - 3) ఇందున ముఖ్య దేవతగామధ్యన శక్తి సిరిదేవత 'మస్తకీపద్మం' లేక పద్మముఖి. మోకాళ్ళపైకూర్చొనియున్నది. తెరుచుకొని కాళ్ళనొకప్రక్కగా పెట్టి రెండుచేతుల చిత్రమైన భగవత్ సంకేతముల మోయుచున్నది. కీసరగుట్ట ఫలకమున అమ్మవారికి వస్త్రాదిఅలం

కారమున్నది. ఈమె ఆదిశక్తి — మా దేవత, కుడిచేతిని లింగమును - వామహస్తమున సింహముఖమును యెత్తుకొనియుండుట విశేషము. లింగమును చూచున్నట్లుగా అంచున నంది - అదేవిధముగ సింహమును నమస్కరించు నరుడు ఈ దేవతలను నరసింహ. శివ మూర్తులుగా విదితము చేయుచున్నవి. మధ్యనున్న స్త్రీ శక్తి యిరువురికికూడ సంబంధించినది, ఈమెయే భూదేవతగూడ

ఇటువంటి ప్రదేశ ఫలకము అదేకాలమునకు చెందినది కర్ణాటకములోని ముదెబి (10) (బిజాపుర తాలూకా) యినుచోట లభించెను. (చిత్రము - 4) ఇందున మధ్యనున్న పద్మముఖియైన స్త్రీ ప్రధానముగానున్నది. తృతీయ దేవత, ఈ రూపమును లజ్జా గౌరిదేవతగా కొందరుగ్రహించిరి కాని అది సమంజసము కాదు ఈ శక్తి స్వరూపిణి - శ్రీ మరియుశక్తి. పైన లింగమును - సింహమును యెత్తుకొనియున్నది, శివ - శక్తి - విష్ణుపూజ క్రీస్తుశకము 4 - 5 వ శతాబ్దిల తెలంగాణా - దానికి చేరువైన మధ్య కర్ణాటక ప్రాంతముల ప్రబలియుండెనని పై శిల్ప్యమైన ఫలకములు చూపుచున్నవి. ఇక యేలాల గోవిందరావుపేట గ్రామముల లభించిన మూడు చాహ విష్ణుదేవాలయము-నరసింహ శిల్పము మిక్కిలి అరుదైన, ప్రాచీన మూర్తి సంపదగా నెరగవలయును.

## అధోజ్ఞాపికలు


1. ఎ. కె నారాయణ, జర్నల్ ఆఫ్ ది న్యూమిస్మాటిక్ సొసైటీ ఆఫ్ యిండియా, XXXVI (వారణాసి, 1974) పుటలు 190 - 191.
2. పురాతత్వ. సంపుటి '8' (న్యూఢిల్లీ, 1978) పుట. 178 లలితకళా, సంపుటి, 14, పుటలు, 47-49: యం. డి. ఖరే, లలితకళా. సంపుటి 13 - 14 (న్యూఢిల్లీ, 1967 - 69) పుటలు 21 - 27.
3. అబ్దుల్ వహీద ఖాన్, అన్ యెర్లీ స్కల్ప్చర్ ఆఫ్ నరసింహ, (హైదరాబాదు, 1964) పుటలు 1-5 మరియు ఖండల్‌వాల్, లలితకళా, (ఢిల్లీ, 19) సంపుటి - 21, పుట 24.
4. అబ్దుల్ వహీద్ ఖాన్, యే మోనోగ్రాఫ్ ఆన్ యేలేశ్వరమ్ ఏక్సవేషన్స్, (హైదరాబాదు, 1963), పుటలు 14, ఛాయచిత్రములు - XXVII, XXVIII.
5. డాక్టరు ఇ. గుప్త కార్తికేయశర్మ : ది డెవలెప్‌మెంటు ఆఫ్ యెర్లీ శైవ ఆర్ట్ అండ్ ఆర్కిటెక్చరు, (న్యూఢిల్లీ, 1982), పుటలు 106-108 114, 118, 143 - ఛాయా చిత్రములు - 68, 71 - 72 మరియు 84
6. డైమన్షన్స్ ఇన్ ఇండియన్ ఆర్టు, పూజా, (న్యూఢిల్లీ, 1986), పుటలు 334 మరియు శ్రీనిధి, (మద్రాసు, 1983) పుటలు - 128, 130.
7. ఉదయం, ఏప్రిల్ 14, 1987, (హైదరాబాదు) చూడుడు నాలుగో శతాబ్దినాటి విష్ణువిగ్రహాలు, పేజి-7
8. కుసుమాంజలి, శ్రీ శివరామమూర్తి జ్ఞాపకార్థము వ్యాసావళి, (న్యూఢిల్లీ, 1987), పుటలు 217-223.
9. కుసుమాంజలి, పుటలు 233-237 ఛాయా చిత్రము - 10, చూడుడు నా వ్యాసము, భారతి, సంపుటి, 62, నంబరు-5, (మే 1985), పుటలు, 40-46.
10 మైఖేల్ మీస్టరు (సం). డిస్కోర్స్ స్ ఆన్ శివ, (బొంబాయి, 1984) పుటలు, 283.284, ఛాయా చిత్రము - 241.

# కార్తికేయుడు

శివుని కుమారుడైన కార్తికేయుని కొలచు యాచారము చాలపురాతనముగా భారతావనిలో కానవచ్చుచున్నది. దక్షిణ దేశమున, ముఖ్యముగా నాంధ్రమున కార్తికేయుని చాల రాజవంశములు, ప్రభువులు తమ కులదేవునిగా నారాధించి పెక్కు దేవాలయముల నిర్మించిరి. స్కందుని పూజ వాల్మీకి రామాయణమున పేర్కొన బడినది. రాణి కౌసల్య కార్తికేయుని భక్తురాలు. 'స్కందః కుమారరూపః. శక్తిధరో బార్హి కేతుశ్చ" అని బృహత్ సంహిత పేర్కొనుచున్నది. (57, V - 41). విష్ణుధర్మోత్తరము కార్తికేయునికి కుడిచేతులందు కుక్కుటము, ఘంటము, వామ హస్తముల పై జయంతీ పతాకము మరియు శక్తి ధ్వజముకల్గియున్నటుల తెలుపుచున్నది. మహాభారతమున మహాసేనునకు కుక్కుటము లాంఛనముగా చెప్పబడినది. 'త్వంక్రీడసే షణ్ముఖ కుక్కుటేనయధీష్ట. నానా విధకామరూపి' ఈ స్వామి చాలరకములైన కిరీటముల ధరించెనట - మకుటాది విభూషితమ్. అమర కోశమున కార్తికేయుని పూర్తి రూపలక్షణముల వివరణయున్నది.

"కార్తికేయో మహాసేనః । శరజన్మాషడాననః ।
పార్వతీనందనః స్కందః సేనానీ అగ్ని భూర్గుహః ॥
బాహులేయస్తారకజిత్ । విశాఖః శిఖివాహనః ॥
షాణ్మాతురః శక్తిధరః । కుమారః క్రౌన్చదారయః ॥"

కార్తికేయుని పూజ పంజాబ్, రోతక్, మధుర అయోధ్య, ఉజ్జయిని మున్నగు ప్రాంతములనుండి దక్షిణ దేశమునకు సంక్రమించినది. క్రీస్తుపూ మొదటి శతాబ్దినుండి విరివిగా కార్తికేయారాధన ఉత్తర హిందూదేశమున నుండెను. మౌర్యకాలమున స్కంద - విశాఖ ప్రతిమలను కొనుగోలు చేయుట యాచారముగా మహాభాష్యము (V, 3, 99) పేర్కొనుచున్నది. హువిష్కుని నాణెములపైన స్కంద - కుమార మరియు విశాఖ మహాసేన రూపములున్నవి. యౌధేయ సామ్రాజ్యాధిపులు తమ రాజ్యశ్రీని కార్తికేయునిదిగా పేర్కొనిరి. "యౌధేయ భగవత స్వామినో బ్రహ్మణ్య. దేవస్య లేక కుమారస్య" యని నాణెములపై శాసనములు తెలుపుచున్నవి.

ఆంధ్రమున నాగార్జునకొండ త్రవ్వకములలో అతి విశాలమైన దైవగృహములో కార్తికేయ విగ్రహములు దొరికినవి. కారణముదక్షిణ దేశపు ఇక్ష్వాకు రాజులు, వైదిక బ్రాహ్మణ మతాచారముల పునరుద్ధరించుటయే. తాము స్వయముగా మహాసేనుని భక్తులు. "విరూపాక్షపతి మహాసేనా పరిగ్రహీతస్య" యని శాసనముల చెప్పుకొనిరి. మొదటి రాజు సిరిచాంతమూలుడు తన కుమారునికి "వీర పురుషదత్తయని" నామకరణముగూడ చేసెను. వీర, పురుష కుమారయనునవి కార్తికేయునిపేర్లు. అంతయేల, క్రీస్తుపూర్వము నాటి శాతవాహనుల నాణెఘాట్ శాసనముల 'నమః కుమార వీరస' యని కార్తికేయుని యారాధన గలదు. ఈ శాత వాహన - క్షత్రప - యౌధేయుల యాచారము ఆంధ్రమున ఇక్ష్వాకుల నాకర్షించి పరమ భక్తులనుగాచేసినది వీరు తమ ప్రతి శాసనమున మహాసేనుని ప్రార్థించిగాని దానముల నొసగలేదు వారి పట్టణమైన శ్రీ పర్వత విజయపురియందు ముఖ్యముగా రాజప్రాసాదములకు చేరువ కృష్ణానది కుడి ఒడ్డున చాల దేవాలయములు వెలికి తీసిరి. ఈ ఆలయముల శాసనములే గాక, మూల విరాట్టులుగా ఆరు కార్తికేయ మూర్తులు లభ్యమయినవి. ఇవన్నియు నేడు నాగార్జున కొండపైని ప్రదర్శనశాలలో

భద్రము గావింపబడినవి. (నం. 103, 104, 108, 110, 111 మరియు 136). కొన్ని ముక్కలైన దేవతా స్వరూపములు దొరికినను అవి కేవలము కార్తికేయ స్వామివేనని నిర్ధారింపజాలము. ఈ మూర్తులన్నియు చాల పెద్దవి. (పురుషాకారము) అన్నింటను రెండు చేతులే. కుడి హస్తమున దండమున్నది. ఈ దండమునకు శక్తి లేక త్రిశూలమో యుండ నగును. యెడమ చేయి కుక్కుటమును పట్టుకొని కటిపై నుంచబడియున్నది. యజ్ఞోపవీతములేదు. కుమారుడన్న మాట. (చిత్రము - 49, A & B)

సమ భంగిములో నిల్చున్న ఈ మూర్తి శిల్పము యెత్తు 54 సెం. మీ., వెడల్పు 16 సెం. మీ. పింజపోసిన ధోవతి, వస్త్ర మేఖలముతో బంధించగా పిరుదులపై పంచకచ్చగోచి ముడుపు కానవచ్చుచున్నది. ఛాతిపైన అంగవస్త్ర మున్నట్లున్నది. తలపాగ (ఉష్ణీషము) కూడ చక్కగా చుట్టబడియున్నది. అగ్రపట్టము గలదు. చెవులకుండలములు చక్కని రత్న వైఢూర్యములు పొదిగిన పతకహారములు, ముఖము విరిగియున్నను ఈ మూర్తి శిల్పము చాల యరుదైనదిగా నెరుగవలయును.

ఈ దైవము విజయపురి కోట నైఋతిమూల ఆలయమున ప్రతిష్ఠింపబడినది. దేవసేనాపతి యన్నమాట (చిత్రము - 50) నగరమునకు రక్షకుడన్నమాట. మరొక కార్తికేయ ప్రతిమ ముఖము మాత్రమే లభ్యము. చక్కటి ఉష్ణీషము, ఫాలమున మకుటమణి, పైన శిఖలోనున్న తల, పెద్దకళ్ళు. ఆకర్ణాంత కుండలము చెవులకు గలవు. భావ గర్భితమైన మహాసేనాని చూపుచున్నది. (చిత్రము - 52). మయూరపృష్ఠముపై కూడ కూర్చొన్నటుల మరి యొక మూర్తి శిల్పము (సైట్ 64 - నం. 103) లభ్యమయినది. ముఖము ఛిద్రమైనది. నెమలి కాళ్ళకు సర్పము చుట్టుకొని యున్నది. ఈ రూపము తరువాత గుప్త కాలమున మనకు లభ్యమయిన కార్తికేయుని విగ్రహములు శిక్కాలపై నట్టిఆకృతి గల్గిన కుమారస్వామిని చిత్రించిరి. కార్తికేయ ప్రాసాదమున విగ్రహములు, శాసనములు, పూజాపాత్రలతోసహా లభ్యమయినవి. ఈ కార్తికేయ ప్రాసాదము సర్వదేవాధి వాసముగా శాసనములందు పేర్కొనిరి. అనగా నీ ఆలయ సముదాయము సమస్త దేవతల కాలవాలముగా నుండినది. మూదంతస్తుల శ్రీ విశాలము - కార్తికేయస్వామిని ప్రతిష్ఠించినది ఏహావులచాంతమూలుని మహాసేనాధిపతిగాండి పుత్రుడు. యేలిక శ్రీ అయిన (అనగా మహారాజు) ఏహావుల చాంతమూలుడు యీ ఆలయ ప్రాంగణమును పెద్దది చేసి శ్రీ విశాలముగా మార్చి సర్వదేవతలకు అధివాసముగా తీర్చి దిద్దెను. ఇచ్చట నుండి దేవతలను ఉత్సవముగా, క్రీడలు, పారువేటగా తీసుకొని పోవుటకు కనువైన గట్టుతోసహ నిర్మింపబడెను. కార్తికేయస్వామి ఉత్సవములు చాలగొప్పగా జరిగినవనుటకు శ్రీ పర్వత విజయపురియందు లభ్యమయిన తెప్ప కులము (సైట్ - 122) తటాకములు (సైట్ - 64) నిదర్శనములు పైగా పంచలోహ వుత్సవమూర్తి ఒకటి లభించెను. మరెక్కడను యింత విశదముగా కార్తికేయ దేవాలయములు కాని, విగ్రహములుకాని, పూజాకైంకర్య విధులగూర్చిగాని తెలియదు. కాంచన సిన్హా తమ గ్రంథమున పాకిస్థాన్ లోని అబ్బోటా బాదు (హజారాజిల్లా) శాసనమున కుమారస్థాన ప్రతిష్ఠనుగూర్చి వివరించియున్నది. కాని యీ అబొట్టాబాద్‌లోని కార్తికేయస్థానము, నాగార్జునకొండకన్న అర్ధ శతాబ్ది తరువాత వచ్చినది. కుషానులు మొదటగానే స్కందలేక కార్తికేయస్వామిని కొలచిరి. హార్టల్‌గారి త్రవ్వకములలో కార్తికేయుని కాంస్య విగ్రహము క్రీస్తబ్దము 1-వ శతాబ్ది నాటిది, మధురలో లభ్యమయినది. స్కంద కార్తికేయుని రూపము 'మిత్ర' రాజుల నాణెములపై కూడ ముద్రింపబడినది. ఇవి క్రీస్తబ్దము రెండవ శతాబ్ది నాటివి.

నాగార్జునకొండలోని శ్రీపర్వత విజయపురి దేవాలయమున లభ్యమయిన (సైట్ – 57) పంచలోహ ఉత్సవ మూర్తి (చిత్రము 51) శిల్పమును విపులీకరింతును. ఈ విగ్రహము 8.6 సెం మీ. యెత్తు × 4.61 వెడల్పు, 1.6 సెం. మీ మందము గల్గిన పూర్తి శిల్పము. ఈ దేవత బాలునివలె నిలుచుకొని యున్నాడు, (చిత్రము — 51) కుడిచేతి నొక అంబు నిడుకొని నడుముపై నుంచినాడు. యెడమ చేతిని తనంత యెత్తుగల పెద్ద విల్లును గల్గి యున్నాడు, తలపై ఉష్ణీషము, ఫాలముచుట్టును రత్న ఖచితముఖపట్టిక యున్నది. చెవుల కుండలములు, పంజ పోసి కట్టిన ధోవతి, ముంజేతుల వలయ కంకణములు, ఇక్ష్వాకు శిల్పములందు కానవచ్చు విలక్షణమైన అలంకారము లుగా కనిపించుచున్నవి. ఇదివరలో శ్రీ శివరామమూర్తిగారు ఈ ఉత్సవమూర్తిని ధనుర్ధరరామునిగా తీసుకొనిరి. యేలనన రాముని ధనుస్సువలె చక్కని స్వామిగా కనుపించుచున్నందున. కాని ఈ ఉత్సవమూర్తి కార్తికేయుని దేవాలయమున లభించినది. కుమారుడు కాన యజ్ఞోపవీతములేదు. కాని కార్తికేయుడు ధనుస్సు, విల్లుపట్టుకొని యుండుట చాల అరుదు, ఈ కుమారస్వామి, పరుశురాముడు శివునివద్ద విలువిద్య నేర్చుకొని క్రౌంచ పర్వతమును ఛేదించినట్టు గాథ కలదు. అట్టి ఆయుధములు లాంఛనములు శ్రీరామునికున్నవి. నిశితముగా పరిశీలింపగా శిల్పశాస్త్ర గ్రంధములైన శ్రీతత్వ నిధి మరియు సమరాంగణ సూత్రధారవంటి గ్రంధముల కార్తికేయునకు కుడి, యెడమ చేతుల విల్లు, అంబులుండినటుల తెలియవచ్చుచున్నది. మహాభారతమున కుమారుని పలుహస్తములలోనుండిన ఆయుధసామగ్రిలో విల్లుకూడకలదు, కాని కుషాణ-క్షత్రప ప్రతిమలలో నెక్కడను నిట్టి ఆయుధములను కాన లేము. కాన నాగర్జునకొండలోని ఉత్సవమూర్తి మహాసేనుడుగా నెరుంగుటయే మిక్కిలి సమంజసముగా తోచు చున్నది. నాగార్జున కొండలోని శ్రీ పర్వత విజయపురి ముఖ్య పట్టణముగా చేసుకొని క్రీస్తుశకము 3-4 శతాబ్దులలో పాలించిన ఇక్ష్వాకులు కార్తికేయస్వామి పూజను క్రమబద్ధం చేసినారనుటలో నెట్టి సందేహములేదు. శ్రీ పర్వతస్వామి యున్ను కార్తికేయుడైనాడు. తర్వాత రాజ్యము చేసిన విష్ణుకుండిని ప్రభువులు యీ శ్రీ పర్వతస్వామిని మిక్కిలిగా కొలచిరి. వారి కుల దేవతగా ''శ్రీ పర్వత పాదానుధ్యాయినులుగా,పాదపరిగ్రహీతలై రాజ్యమునేలిరి. వీరి నాణెములపై గూడ కార్తికేయస్వామి ఆలయము, ఆ గుడి కిరు ప్రక్కల రెండు హలములను లాంఛనములుగా చిత్రించిరి. హల ములు షడాననుని లాంఛనములు (అంశుమత్ భేదాగమ). రెండవ విక్రమేంద్రవర్మ (555-569) ఉత్తమాశ్రయుడు పరమ బ్రహ్మణ్య మరియు పరమ మహేశ్వరుడుగా శాసనముల నెరుగుదుము.

ఈ విష్ణు కుండినుల కాలమునకు చెందినదే నొక చక్కని సంపూర్ణమూర్తి శిల్పము సుప్రష్ఠితమైనది, గుంటూరు జిల్లా చేజర్ల గ్రామములో కొండపై నొక దేవాలయమును చూచు భాగ్యము కలిగినది. (చిత్రము-53) పల్నాటి తెల్ల రాయి కృతమైన యీ శిల్పము ఇక్ష్వాకుల శిల్పములకు మిక్కిలి చేరువగానున్నది. ఈ కుమారుడు రెండుచేతులు గల్గి సమపాద స్థాణకమూర్తియై పద్మపీఠముపై నిలుచుకొనియున్నాడు. ఈతడు స్వయం ప్రధానమూర్తి. 1.25 మీ. యెత్తు 47 సెం. మీ వెడల్పు, 12 సెం. మీ మందము రాతిపై పూర్తి శిల్పముగా చెక్కబడియున్నాడు. ముగ్ధమనోహర మూర్తిగా చిరునవ్వుల చిందించుచున్నాడు. యౌవనములోనున్న నీ కుమారునికి యజ్ఞోపవీతములేదు. కుడి చేతిలో పొడుగైన దండముగ్గలదు. దండము పై భాగమున త్రిశూలము క్రింద ముసలములున్నవి. అనగా నీ మహాసేనుడు ఆయుధ ద్వయమున్న దండమును పట్టుకొన్నాడు. ఇట్టి ఆయుధమున్న కుమారస్వామి విగ్రహమును మరెక్కడను చూడలేదు. యెడమచేతిని చిన్న కుక్కుటమును కటిపై నిడుకొని యున్నాడు. కుక్కుటము కూడ, స్వామిని చేరి చాల చక్కగా నమరి నడుముపై నున్నది. మకుటముపై పుష్పములున్నవి, రెండు కంఠహారములు, మరొక పతకహారము, ఆభరణము, కుండలములు రెండును, కూర్మ-మకరములు, ఆకార్ణాంతములు. వస్త్ర ఉదరబంధమున్నది. క్రింద

వస్త్ర యుగ్మము బిగువుగ పైకి బంధింపబడియున్నది, బాహు వలయములు, కనక వలయములు, నూపురము ఈ మహాసేనునికి శోభనిచ్చినవి. ఇక్ష్వాకు స్త్రీ శిల్పములో వలె మందస్మిత మనోహర రూపము గలిగియున్న యీస్వామి చూచువారలను తన్మయుల చేయుచున్నాడు, మధుర త్రవ్వకములలో లభించిన కాంస్య విగ్రహమునకూడ నిట్లేయున్నది. కాని అది చాలచిన్నది. 9 సెం. మీ యెత్తు మాత్రమే. విష్ణుకుండినులు కార్తికేయుని స్వయం ప్రధానమూర్తిగా ప్రతిష్ఠించి పూజించిరనుటలో నెట్టి సందియములేదు. అట్లే వినాయకునిగూడ వీరు ప్రత్యేకించు ప్రతిష్ఠించిరి. క్రీస్తబ్దము 4.5 శతాబ్దిలో లభించిన చిన్న ఫలకములందు, త్రిమూర్తుల ప్రక్కనే కార్తికేయుని చూడగలము. ఇట్టి అర్ధశిల్పమున్న రాతి ఫలకములు మాడుగుల, కునిదిన, పెద్ద ముడియము, ముక్త్యాల మరియు విజయవాడ మున్నగుచోట్ల లభించినవి. ఈ విధముగా త్రిమూర్తుల ఆరాధనలో వినాయకుడొక ప్రక్క, కుమారుడొక వంక శివ పార్వతులమధ్యగా శిల్పింపబడెను, ఇట్టివి సామాన్య ప్రజల నిత్య పూజలకుగాను ఉపయోగింపబడి నట్టివిగా తోచుచున్నవి ఇచ్చట కుమారుడు శక్తి దండమును పట్టుకొనియున్నాడు. తర్వాత కాలమున చాళుక్య, విష్ణుకుండి పల్లవులు (6-9 శతాబ్దం) కార్తికేయుని పలుచోట్ల అలంకరించిరి. కోష్ఠ దేవతగా మయూర పృష్ఠాశ్రయుడైన మూర్తి శిల్పము అలంపురంసేవ బాదామి గుహలలోను లభించినవి. ఇది వాకాటక గుప్తకాలపు శైలిని బోలియున్నది. నెల్లూరుజిల్లా పులికాట్ సరస్సునగల ఒక ద్వీపమున పంత్రింగం అనే ప్రదేశంలో పదవ శతాబ్ది ఆదిలో గుణగ విజయాదిత్యుని సేనానిగు పత్రం గుడు ఐవ దేవాలయం నిర్మించెను. అందు సుబ్రహ్మణ్యేశ్వరస్వామియు స్థాపించబడి ఉన్నారు. ఈ గుడికి ఎదురుగా శివాలయం ముందు నంది ఉన్నట్లు ఇక్కడి మయూరము చక్కగా చెక్కబడి ఉన్నది. కార్తికేయునికి యజ్ఞోపవీతమున్నది. (చిత్రము-54) యెల్లొరాలో అట్లే ఘూరపురిలో కార్తికేయుడుకూడ పూర్తి మూర్తి శిల్పము. పల్లవులు చిన్నస్కందుని శివ పార్వతులమధ్య చూపిరి. స్వయం ప్రధానత్వమిచ్చినట్లు కనబడదు, మహేంద్రునికాలము నాటిదైన తిరుచిరాపల్లి గుహ లందలి ఆయతనములలో షణ్ముఖ విగ్రహములున్నవి. ఈ కూటమిలో మొట్టమొదట కుమారుని చూచుచున్నాము అనగా పల్లవులపై, పాండ్యుల ఆచార ప్రభావములు చోటు చేసుకొన్నవన్నమాట. నెల్లూరునకు పడమటగల ప్రభగిరి అను పట్టణమందు షణ్ముఖుని విగ్రహం కలదు. ఆ విగ్రహమునకు మూడుముఖములు ముందువైపు, మూడు ముఖములు వెనుకవైపు కలవు.

## దేవసేన (చిత్రము - 50)

నాగార్జున కొండలో మహా సేనాపతికి భార్యగా, దేవిగా, (పత్నికి)గా క్రీస్తబ్దము 3 వ శతాబ్దిలో నొక దేవాలయముండెను. అందున అపురూపమైన మూర్తి శిల్పముకూడి లభించినది. సమభంగమున నిల్చినియున్న ఈ దేవి 56 సెం, మీ యెత్తు, 43 సెం. వెడల్పున్నది. రెండు చేతులు గలిగియున్నది. కుడి చేతిలో త్రిశూల దండమున్నది వామ హస్తము (కటిసంస్థిత హస్త) కొమ్ము కటిపైనుంచి కొనిపట్టుకొని యున్నది. ఛత్రము, తలపైనున్నది. కేతు ధ్వజము. మయూర పింఛములున్నవి. (మయూర పింఛ ధ్వజ) తలపాగ మకరిక బోలినది. బాహు భూషణములు, కేయూరము. కంకణము, ప్రకోష్ఠవలయములు, కంఠా భరణములలో నిండైన కుచద్వయము, ముత్య మరియు రత్న ఖచితములైన వడ్డాణములు, నీవి ఈ స్త్రీ స్వరూపముయొక్క సుందరతను చాటుచున్నవి. ఈ దేవి దేవతాసేనలకు శక్తి స్వరూపిణి. ఈమె ఆలయము శ్రీ పర్వత విజయపురి నగరకోట ఆగ్నేయ దిక్కున నుండెను. అనగా ఈ దేవసేన ఇక్ష్వాకుల పట్టణమును కాపాడు మహాసేనా పత్నిదేవి అన్నమాట, దుర్గాదేవివలె పట్టణ దేవతన్నమాట. ఇంత ప్రాచీనమైన, విలక్షణమైన దేవసేన విగ్రహము నాగార్జున కొండలో తప్ప మరెక్కడను కానరాదు. ప్రకాశంజిల్లా పితికాయగుల్ల యనుచోట

మహాసేనుడు మయూర వాహనముతో వల్లీ దేవసేనలను యిరుప్రక్కల నిడుకొన్న శిల్పము లభ్యమయినది. ఇచ్చటి శాసనమునుబట్టి ఈ యిటుక నిర్మితములైన దేవాలయములను తెలుగు చోళుల కాలము నాటివిగా క్రీస్తబ్దము 8-వ శతాబ్దికి చెందినవిగా నెరుగవలయును. కార్తికేయస్వామి చండికేశుని బోలిజారిన జటా భారము ధరించినాడు. జడమధ్య కపాల మున్నది. కొంత వికృతముగా నున్నను దేవసేనతో కలసియుండుట గమనింపదగియున్నది, బహుశ నీరూపము, అగ్ని కుమారుడైన సుబ్రహ్మణ్యుడు కాబోలు.

# తమిళ దేశమున సుబ్రహ్మణ్యస్వామి

సుబ్రహ్మణ్య లేక మురుగన్ లేక కందన్ లేక మైకేర్ (నెమలివాహనం కలవాడు) పూజ తమిళ దేశమున సంగము రచనల కాలమునుండి. అనగా క్రీస్తబ్దము మొదలు 7-వ శతాబ్దివరకు, చాల ప్రజాదరణలో నుండెను. మురుగణ్ కొండలందు చరించెడు దేవుడిగా ఖ్యాతిబడసెను. ఈ స్వామి పెద్ద దేవాలయములన్నియు కొండలపైననే నున్నవి. పళని, ఓడిమలై, తిరుచెన్‌గోడు, పట్టమలై, కడైయూర్ మరియు కండియణ్‌కోయిల్ మున్నగునట్టివి. ఇచ్చట శివుని దేవాలయముల చెంత సుబ్రహ్మణ్యుడుకూడ ప్రతిష్ఠింపబడి ఉన్నాడు. పలురకములైన ఉత్సవములు, పూజలు, తంత్రములు చూడనగును. ఈ దక్షిణ దేశమున కార్తికేయుడు అంత ప్రాచీన మూర్తి శిల్పములలో కానరాడు. పై దేవాలయములన్నియు క్రీస్తబ్దము 9-10 శతాబ్ది తర్వాతనే స్థాపింపబడినవి.

## ఉపయుక్త గ్రంధములు :-

1) పి. కె. అగ్రివాలా. స్కంద కార్తికేయ - ఏస్టడీ ఇన్ ది ఆరిజన్ అండ్ డెవలెప్‌మెంట్ (వారణాశి, 1967) పటములు VII - XI మరియు XVII - XIX, పుటలు 90 - 91, 113 - 114 - 118.

2) భగవంత్ సహాయ, ఐకొనాగ్రఫీ ఆ నర్ హిందూ అండ్ బుద్ధిస్టుడెటీస్ (న్యూ ఢిల్లీ, 1975) పుటలు — 100 - 102.

3) ఐ. కె. శర్మ, ది డెవలెప్‌మెంట్ ఆఫ్ ఎర్లీ శైవ ఆర్ట్ అండ్ ఆర్కిటెక్చరు, (న్యూఢిల్లీ, 1982) పుటలు 104 - 108, 114 - 120, 124 - 125, 143 - 145, 154 - 157.

4) కాంచన సిన్హా, కార్తికేయ ఇన్ యిండియన్ ఆర్ట్ అండ్ స్కల్ప్చర్, (న్యూ ఢిల్లీ - 1979) పుటలు-77

5) రత్న నవరత్నమ్, కార్తికేయ, ది డివైన్ చైల్డ్, (బొంబాయి - 1973) పుటలు 89 - 90.

6) ఫ్రాంకాయిన్ లెనాల్ట్ "సుబ్రహ్మణ్య ఆఫ్ ఏ సుప్రీమ్ డైటీ" మైఖేల్ మీస్టరు (సం) డి స్కోర్పస్ ఆన్ శివ, (బొంబాయి 1985) పుటలు 257 - 270.

# అలంపురమున ఆలయ నిర్మాణములు

## దేవతా-వాస్తు ప్రతిష్ఠా పద్ధతుల తెలుపు కొన్ని అపూర్వ విశేషములు

ఆంధ్ర దేశమున మహబూబునగరు జిల్లా అలంపురమను చోట శ్రీశైల జలాశయమున మునిగిపోకుండ రెండు దేవాలయ సముదాయములను యిటీవల భారత ప్రభుత్వ, పురావస్తు సర్వేక్షణ శాఖ, హైదరాబాదు మండలము వారు పునర్నిర్మించిరి. ఈ కార్యక్రమములో కొన్ని విశిష్ట అవశేషములు, ఆనాడు ఆచరణలో నున్న ఆలయ వాస్తు-మూర్తి ప్రతిష్ఠా పద్ధతుల విశదీకరించు విశేషములు వెలుగుకు వచ్చినవి.

పవిత్రములు, పురాతనములు, అపూర్వములునైన దైవ కట్టడములను పునాదుల సహితము కదలించి వెలికి తీసిన సన్నివేశములు భారతదేశమున మిక్కిలి యరుదు. కాని ఆంధ్రావనిలో అట్టి సంఘటనలు కొన్ని తప్పనిసరిగా జరిగినవి. రమారమి 30 యేండ్ల క్రిందట గుంటూరు జిల్లా, నాగార్జున సాగర నిర్మాణములో నాగార్జునకొండ లోయ లలో ప్రపంచ ఖ్యాతి గాంచిన ప్రాచీన వాస్తు-శిల్ప కళాఖండములను జలాంతర్గము గాకుండ వెలికితీసి కొండపైని భద్రము చేసితిమి. ఈ బృహత్తర కార్యము 1954-61 సంవత్సరములలో పరిపూర్ణముగ కొనసాగించినంతనే, మరల కృష్ణానదీపైనే శ్రీశైలమున మరొక విద్యుత్ జలాశయ పథకము చేపట్టబడెను. ఈకారణముగా అనేక పురాతన క్షేత్రములు - మహబూబునగరు - కర్నూలుజిల్లా ప్రాంతముల నీటమునుగుట తథ్యమయ్యెను. నూరు గ్రామములతో నున్న ఈ ప్రాచీన ఆలయసంపద నంతటిని సంరక్షించుట కష్టతరమయ్యెను. కొన్ని మహత్తర కృతములు, శిల్ప-వాస్తు ప్రాభము గల్గి, యపురూపములుగా పేరు మోశిన వాటిని సురక్షిత ప్రాంతములకు తరలించు కార్యక్రమమును భారత ప్రభుత్వము మరియు ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వము చేపట్టి యిటీవల చాల ఆలయములను కాపాడుట జరిగినది. విశేష ప్రజ్ఞతో, శ్రమతో కూడిన యీ కార్యక్రమములను రెండుచోట్ల పరిపూర్ణముగ చేయగలిగితిమి. ఈ అధ్యాయమున, కొన్ని అపురూప వాస్తు అవశేషములను గూర్చిన్ని ఆలయ వాస్తు, మూర్తి ప్రతిష్ఠా రీతులను నిశితముగా సాక్ష్యాధారములతో పరిశీలించి, చదువరులకు వివరముగా నందజేయుదును.

ఈ ఆలయములు రెండు సముదాయములకు చెందినవి. 1. కూడలి గ్రామములో తుంగభద్రా-కృష్ణానది సంగమమున గల సంగమేశ్వరాలయము 2. పాపనాశి యను నామముతో ప్రసిద్ధి గలిగిన 23 ఆలయముల సముదాయము. ఈ రెండును చాళుక్యనృపుల కాలమున ప్రతిష్ఠితములు. మహబూబునగరు జిల్లా, అలంపురమునకు చెందిన భూములలో పునర్నిర్మితములై శోభించుచున్నవి.

## 1. చాళుక్య పూర్వరంగము: శాసనాధారములు, చరిత్ర

విష్ణుకుండి వంశజులను, బాణనృపులను జయించి వాతాపినేలు మొదట కీర్తివర్మ (క్రి. శ. 566-67) అధికారములోకి వచ్చెను. చాళుక్య విషయముగా ఖ్యాతికి వచ్చిన యీ మహబూబునగరు - కర్నూలు - కడపజిల్లా ప్రాంతములు ప్రముఖ విద్వావంతులకు, రాజవంశములకు ఆకర్షణీయము లయ్యెను రెండవ పులకేశి కాలమునకు చెందిన తుమ్మయనేరు శాసనము కృష్ణా-తుంగభద్ర నదుల సంగమములో నున్న కూడలి సంగమేశ్వర క్షేత్రమును గూర్చి స్పష్టముగా పేర్కొనుచున్నది. ఈ తుమ్మయనేరు గ్రామమును పులకేశి ప్రభువు స్వయంగా కూడలి సంగమేశ్వరునికి యభిషేకము గావించి కార్తీక పూర్ణమి నాటి చంద్ర గ్రహణ పుణ్యకాలమున బ్రాహ్మణులకు దానమిచ్చెను. గర్భాలయపు తూర్పు గోడపైన పద్మనిధి - యర్ధనారి శిల్పముల మధ్య ఇ-44 గా గుర్తించబడ్డ రాతిఫలకము మీద తెలుగు -

కన్నడ లిపిలో లిఖింపబడిన ఒక శాసనము "శ్రీ వుత్పత్తి పిడుగు ఏకాంత నివాశి". చాల ముఖ్యమైనది. ఇటువంటి లేఖనము లాంఛనముతో సహా సత్యవోలు, కడమర కాలువ, ప్రాతకోట వంటి పూర్వ చాళుక్యుల దేవాలయములందు కూడ కలదు. ఈ చోట్లనే గాక ఉండవల్లి, అక్కన్న - మాదన్న గుహలలో (విజయవాడ) గూడ చెక్కబడియున్నది. ఈ నామము స్థపతుల సంఘము యొక్క సంకేతముగాను, రెండవ పులకేశి కాలమున కన్న పూర్వమైనదిగా పలువురు నిర్ణయించి యున్నారు. ఇటువంటి లేఖనము మొదటి విక్రమాదిత్యుని కాలమునకు చెందినది (క్రీ. శ. 654-681). అలంపూరున గల చాళుక్య కృతములైన నవ బ్రహ్మ ఆలయముల కన్న నిస్సందేహముగా ప్రాచీనమైనదిగా చెప్పన గును. ఈ విక్రమాదిత్యునకు శివ మండల దీక్ష నొసగిన శ్రీ సుదర్శనాచార్యుల వారి ఆశ్రమము చిన్న సూరూరు గ్రామమున గలదు. అలంపురమునకు చేరువైన యీ గ్రామమున విక్రమాదిత్య నృపుడు స్మృతి మందిరమును గూడ నిర్మింపజేసెను. కడమర కాలువ గ్రామము నందలి శివా నందీశ్వరాలయములోని మరియొక శాసనమున విక్రమాది త్యుడు తన రాజ్య సంవత్సరమున కార్తీక శుద్ధ పంచమినాడు స్వయముగా నొసగిన దానముల పేర్కొనుచున్నది. ఈ మధ్యనే లభించిన అర్క బ్రహ్మ ఆలయములోని స్థంభ శాసనము వలన యీ అనివారిత విక్రమాదిత్యుని మహాదేవి మహాదేవాయ తనమున లింగప్రతిష్ఠ జేశి భారద్వాజన గోత్రుడైన పిష్ఠిశర్మ యను మహా బ్రాహ్మణునకు యేబది నివ ర్తనముల భూమిని దానమొసంగి నటుల తెలుపుచున్నది. విక్రమాదిత్యుని తరువాత వారయిన వినయాదిత్య, విజయా దిత్య రాజుల పాలనలో కూడ చాళుక్యుల అధికారము సుస్థిరమే గాక అనేక ధార్మిక కార్యక్రమములు గావించి ప్రసిద్ధి గాంచిరి బాల బ్రహ్మ ఆలయములోని మండప స్థంభ శాసనము వారి కాలమునకు చెందినది. సుసంపన్నమై యున్నట్లు, ఆ తరువాత కూడ విజయాదిత్యుని కాలము వరకును అలంపూరు సీమ పరిసరములలో కూడ విస్తృతముగా ఆలయ కార్యక్రమములు శైవాచార్యుల బ్రాహ్మణుల పోషణ విరివిగా జరిగినటుల తెలియుచున్నది.

## 2. కూడవల్లి (లేక) కూడలి సంగమేశ్వరాలయము : (చిత్రము-4)

రాతిగుట్టల లేక పంటపొలముల మధ్యగా యెగుడు - దిగుడు బాటలో, వేసవి రోజులలో మాత్రమే ప్రయాణ సాధ్యమైన మార్గము గలిగి అలంపురమునకు 20 కి. మీ. ఈశాన్యముగ యీ ఆలయమున్నది. రెండు నదుల పవిత్ర సంగమ స్థానమున (పటము - 61), పడమటి నుండి కృష్ణవేణీ, ఉత్తర వాహిని తుంగభద్రా నదుల మేలు కలయిక ఈ మహత్తర వాస్తు శిల్పకళా భండారమునకు పునాది స్థలమయ్యెను. ఇట్టి కూడలి వలననే చేరువైన గ్రామమునకు కూడవల్లి లేక కూడలి యను వ్యవహారిక నామము సంభవించెను. తీర్థసంగమమే గాక జీవనదులు సరిగా యీ ప్రాంత మునవే వుత్తర వాహినులగుట మహత్తరము. పూర్వ చాళుక్య ప్రభువులు యీ ప్రకృతి దృశ్యమున పరవశించి శివుని కాలయము గావించిరి. ఈ యేకైక ఆలయము తప్ప తరువాత కాలమున మరెట్టి కట్టడము నిర్మింపబడలేదు. ప్రతి సంవత్సరము యీ రెండు నదుల వరదల ముంపు వలనే ప్రక్క గ్రామ ప్రజలు యిచ్చటికి చేరలేకున్నారు. ఈ కార ణము వలననే ఆలయ నిర్మాణ కార్యక్రమములు అలంపురమునకే తరలింపబడెను కాబోలు! చాళుక్య నృపులు మరెట్టి దేవాలయమును యీ చోట నిర్మింపలేదు.

## ఎ. ఈ ప్రాంతమున త్రవ్వకములు : (చిత్రము-6)

ఆలయమునకు తూర్పున మరియు దక్షిణ భాగమున గల యెత్తయిన దిబ్బను 1978-79 సంవత్సరముల శ్రీ యన్ పి. ఘోష్ త్రవ్వకములు జేసెను. ఈ త్రవ్వకముల ఫలితముగా క్రీస్తుపూర్వము 4-6 శతాబ్దములకు చెందిన యిటుక దేవాలయములు యెరుపు రంగు, కొద్దిగా నలుపు-యెరుపు గల మట్టి పాత్రలు అట్టడుగు స్తరములలోభించెను.

ఆలయము నెం. 1 తూర్పు ముఖస్తమై 3.84 × 2.67 మీటర్లు గలిగిన దీర్ఘ చతురప్రాకారముతో గల గర్భగృహము. ముందుగా 1.96 × 0.87 మీ. అగ్రమండపమున్నది. గర్భ గృహమున వెనుక గోడకు అనుకొని యిటుకలతో నిర్మితమైన వేదిక లింగపీఠముగా నుపయోగించిరి.

ఈ ఆలయమునకు చేరువగా వుత్తరముగా ఆలయము నెం. 2 సంగమేశ్వరాలయ దక్షిణ ప్రాకారమున క్రిందుగా పోయినది. ఈ యిటుక ఆలయము లందున నేలపైని ప్రాంగణముల పలక రాతి పరుపు గలదు. కనీసము రెండు దఫాలు మరమ్మత్తులు కూడ జేశిరి. దాచేపల్లి తెల్లరాతి లింగములు చిన్న యిటుకతో నిర్మితములైన గుళ్ళలో నదీతీరమున అంచున కానవచ్చినవి. ఈ సంగమస్థానము పవిత్రమైన తీర్థస్థలముక్రీస్తబ్దము 5-6 శతాబ్దిలలో ఖ్యాతి బడసి పెక్కు చిన్న చిన్న యిటుక దేవాలయములు నిర్మింపబడి దాచేపల్లి తెల్లరాతి లింగములు ప్రతిష్ఠితములయ్యెనని నిస్సంకోచముగా తెలియవచ్చెను. ఇవి గాక శ్రీ ఘోష్‌గారు కొన్ని యపురూప పురావస్తు అవశేషముల వెలికి తీసిరి. యేనుగు, చంద్రవంక మరియు ఉజ్జయినీ చిహ్నములు గల రెండు పోటిను నాణెములు, సాతవాహను రాజుల కాలము నాటివి, 4 వ శతాబ్ది బ్రాహ్మీలిపి శాసనము (కాలను) అదే కాలమునకు చెందిన గుండ్రని (రాతి చిప్పరాయి) ముద్రిక కలభస యను నామముతో (కలభా) యనువానికి) లభించినవి. ఇవిగాక రోమన్ చక్రవర్తి కాన్‌స్టెన్‌టైన్ ది గ్రేటు (క్రీ. శ. 306-337) మరియు బైజాన్‌టైన్ చక్రవర్తి అనస్టాషియస్ (క్రీ శ. 491-518) యొసగిన రెండు బంగారు నాణెములుపై స్తరముల నుండి లభించినవి. ఈ నాణెములను కంఠహారముల పతకములుగా ఉపయోగించినట్లు వానికి గల రంధ్రముల బట్టి తెలియుచున్నది. రోమనులు. బైజాన్‌టైన్‌లు యీ కాలమున యీ ప్రాంతముల వ్యాపార సంబంధములు కలిగియుండిరి కాబోలు బంగారు నాణెములు విరివిగా యీ చోట్లకు చేరుటయే గాక ఆభరములుగా వాడుకొనుట యాచారముగా నుండెను. ఈ వస్తు సముదాయములను బట్టి క్రీస్తబ్దము 4 వ శతాబ్ది నాటికే యీసంగమస్థానము ప్రముఖ ధార్మిక తీర్థక్షేత్రము గానే గాక, వ్యాపార స్థలముగా కూడా ఖ్యాతికి వచ్చెను. మహారథుల కాలానికి, తరువాత గౌతమీ పుత్ర శాతకర్ణ మరియు ఇక్ష్వాకుల కాలానికి చెందిన శైవాలయములు, నాణెములతో సహా, నందికొట్కూరు తాలూకా, వీరాపురము, సిద్ధేశ్వరము, రంగాపురము మున్నగుచోట్ల గావించిన ఖనన పరిశోధనలలో లభించినవి. తుంగభద్ర - కృష్ణ - భవనాశి సంగమస్థానములు దేశీయులనే గాక విదేశీయ వ్యాపారులను గూడ ఆకట్టుకొన్నవి. వీరు కూడలి వంటి చక్కని సంగమ స్థానముల దర్శించి తరించిరి.

## (బి) ఆలయ వాస్తు లక్షణములు (చిత్రము-5)

తుమ్మయనేరు శాసనమున కూడలి సంగమేశ్వరాలయ రూపమును గూర్చి వర్ణన కానరాము. ఈ ఆలయమే రీతిని కనుపించేదో తెలియదు. చాళుక్య ప్రభువు రెండవ పులకేశి యిక్కడకు వచ్చినప్పుడు (క్రీ. శ. 620) యితర యిటుక ఆలయకట్టడములు లేకపోయినా కనీసము సంగమస్థానమున లింగ ప్రతిష్ఠలు వుండవలె; ఈ స్థానము తీర్థక్షేత్రముగా పవిత్రత గలిగియుండుట వలననే మహారాజైన పులకేశి యిచ్చటకు వచ్చెను. ఆధారములు కొద్దియైనను యీప్రాంతము విజయపురి ఇక్ష్వాకుల ఆధీనమున వుండినటుల తెలియుచున్నది. ఇక్ష్వాకురాజైన ఖుద్రపురుషదత్తుని కాలమున హాలంపుళిస్వామికి యిచ్చిన భూదానము (గురజాల శాసనము) వీరాపురం త్రవ్వకముల లభించిన ఇక్ష్వాకు నాణెములు, ఈ ఆలంపుర సీమ తరువాత సాతవాహన ఇక్ష్వాకు కాలమున రాజ్యభాగమై యుండెను. వీరి తరువాత విష్ణుకుండి ప్రభువులు కొద్దికాలము పాలైన రాజ్యముచేశి యుండనగును. కూడలి యందు అలంపురము త్రవ్వకముల విష్ణుకుండి నాణెములు లభించినవి. పద్మబ్రహ్మ ఆలయము క్రింద త్రవ్వగా యిటుక దేవాలయ పునాదులు కూడ వెలుగుకు వచ్చినవి.

## (I) వాస్తు విన్యాసము :

నేలమీద మానమును బట్టి ఆలయము దీర్ఘ చతురప్రాకారముగా తూర్పుముఖంగా నున్నది. (చిత్రము - 7). వెనుక గర్భగృహము, దాని ముందు అంతరాళం, మధ్యగా సోపానమున్నది. ముందు అగ్ర మండపము యొక్క స్థంభములు రెండు వరుసలుగా నమరియున్నవి. వీనిపై కప్పు ఏటవాలుగా రెండు స్తరములలో (లూపారోహిత శిరము) అంతస్తులుగా స్తంభముల బారు కనుగుణంగా వేయబడినది. గర్భాలయమునకు అగ్రమండపమును చుట్టూ గూడా మండపమున్నందున ఆలయము చక్కని శోభాయమానమై వెలుపలి గోడలపైని యెన్నో రీతుల శిల్పశోభితములై యున్నవి. మండపము యొక్క బహిర్భాగము నలువైపుల చిత్రితములైన కుడ్యశిల్పము ఎ మరే ఆలయమున ఇంతటి మేలు రీతి గాకానము. గంధర్వదంపతులు, కిన్నరమిధునములు, కోష్టముల దేవతలు, తోరణాలంకృతములై కుడ్య స్తంభికల మధ్యను, అనేక రకములైన భద్రావలోకనములతో శోభాయమానమై ఉన్నది. (పటము-82) ఈ ఆలయము సాంధార రేఖానగర ప్రాసాదము. పై శిఖరము చక్కని సంపైన తలచ్ఛందము గలిగి, ఐదు తలముల విర్దేశించు కర్ణామలకములు శోభస్కరములుగా కానవచ్చుచున్నవి. శిఖరాగ్రముపైని ఆమలకశిల దానిపైని పూర్ణకలశ స్తూపిని ప్రస్ఫుటముగా నమర్చిరి.

ఆలయ తూర్పు ముఖద్వారమున కెదురుగా చతుస్తంభ స్ఫటికా తలముపై నొక పెద్దనందిని ప్రతిష్టించిరి. నందీశ్వరుడు దైవవీక్షణ తత్పరుడు గదా! రమారమి 3.30 మీటర్ల యెత్తున ఆలయము చుట్టునూ ప్రాకారముగలదు. తూర్పున యెనిమిది మెట్లతో యెత్తయిన సోపానమున్నది. ప్రాకారము యొక్క నాలుగు ముఖముల చిత్రితమై అత్యంత శోభాయమానమై తీర్చియున్నది. లోపలి ప్రాంగణమున ఆలయము యొక్క నేలమట్టము వరకును, షుమారు $1\frac{1}{2}$ మీటర్లు మందము మట్టితో నింపిరి. ఆలయము చుట్టూ ప్రదక్షిణ మార్గము గలదు. దేవకోష్టములతో శోభించు గూఢామండపమును చక్కగా సమీపించి చూడనగును. అంతః ప్రాకారమెట్లు సుచిత్రితమో, బహిర్ ప్రాకారము కూడ నంతకు మించియే కనులపండువుగా నున్నది. నూపురముగా ఈ ప్రాకారాగ్రభాగమున - శాల, కూట, పంజర శిఖరములు తోరణములుగా తీర్చిరి. ప్రధానాలయమున కెట్లు జగతి-యధిష్టానములున్నవో, అట్లే ప్రాకారమునకు కూడ ఉపానము, స్పష్టమైన కోణములతోటి పద్మజగతి, సుందో భేదముగా లేక వృత్తముగానో కుముదము (అయిహోళే ఆలయమువలె) కంఠము, నకులపాద అర్థ స్థంభముల మధ్య నిండుగా చెక్కిన శిల్పఫలకములతో నలంకృతమైన ప్రతి చూడ ముచ్చటగా నున్నవి. (పటము - 65). శిల్ప ఫలకముల మధ్యగా చిన్నగణములు, మిధున దంపతులు, అపురూపమైన మూర్తి శిల్పములు - లకులీశుడు, భూవరాహ, బ్రహ్మ మున్నగునవి కంఠభాగమున అమర్చిరి (భిత్తి సమాశ్రిత) కోణముల గజముఖములు భారా వాహకులవలె సహజ రూపమున కానవచ్చును. ఈ గజముండములు మహాబలిపురములోవి పంచ రధముల, సత్యవోలులోని భీమేశ్వరాలయమున కూడ చూడనగును. ఆగమ శాస్త్రానుసారముగ ప్రాకారమున ఆగ్నేయ మూల సప్తమాత్రికల ఆలయమున్నది. బాలబ్రహ్మ ఆలయమున గూడ నిట్లున్నది.

చిత్రమేమన ఈ కూడలిని ఈ సంగమేశ్వరాలయమును తప్ప మరొక కట్టడమును యిచ్చట చాళుక్యులు నిర్మింపలేదు. ఆలయములోని వివిధ భాగముల మీద శాసనములన్నియు యీ కూడలి సంగమేశ్వరునికి సంబంధించినవే. ఈ మధ్యనే ప్రధానాలయములోని ఒక రాతిపై 6-వ శతాబ్దికి చెందిన నామలేఖనం "శ్రీ విశిద్ధకజుగచారి" ఒక స్థపతి పేరును తెలుపుచున్నది. దీనివలన అలంపూరు రాతి ఆలయములన్నింటిలో ఈ కూడలి సంగమేశ్వరాలయమే మొదటి కృతముగా సూచితమగుచున్నది.

మరికొన్ని శాసనములు క్రీ. శ. 1028, 1045 లో దీపదానాలను గురించి, క్రీ. శ. 1187 లో ప్రముఖ శైవాచార్యులు మల్లికార్జున పండితారాధ్యులు యిచ్చటికి వచ్చిన సందర్భంగా జరిపిన భూదానమును, 13 వ శతాబ్దంలో మల్లిదేవ స్థానాధిపతి విగ్రహాన్ని నిలిపినట్లు, మహా మండలేశ్వర వీరకేసరదేవు (క్రీ. శ. 12 వ శతాబ్ది) ని భార్య మైలాల దేవి యాత్రికులను ఉచితంగా నదిని దాటించడానికి పడవల వారికిచ్చిన ధర్మ రేవు భూదానమును గురించి ఉదహరించుచున్నవి.

శక సంవత్సరం 1320-1322 నాటి ఒక లేఖనం ద్వారా ఈ ఆలయం మొత్తం, దాని శిఖరం, మండపము భవంతిని కందెనవోలు (కర్నూలు) పెద్దకరణమైన సుఖామృత శ్రీపాదుడు పునర్నిర్మాణము చేయించి నటుల విదితమగుచున్నది. కాలానుగుణంగా వరదలవలన ప్రజలు క్షేత్రమును విస్మరించినందున కొన్నిభాగములు నేలకొరిగియుండవచ్చును. బాగుచేశి కొన్ని నూతనముగా చేర్చిరి. ముఖద్వారమున గ్రానైటు రాయి ద్వారబంధము, వీరభద్ర విగ్రహము, నాల్గు చేతులున్న విష్ణుమూర్తి (గోపాలుడు) క్షేత్రమూర్తులుగా ప్రతిష్టించిరి. ముఖమండపము పైని తెలుగు శాసనమును బట్టి క్రీస్తుశకము 1724 వరకు యీ ఆలయము పోషణలో నుండినటుల స్పష్టముగ తెలియవచ్చుచున్నది.

## (సి) ఆలయపు చెంత త్రవ్వకములు (చిత్రము-8)

చిత్రితప్రాకారము యొక్క దక్షిణపు వైపున, తూర్పుప్రక్క నది అంచున శ్రీ యన్. సి. ఘోష్ గొనసాగించిన త్రవ్వకముల గూర్చి పైన వివరించితిమి. ప్రస్తుత మీ త్రవ్వకములు సంగమేశ్వర గర్భగృహము, మండపముల మీదుగా వాని పునాదులెట్లు చేయబడినవో, వాస్తు విన్యాసము లెట్టిదో తెలుసుకొనుటకై సుద్దేశింపబడెను. ఆదిలో గావించిన వాస్తు మండల నిర్మాణము దాని కనుబంధముగ పాటించిన గర్భవిన్యాస క్రతువులే రీతిని ఆచరించిరో తెలుసుకోవలశిన యవసరము ఆలయ పునర్నిర్మాణమునకై అత్యంత ముఖ్యములైనవి. ఈ కార్యమునకనువుగా రెండు కందకములు (ట్రెంచీలు), కె. డి. యల్. - 1, కె. డి. యల్. - 2 త్రవ్వబడెను. మొదటిది గర్భగృహము పైగా ఉత్తర - దక్షిణము గాను, రెండవది మండపముపై తూర్పు - పడమర దిశలుగాను వేయబడెను. ఆలయ పై భాగములను నేల మట్టమునకు తీసిన తర్వాత యీ త్రవ్వకములు జేయబడెను. ఆలయ ప్రాంతమున నేల శుభ్రము చేసినప్పుడు క్రిందుగా నున్న ఉపానభాగము లభించెను. (చిత్రము - 7). ఇది దీర్ఘ చతురస్రాకారముగ రాతితో దిమ్మలు పరచిరి. గర్భాలయము 7-30 మీటర్లు చతురస్రిమై వాస్తు మండలమునకు పడమటి అంచున వేయబడెను. ముందు అంతరాళము, దాని ముఖస్తముగా పదునారు కంభములపైని అర్ధమండపము, పై భాగములన్నింటిని కలుపు చూ గూఢ మండపము ఆలయ సముదాయములను సాంధారప్రాసాదముగా తీర్చినవి.

ఉపానము నందు వేయబడిన రాతిఫలకములపై గీతలు వరుస క్రమమును సూచించును. మానసూత్రపు సూచికలు, పై నిర్మాణమున కాధారములు. రాళ్ళవరుసలు, నిలువు స్తంభములనే రీతిని అమర్చవలెనో సూచించు పునాది ప్రక్రియలు గమనించవలసియున్నది. పునాదిని పరచిన రాళ్ళను ఒకదానికి మరొకటిని యినుప బద్దీలతో ముడిపెట్టిరి (చిత్రపటము - 7)

కె. డి. యల్. - 1 కందకమున గర్భాలయ ప్రాంతమును చక్కగా సమమట్టము చేసి మొట్టమొదటగా 7-45 మీటర్ల లోతున పునాది త్రవ్విరి. ఈ మట్టంమీద పుట్టమట్టితో గట్టిగా దిమ్మిసకొట్టిరి. ఈ మట్టిపై "టాకి" రాళ్ళపరుపు చేసిరి. ఈ 'టాకి' రాళ్ళ పలకలను పుట్టమట్టిని పొరలు పొరలుగా నింపి మొత్తము 7 మీటర్ల మందము గర్భాలయము క్రింద దిట్టముగా పునాదిని చేసిరి. (చిత్రం - 8) ఇంతటి గట్టి పునాదికి కారణము గర్భాలయము పైని అనేక శృంగ

ములతో కూడిన బరువైన రేఖాశిఖరము 15 మీటర్లు యెత్తున నిర్మింపబడుటయే; ఈ ఆలయ పునాది ఆగమశాస్త్రాను సారము శిఖరపు యెత్తులో సరిగా సగమున్నది.

ఈ పునాది త్రవ్వకములందు మూడు దశలుగా నిర్మాణ కలాపములు జరిగినట్లు తెలియుచున్నది. మొట్టమొదట నేలమట్టము 7-10 మీటర్ల లోతున చేయబడెను. ఈ స్తరములు పాతమట్టి పాత్రల అవశేషములు - ఎరుపు రంగువి, మెరయుచున్నవి, లభించినవి (Red Polished Ware), చిన్న యిటుకలు (5-4 × 5-2 సె. మీ.) బాణలింగము (మరకతము) ఛిద్రమైనది లభించెను. (చిత్రము - 9, ఛాయాచిత్రము . 66)

రెండవ దశ (Phase-2) నందున పైని లభించిన మృణ్మయ పాత్రలేగాక యిటుక ముక్కలు లభించినవి. మూడవ దశలో నొక శాసన ఫలకము - అగడికోలశ్రీ యను నామమున్నవి. క్రీస్తుశకము ఆరవ శతాబ్ది వ్రాత శైలి గలిగినది లభించెను. ఈ దశలలో చక్కగా రాతి పలకలతో పరచుటయే గాక మధ్యగా యెఱ్ఱ పుట్టమట్టి స్తరముల దిట్టముగా పరుపు చేసిరి, గర్భాలయము క్రింద నేవిధముగా ఆలయ పునాదిని కొన్ని క్రతువుల - అధ్యేష్టకలు, మరకత లింగము - మట్టిపాత్రలతో నాచరించి నటుల విదితమగుచున్నది. ఈ విధముగా ఆలయ వాస్తు క్రతువుల గూర్చి గ్రంథ స్తముగా తెలియుచున్నదే కాని, పురావస్తు పరిశోధనల యిదియే మొదటి దృష్టాంతరముగా నెరుగ గలిగితిమి.

కె. డి. యల్. - 2, కందకమున పునాది వేసిన తీరున రాతి పలకలు - పుట్టమట్టి పొరలు ఒక దానిపై నొకటి క్రమముగా 3-90 మీటర్ల మందము వరకే గావించిరి. మిగతా భాగమున సాధారణమైన నది యొక్క ఒండ్రుమట్టి నిండి యున్నది. ఇచ్చట యెట్టి పురావస్తువులు లభ్యముకాలేదు. ఈ పునాదిపై మండప స్తంభములు తీరుగా నమర్చిరి. ముక్తసరిగా మూడు అంచెలతో తక్కువ బరువు గలిగిన పై కప్పు (ఛాయాచిత్రము - 63) యుండుటచే తక్కువ మందపు పునాది వేసిరి. ఆలయ నిర్మాణమునకు కావలసిన యెరుపు యిసుక రాయి (Red Hardstone), తుంగభద్ర నది ఒడ్డున (అలంపూరు నుండి - కూడలి వరకు) గలదు. ఇక్కడనే వాస్తు - శిల్పకారులు పనిచేశిరని తెలుపుటకు, పనిముట్టు మరియు అసంపూర్ణముగా చెక్కిన కొన్ని రాతిఫలకములు కూడ లభ్యమయినవి.

## 3. పాపనాశి ఆలయ సముదాయము, అలంపురము :

అనాదిగా ఖ్యాతి బడశిన పాపనాశి తీర్థము అలంపురమునకు 3 కిలోమీటర్లు దక్షిణముగా ఉత్తరవాహినియైన తుంగభద్రా నది గట్టున వెలశియుండెను. (చిత్రము - 10). ఆలయములు నుండి వరకు మొత్తము 23 గుర్తింపబడి యున్నవి. రమారమి క్రీస్తుశకము 10-11 శతాబ్దముల నుండి వృద్ధిజెందినవి. బయట నుండి చూచిన సాధారణమైన రాతి కట్టడములుగా కనుపించును. పేర్చిన మెట్లవలె రాతి పలకలతో కట్టిన చతురస్ర - బ్రహ్మచ్ఛందశాల లేక మండపముల వలె యున్న శిఖరములు, ఒకచోట గుమిగూడి యున్నట్లు కనుపించును. ఆలయములు జె. యన్. వి. పైన వివరించిన ఆకారములను పొందియున్నవి. ఆలయము ఆర్. గజపృష్ఠాకృతి శిఖరము గలిగియున్నది. చిన్న చిన్న లింగ పీఠములు పలు విధముల ప్రాంగణములో నున్నవి. ఆలయము లన్నియు ప్రాకారమున భద్రితములు. తూర్పు ముఖముగా నది వైపు ప్రవేశ ద్వారశాల (ప్రతోలి) కలదు. తీర్థము చేరుటకు సోపానములున్నవి.

ఇచ్చటి పాపనాశేశ్వర ఆలయము (అనగా) ప్రధానమైనది. (పటము - 67). అన్నింటి కన్న పెద్దది. నేలపై చతురస్రాకారము గలిగి సాధారణమైన గోడలు, మెట్లనలె చతురస్రపు పరితలము (ఫాంశనా) మీద బ్రహ్మచ్ఛంద గ్రీవ శిఖరమున్నది. ముందుగా రంగమండపము గలదు. శిల్ప శోభతో నున్న యీ రంగమండపపు కంభములపై చాల చక్కని పురాణగాథలున్నవి. (సముద్ర మథనము మున్నగునట్టివి). ఈ మండప వితానముపై అష్టదిక్పాలకుల

శిల్పము - మధ్యగా నటరాజు - చాల ఖ్యాతి బడిశిన మూర్తి శిల్పములు అత్యంత శోభాయమానములు. గర్భగృహ ద్వారము పంచశాఖలున్నది. లలాటము పైని ద్వారశాల, కూటశిఖరముల మధ్య చక్కగా నమరినది. ముఖద్వారమునకు మెట్టుగా అర్ధచంద్రశిల శంఖాలంకారతోరణముతో అలంకృతమై యున్నది.

ఈ ఆలయ సముదాయమును నీటిముంపు నుండి సంరక్షింపవలసిన బాధ్యత పురావస్తు సర్వేక్షణ, హైదరబాదు మండలముపై బడెను. స్వస్థలము నుండి రెండు కిలోమీటర్ల దూరముగా యెత్తుమున మరొక స్థలమున నదీప్రాంతమును చూచునట్లు మరల యావత్తు ఆలయములు పునర్నిర్మితములయినవి. ఆలయ నిర్మాణ విధానమును పరిశీలించిన పిదప, ప్రతి రూపములను కొలతలతో చిత్రములపై వేసి, ప్రతి రాతిని అంకెలతో నిర్ధారించితిమి. ఈ విధముగా నమూనాలను చేసి ప్రతి రాతిని జాగ్రత్తగా వూడతీసి తరలించబడెను. ఈ పనిచేయునప్పుడు విడి శిల్పములు, మూర్తి విగ్రహములను, కొన్ని ముఖ్య ఆలయ భాగములను తగు శ్రద్ధతో గడ్డి సంచులను, వెంటిని చేసి యెటువంటి ఆపద రానీయక, అతి జాగరూకతతో, శ్రద్ధా భక్తులతో నీ తరలింపు కార్యక్రమమును సర్వశ్రీ సుంకర కొండారెడ్డి, జయరామిరెడ్డి, అయ్యలన్న ప్రభృతులు చక్కగా నిర్వర్తించిరి.

ఈ ఆలయములు, కూడలి సంగమేశ్వర ఆలయమువలె చిత్రితములు కావు. కానప్పటికిని పునాది పద్ధతులలో వీని యందున కొన్ని సామ్యములున్నవి. రాతి (టాకి), ఫలకలను, పుట్టమట్టిని పొరలుగా వేసి దట్టించి యెత్తుగా నమర్చిరి. షుమారు ఒకటిన్నర మీటర్లు మందముగ నిట్టి పునాది ఉపానము క్రిందుగా అన్ని ఆలయముల వెలికివచ్చెను. దీని వలన తేలినదేమన చాళుక్యవంశీయులు పునాదుల నిర్మించుటలో నొక నిర్దిష్ట విధానమును రూపొందించి పాటించిరన్నమాట.

రాతిపలకలు, పుట్టమట్టి పొరలతో తయారుచేసిన పునాది "ప్రకృతి భు" మీద నిలపిన స్తంభమూలము లేక పాదవర్గముయొక్క మట్టమునకు ఆలయ వుపానము సమతలములో నున్నది. వాస్తు మండలమును నిర్ణయించుట, ఆలయ వైశాల్యమును నిర్ణయించుట మొదలగు క్రతువిధానమును ప్రతి ఒక్క దానిలో అనుసరించుటకు తోడుగా వుపానాది కలశ స్తూపి పర్యంతము గల వుపరితల నిర్మాణమున కనువగునటుల మానసూత్ర రేఖలను, చుక్కలతోను లేక గీతలు చెక్కి తాపీవాని పనికి వీలుగా శిలలపై సంకేతముల చేసిరి (చిత్రము-7).

ఆలయము 'బి' నందున లింగపీఠమును లేవనెత్తగా మధ్యలో గుంట వంటి పల్లము కనుపించెను. కొన్ని చిన్న యిటుకలతో వాస్తు మండలమున క్రయవు లొనర్చిరి కాబోలు. అద్యేష్టకల నుంచి పూలు, నీరు, లోహములు, ధాన్యములు (బీజములు) మొదలైన వస్తువుల నుంచుట క్రతు విధానము. మానవాకృతిని బోలిన బంగారు రేకు, అయిన జీర్ణమైన రాగి నాణెములు యిందున లభించెను. గర్భస్తముగానున్న వాస్తు దేవతలకు శ్రద్ధాంజలి ఘటించి యిచ్చిన వస్తువులుగా వీటి నెరుంగవచ్చును.

అంతియేగాక ఆలయ శిఖరములను తీయు సందర్భమున గూడ కొన్ని నూతన సాక్ష్యాధారములు లభించినవి. అలంకరించిన తామ్రి కలశమును, గృహపిండిని లేక మధ్య రంధ్రమున కప్పిన రాతిపలక క్రింద శిఖరమూలమున నిక్షిప్తము చేశిరి. ఇది స్తూపిని నిలుపు మధ్య స్థానమునకు క్రిందుగా నున్నది. ఆలయములు బి. సి. ఇ. యఫ్. హెచ్. కే. టి. వి. లలో యీ విధముగా యెనిమిది రాగి కలశములు కొమ్ము చెంబులను బోలినవి లభించెను. (చిత్రము-11) ఆలయములు బి. హెచ్. టి. లలో దొరికిన కలశములకు గట్టి మూతలున్నవి. మిగిలిన వానికి మూతలులేవు. నల్లని వొండ్రుమట్టిలో పూర్తిగా కుక్కి నింపియున్నవి. వీనిలో నిక్షిప్తమైన వస్తువులు చాల ముఖ్యమైనవి. ఆలయము 'ఎఫ్' యొక్క గ్రీవము నుండి లభించిన (పటము - 69). కమండలము వంటి కలశమున అండాకృతిలో నున్న తెల్లటి రాతి

ముక్క (క్వార్టజైట్ రాయి), పురుషాకృతికి చిహ్నము (చిత్రము - 11) గా గర్భన్యస్తము చేసిరి. ఆలయము 'బి' లో లభ్యమైన కలశము యొక్క కొమ్ము యేనుగు తొండము వలె నున్నది. పలువరుసను బోలిన అంచుగల మూత గట్టిగా బిగింపబడెను. ఇందున అయిదు విలువగల వజ్రములు ఒక పలుచని బంగారు రేకులో చుట్టి సువర్ణపుష్పములతో నంతర్గతము చేసిరి. (పటము - 70) ఈ నిక్షిప్తమైన పాత్ర రత్నన్యాస కలశముగా నెరుగనగును. మరొక సాదా అంచు కల కలశము, ఆలయము - కె నుండి లభ్యమయ్యెను. ఒక యినుప బాణము నిందుంచిరి. ఆలయము-ఓ-నందు గర్భాలయపు నేల పునాదిని ఒక చిన్న యినుపగద, దానితోబాటు ఆరు రాగి నాణెములు లభించెను. పూర్తిగా జీర్ణించి పోయినందున ఈ నాణెములను గుర్తించ వీలు కాలేదు. అయినను ఒక నాణెముపై ప్రక్క చతురస్రమున మధ్య త్రిశూల చిహ్నము కనుపించుచున్నది. ఆలయము 'ఎ' లో పిడితో నున్న పదునైన కత్తి లభించినది. ఆలయము హెచ్. టి. లలో లభించిన కలశములలో అట్టడుగున పల్చని రాగి రేకుతో పద్మాలంకారము గలిగిన మట్టుల నుంచిరి. నేపాల్ తారాయిలోని సాగ్రహవద్ద క్రతువిధానములో భాగముగా పద్మములతో అచ్చొత్తిన యిటుకలు పునాదిలో లభించెను. ఈ విధమైన వాస్తు కలశములు అందున నిక్షిప్తమైన వస్తువులు తీర్థక్షేత్రమున ఆలయముల నిర్మించినప్పుడు వాని ప్రతిష్ఠా పద్ధతుల కనుగుణముగా వివిధ క్రతువులనాచరించిరని తెలుపుచున్నవి.

## 4. పునాది నిర్మాణ పద్ధతులు :

పురాతత్వజ్ఞుల త్రవ్వకముల లభించిన నూతన సాక్ష్యముల వివరించిన తర్వాత ఆగమశాస్త్రముల సహాయముతో లభ్యమైన వాస్తు రీతులను తత్సంబంధిత వస్తు శకలములను సరియైన దృక్పథముతో పరిశీలించి పూర్వ క్రతువుల-అచారముల గూర్చి చర్చింతును. ప్రాచీన కట్టడముల పునాది రీతుల గూర్చిన పరిశోధన చాలా అరుదుగా చేపట్టబడెను. మొత్తము కట్టడమును పునాదులతో సహా పెకలించుట పురావస్తు త్రవ్వకము లందు వీలుగాదు. యెవ్వరును. అంగీకరింపరు గూడ. ఏలనన ప్రాచీన ఆలయములను యథాతథముగా భద్రముచేసి, భావితరాల వారికి అందజేయుట పురాతత్వ సర్వేక్షణ యొక్క గురుతర బాధ్యత గదా! కాని పైన వివరించిన రెండు ఉదాహరణలు అత్యంత జుగుప్సాకరమైన, అపురూపు కార్యక్రమములుగా గ్రహింపవలెను. దేవాలయములు ఆమూలాగ్రము - ఉపానాది స్తూపి పర్యంతము, విడదీసి, మరొక స్థలమునకు తరలించి పునర్నిర్మాణము గావించుట యెప్పటికో కాని జరగదు. అట్లు జరిగినను శాస్త్ర పద్ధతుల ననుసరించి వాస్తు రీతుల - మూర్తి ప్రతిష్ఠ పద్ధతుల అవగాహన చేసుకొనవలెనని ప్రయత్నము జరుగలేదు. భగవదేచ్ఛ కాబోలు ఈ కార్యక్రమములు అట్టి వస్తు ఆధారములు, గ్రంథముల నిర్దేశించియున్న క్రతు విధానముల ఋజువు చేయుచున్నవి.

### (అ) క్షేత్ర నిర్ణయము :

అజితాగమములోని 6, 7 వ అధ్యాయముల దేశనిర్దేశమును అనగా భారతదేశము నందలి పవిత్రస్థలముల నుదాహరించి తగిన స్థలమును యెన్నుకొనే విధానము వివరింపబడెను. పవిత్ర స్థలము అనగా క్షేత్రము నీటితీరము లేక నదీస్థానమున (తీర్థము) అందువలన కూడలి సంగమేశ్వరాలయము రెండు నదుల కృష్ణా - తుంగభద్ర సంగమమున స్థాపించిరి. అట్లే పాపనాశి తీర్థము తుంగభద్రానది గట్టున స్థాపితమయ్యెను.

### (ఆ) స్థల పరీక్ష :

స్థల నిర్దేశమునకు మూడు పరీక్షలు చేయుదురు. నేలయొక్క గట్టితనము, మట్టియొక్క బిగువు, నేలలోని తడి, నేల క్షేత్ర నిర్మాణమునకు అనువైనదా లేదా అను విషయమును తెలుసుకొనుటకై భూమిని పరీక్షించుట జరుగును.

సాగుచేసి గింజలు చల్లుట మొట్టమొదటి కర్తవ్యము. పైన లభ్యమైన సాక్ష్యాధారముల బట్టి నదుల సంగమ స్థానమగుట చేత సస్యశ్యామలమైన భూమియే. కాని ఆలయ నిర్మాతలు అత్యంత జాగరూకులై గట్టి పునాదులను లోతుగా నిర్మించిరి.

## (ఇ) నేలపై ఆలయ మానము గుర్తించుట :

నిర్మించవలసిన కట్టడపు నమూనాను నేలమీద గుర్తించుటకు దాని వెడల్పు (విస్తార), పొడవు (ఆయమ), మానసూత్రము వెంబడి గుర్తించెదరు. స్థలమును దిశాభిముఖము చేసి కట్టడపు కొలతలను నేలమీద గుర్తించుదురు. పునాదిని వేయు స్థలమున రక్షక దేవతలను స్థాపించుట యాచారము. కట్టడపు పరిణామమును నిర్ణయించుట వాస్తు పూజా సమయమున జరుపుదురు.

## (ఈ) పునాదుల రీతి : (చిత్రము-౮)

పునాది లోతు నిర్మించదలచిన కట్టడపు యెత్తును బట్టి, బరువును బట్టి మరియు నేలలోని నీటిపొర యొక్క లోతును జూచి నిర్ణయింతురు. ఈ ఆలయ నిర్మాణ కాలమునకు చెందిన వాస్తు గ్రంథము "మయ మతము" ను బట్టి ఆలయము యొక్క వెడల్పు బట్టి పునాదిలోతును నిర్ణయించవలెనని యెరుగవలెను. కూడలి ఆలయమందు యిట్లే పాటించిరి. ఇందున గర్భాలయము 7-30 మీ. వెడల్పు గల చతురస్రము పునాది 7-10 మీటర్ల లోతున వేసిరి. గర్భాలయపు గోడలు వానిపైని రేఖా శిఖరము కలసి 15-75 మీటర్ల యెత్తున నిర్మింపబడెను కాశ్యప శిల్పము గ్రంథమున (84-1-10) పునాది యొక్క మందము, ఆలయ శిఖరముయొక్క యెత్తులో సగముగాని లేక నేల క్రింద నీటి పొర, తగులు వరకు గాని వేయవలయునని నిర్దేశించుచున్నది. సమరాంగణ సూత్రధారము నందున పునాది లోతు మానవుని యెత్తులో నాల్గవ వంతుగా చెప్పబడినవి. కూడలి సంగమేశ్వరాలయమున పునాది గర్భాలయము యెత్తులో (అనగా ఉపానాది స్తూపి పర్యంతము) సగమున్నది. దీనిలో మూడవ వంతు మహామండపము పునాదియున్నది. గర్భాలయము క్రింద త్రవ్వకములందు చాల పెద్ద బండరాళ్ళ పరుపు గావించిరి. ప్రతి రాతి పొరపైని పుట్టమట్టి నింపి దిమ్మిస చేసిరి ఈ విధానము Raft foundation తీరును బోలియున్నది. గర్భాలయము వద్ద మాత్రమే యిట్టి పునాది 7-10 మీ. మందమున పెద్ద చతురస్రపు అరుగువలె నిర్మింపబడుట పై రేఖా శిఖరమును భద్రముగా నిలుపుటకోసమే. గర్భాలయపు కొలతల కన్న పెద్దదైన కందకమును 7-45 మీటర్లు లోతు వరకు త్రవ్వి దానిలోని యేటి మట్టిని (నల్లని హొండ్రు మట్టి) తీసివైచి పై విధముగా బండలతోటి మరియు పుట్టమట్టితో దట్టించి, దృఢమైన పునాదిని వేసిరి. నదుల సంగమ స్థానమగుటచే నేలయొక్క బిగుతు మోయు సామర్థ్యాన్ని సరియైన అంచనాలు వేసుకొని ప్రత్యేక శ్రద్ధతో, సామర్థ్యముతోనే ఆలయమునకు పునాదిని వేసిరి.

## (ఉ) పుట్టమట్టిని యేలయెన్నుకొనిరి?

నిత్య వైదిక ఆహ్నికములకు - అగ్నిహోత్రము చేయుటకు గుండములు పుట్టమట్టితో నిర్మించుట, అవు పేడచే అలుకుట యాచారము గదా! దీనికి గూఢమైన ధర్మ సంబంధమైన అర్థమున్నది. ధార్మిక కట్టడములను నిర్మించుట పుట్టమట్టి, గోమేధ్యము ముఖ్యపాత్ర వహించుచున్నవి. ఆలయ నిర్మాణ క్రమములు నిర్వహించు క్రతువులలో పుట్టమట్టి పిండము తీసుకొని "గర్భస్థ పిండముగా" పునాదుల నుంచుట ఒక క్రతువు. హరప్పా నాగరికతకు చెందిన పెద్ద కట్టడములందున కూడ యిట్టి మట్టి పిండములు - పలు రకములుగా లభ్యమయినవి. కాని వీని యుపయోగము, వాస్తు క్రతువుల లేక నిత్యకర్మల యిట్టి మృత్తికా పిండముల ప్రాముఖ్యతను సరిగా అవగాహన చేసుకొనలేదు. ఆపస్తంబ

శ్రౌత సూత్రములలో (15-2-1). చీమలు పెట్టిన పుట్టలు ఆదివరాహమూర్తి మూతితో పైకెత్తిన మట్టిముద్దగా చెప్ప బడియున్నది. ప్రపంచమున మొదట పుట్టిన జీవిగా పుట్ట చీమలను (తెల్లచీమలు), శతపథ బ్రాహ్మణము పేర్కొను చున్నది. - పృథివీ భూతస్య ప్రథమజా. ఈ చీమల పుట్టలే నాగుపాములకు ఆవాసములయ్యెను. ఈ పుట్టలలోని మట్టి భూమి క్రింద పొరల నుండి పైకి తేబడినది. ఖనిజసంపదలతో నిండిన యీ భూమి బలమైనదిగా చెప్పబడెను. వాస్త వానికి చెద చీమలు బంగారమును కూడ బెట్టునవిగా పేర్కొనెదురు. ఈనాటికిని చీమలపుట్టల వద్ద నాగపంచమి జరుపుట హిందువుల పవిత్రయాచారము. ఇది వాసుకి జన్మదినముగా పూజార్హమైనది. భారతావనిలో అత్యంత ప్రాచీనమైన పర్వదినముగా శ్రద్ధతో పాటించుచున్నారు.

## (ఊ) తాత్కాలిక ఆలయము :

రౌరవాగమములోని 27 వ అధ్యాయము పూర్తిగా ఆలయ 'బాలస్థాపన' ను గూర్చి వివరించుచున్నది. ఉద్దేశించిన ప్రధానాలయమునకు తూర్పు దిశన లేక ఈశాన్యమున తరుణాలయము అందున బాణలింగము ప్రతిష్ఠించుదురు. ఈ బాలస్థాపనము అతి ముఖ్యము. యెందుచేతనంటే "బాలస్థాపనం వినా మూలస్థాపనం మృత్యుహేతుకం" (రౌర వాగమము, 27-31.) అసంపూర్ణముగా లభ్యమయినను, కూడవల్లి ఆలయ స్థలమున యిట్టి తరుణాలయము ప్రతిష్ఠిత మైనదని తెలుపుటకు కొన్ని ఆధారములు లభ్యమయినవి. కె. డి. యల్. కందకమున మొదటి స్తరమున చిన్న అద్యే ష్టకములు, మరకతలింగము (పటము - 66) ముఖ్యాలయము క్రిందుగా నున్న పునాది స్తరముల దొరికినవి. ఈ బాలాలయమును లింగముతో సహా భగ్నము కావించి ప్రౌఢాలయము పూర్తికాగానే దాని క్రిందనే మట్టిలో వేసిరి.

## (ఎ) మొదటి యిటుక నుంచుట :

పాపనాశి సముదాయము లందలి ఆలయముల గర్భగృహముల క్రింద పునాది గుంటలలో 5 అద్యేష్టకములను సుస్థాపితము చేసిరి.

## (ఏ) క్రతువులు :

వాస్తు పూజా క్రతువులు ఆలయ సీమలను నిర్ణయించిన యనంతరము క్షేత్రపాలురగు దేవతలకు శాంతి స్తోత్ర ములతో అద్యేష్టకలను నిక్షిప్తము చేయుదురు. ఈ విధానములలో ముఖ్యక్రతువు పునాదుల నిధి కుంభముల నుంచుట "పాపనాశి ఆలయము" యిట్టి కుంభములు గ్రీవశిఖరమున గృహపిండి లేక మధ్య రంధ్రముపై మధ్యగా లభించినవి. ఈ కలశములు రాగివి. వీటిని నదిలోని మృణ్మయముతో నింపిరి. అందున మధ్యగాని క్షిప్తములైన రత్నములు (రత్న న్యాసము - దేవాలయము - బి), సువర్ణ పుష్పములు, శ్రేష్ఠ ధాతువులు - ఆయుధములు పేర్కొనవలసియున్నవి. అంతేగాక ఈ కలశములు పళ్ళెఅంచు గల మూతలతో బిగువుగా మూసివేయబడెను.

కుంభముల (నిధి కుంభములు). నిక్షిప్తము చేయుట వాస్తు గ్రంథముల విపులీకరింపబడి యున్నది. విశ్వకర్మ వాస్తు శాస్త్రమున యిట్లు వివరణ గలదు.

దేవాలయే దైవగర్భే రత్నన్యాసో విశేషత ః।
దైవవాస్తుషు సర్వేషు సౌవర్ణం భాజనం శుభమ్ ॥

ఈ క్రతువులు ఆలయ పునాదిలో జరుగవలసినదిగా అన్ని గ్రంథములు పేర్కొనుచున్నవి. కాని మనకు లభించిన సాక్ష్యాధారముల బట్టి "దైవగర్భ" యను పదము శిఖర ప్రారంభమున అనగా గ్రీవము వద్దననియే అన్వయము

చేసుకోవలసి యున్నది. గర్భ గృహముయొక్క పునాది లేక అంతర్భాగము పైని కాదు. దక్షిణ దేశమున ఆలయ విమానమున శిఖర భాగము అత్యంత పవిత్రమైనది. కారణాంతరమున గర్భాలయము నందలి మూల బేరమును దర్శింపజాలకున్న శిఖర దర్శనము చేసిన పునర్జన్మ లేదని సూక్తి. ఆలయమున శిఖరము తలవంటిది-"శిఖరం శిరఇత్యాహుః। గర్భగేహం గలస్తథా॥" కాన ముఖ్యమైన క్రతువులు - కలశస్థాపనము, ఆమలక స్తూపి, ఆయుధ ప్రతిష్ట మున్నగునట్టివి గ్రీవాగ్రముననే ఆచరించుచుండిరి.

పైన వివరించిన అంశములన్నియు అరుదైనవియే. ఇంకను అపూర్వ విశేషమేమన సవిస్తరముగా పరిశోధన చేసి యిట్టి వాస్తు - దేవతా ప్రతిష్ఠ కార్యక్రమముల పాటించిన ఆచార-క్రతువుల వివరములు సేకరించగలుట. యేలనన యిట్టి పవిత్ర కట్టడములను సమూలముగా పెకలించి స్థలాంతరముచేసి ఉపానాది స్తూపి పర్యంతము తిరిగి నిర్మించిన కార్యక్రమము మరెక్కడను చేపట్టబడలేదు. అతి మెళకువతో జాగ్రత్తగా ప్రతి శిలను. మూర్తి శిల్పములను కొన్ని కిలో మీటర్ల దూరము తరలించి మరల ప్రతిష్టితము గావించిన భారత పురావస్తు సర్వేక్షణ, హైదరాబాదు మండలము వారికి భావితరములు ఋణపడియున్నారు.

ఆలంపురము వద్ద కూడలి సంగమేశ్వరాలయ పునర్నిర్మాణము 1990 జనవరి నాటికి పూర్తియైనది. పశ్చిమ ప్రాకారము కొంత భాగము, యితర సహజ ప్రకృతి నిర్మాణం కావలసి వుంది. (పటము-65) ఈ ప్రాచీన ఆలయము ప్రారంభము నుండి ఆరాధనలో నుండి యుండెను. కనుక భారతీయ సర్వేక్షణ, ఏన్షియంట్ మాన్యుమెంట్స్ ఆర్కియాలాజికల్ సైట్సు అండ్ రిమైన్స్ ఆక్టు1958అండ్ రూల్సు దేర్ టు, 1959లోని నిబంధనల ప్రకారము, ఆలయ ప్రాచీనత యదార్ధ స్థితికి అనుగుణముగా ధార్మిక వుపయోగము పూజాసంస్కారముల సాంప్రదాయ రీతుల అవిచ్ఛిన్నముగా కొనసాగించుటకై రక్షణ కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వముపై నున్నది. ప్రజలు ప్రత్యేకముగా కూడలి గ్రామవాసులు, నిత్యపూజా క్రమమును పునః ప్రారంభించుటకు వుత్సుకులై నిరీక్షించుచుండిరి. ఈ అంశముల దృష్టిలో నుంచుకొని మూల బెరమును తరలించునప్పుడు కళాకర్షణము యితర అనుబంధిత ప్రకరణములు యథావిధి పాటించితిమి. లోగడ లింగపీఠమును పునర్నిర్మాణ స్థలమునకు మార్చి తాత్కాలికముగా ఆరుబయలను స్థాపించి పూజారులు సాంప్రదాయ విధానమున ప్రతి నిత్యము లింగపూజ, కలశపూజలను కొనసాగించుచుండిరి.

## పునః ప్రతిష్ఠా కార్యక్రమములు :

పునః ప్రతిష్ఠా కలాపమంతయు మూడు దినములు ఆచరింపబడెను. శుక్లనామ సంవత్సర మాఘ బహుళ త్రయోదశి శుక్రవారం (తేదీ 23-2-1990), శ్రవణ నక్షత్రయుక్త మీనలగ్న ప్రదోషకాలమున గం॥ 12-05 నిముషములకు మహాశివరాత్రి పర్వదినమున లింగ ప్రతిష్ఠతో పరిసమాప్తి గావించబడినది. భావి పరిశోధకులకు గాను క్రతు విధానమును యిచ్చట పేర్కొనుచున్నారము.

మొదటి రోజున (21 ఫిబ్రవరి 1990) మాఘ బహుళ యేకాదశి బుధవారం గం॥ 08-05 నుండి వరుస క్రమముగా యీ క్రింది క్రతువుల నాచరించడమైనది. గణపతి పూజ, స్వస్తి వాచనము, మాతృపూజ, ఆచార్య - ఋత్విక్కులకు ఆమంత్రణము, యాగశాలా ప్రవేశము, పంచగవ్య ప్రాశనము, మండప పూజ, భద్రాదేవతాహ్వానము, కలశ స్థాపనము, నవగ్రహ పూజ, మహానీరాజనము జరుపబడెను. సాయంకాలమున 17-00 గం॥ నుండి జలాధివాసము, మృత్సంగ్రహణము, అంకురారోపణము, అగ్నిప్రతిష్ట, దీక్షా హోమము, ప్రదోష పూజ, స్వస్తిపూజ యధాక్రమముగ నిర్వహింపబడెను.

రెండవ రోజున తేది 22-2-1990 గురువారము ఉదయం 8 గంటల నుండి మండప పూజ, జపము, క్షీర తర్పణము, హోమము, మహాస్నపనము, మహానీరాజనము గావింపబడెను. సాయంకాలము గం॥18-00నుండి ప్రదోష పూజ, శయ్యాధివాసము, ధాన్యాధివాసము, పుష్పాధివాసము నిర్వహించిరి. అనంతరము స్వస్తివాచనము, హారతి కావింపబడెను. ప్రతి దినము వేదపారాయణ పురాణ- ఇతిహాస పఠనము మహానీరాజనములను యథారీతిని సాగించిరి.

మూడవ దినమున (23-2-1990) శుక్రవారము మహాశివరాత్రి పర్వదినమున ఉదయం 12-05 లకు మండప పూజ, లింగప్రతిష్ఠ, బలిప్రదానం, పూర్ణాహుతి, మహానీరాజనము జరుపబడినవి. పుష్పగిరి (కడపజిల్లా) మహాసంస్థాన పీఠాధిపతులు శ్రీ విద్యానృసింహ భారతీ తీర్థస్వామివారు స్వయముగా పునః ప్రతిష్ఠా కలాపమును నిర్ణీత శుభముహూర్తమున స్వహస్తములతో గావించి ఆహుతులను ఆశీర్వదించిరి. ఈ కార్యక్రమము కూడలి సంగమేశ్వరాలయ చరిత్రలో మరువరాని మరపురాని ఘట్టము. చాళుక్య నృపులు ఈ ఆలయమును ప్రతిష్ఠింపజేసిరి. రమారమి 14 వందల సంవత్సరముల యనంతరము పీఠాధిపతులు మహారాజాధిరాజుల కన్న మిన్నయైన యోగీశ్వరులు శ్రీ విద్యా నృసింహ భారతీ తీర్థులవారు నిట్టి పునర్నిర్మిత ప్రాచీన ఆలయమున మూలబేరమును పునః ప్రతిష్ఠను తమ కరకమలముచే గావించుట, దేవాలయ- వాస్తు మూర్తి ప్రతిష్ఠా చరిత్రలోనే ప్రప్రథమము. సువర్ణాక్షరాలతో లిఖింపవలసిన అపూర్వ విశేషముగా పాఠకులెరుగుదురు గాక!

లోగడ గర్భాలయ పునాదు లందు 7-10 మీటర్ల లోతున మొదటి స్తరముల (ఫేజ్-1), 19 సె. మీ. యెత్తు గల మరకతలింగమును గూర్చి పేర్కొంటిమి. ప్రధాన లింగమును, పీఠముతో సహా పునః ప్రతిష్ఠించుసమయమున నీ బాలలింగమును (చిత్రము - 9, పటము - 66) తిరిగి పునః ప్రతిష్ఠింపవలెనా? యను చర్చ వచ్చెను. అట్లగుచో యే స్థలమున? ఈ బాలలింగము పగిలియుండినది. దీని మీద పగుళ్ళ తీరును బట్టి ఈ లింగమును ముఖ్యాలయము పూర్తియైన తదుపరి విరుగగొట్టి విసర్జింపబడినటుల తెలియుచున్నది. పుష్పగిరి పీఠాధిపతులున్ను, ప్రధాన యాజ్ఞికులైన సర్వశ్రీ ధారణి సుబ్రహ్మణ్యశాస్త్రి మరియు చేపూరి దత్తాత్రేయశర్మగారలు మహామండపమున చిన్న నంది పీఠమునకు ముందు ప్రతిష్ఠింప తగునని నిర్ణయించిరి. నిర్ణయ సింధు వచనానుసారము యిట్టి భగ్నలింగములు పూజార్హములే కాని గర్భగృహమున మూలబేరముగా ప్రతిష్ఠా యోగ్యము కాదని విద్వజ్జనుల యభిమతముగా నెరిగితిమి.

## అథజీర్ణోద్ధార:

''దగ్ధే భగ్నే చలితే వాకార్యః అయంచ అనాది సిద్ధ
ప్రతిష్ఠిత లింగాదౌ భంగది దుష్టే పి
న కార్యః తత్రౌతు మహాభిషేకం కుర్యాదితి త్రివిక్రమః''

## ఉపయుక్త గ్రంథములు

1. ఐ. కె. శర్మ ''సమ్ యాస్పెక్ట్స్ ఆఫ్ సాల్వేజ్ ఆర్క్యాలజీ ఇన్ ఆంధ్ర ప్రదేశ్'' ఇతిహాస్ (హైదరాబాదు, 1988) (పుటలు 96-101)

నాగార్జున కొండ లోయలో (1956-60) పెద్ద ఎత్తున స్తూపములను, ఆలయములను త్రవ్వి పెలికి తీయుట జరిగినది. కాని వాని పునాదుల వివరములను, వాస్తురీతుల, అచరించిన క్రమము గూర్చిన విపుల పరిశీలన చేయలేదనియే అంగీకరింపవలసి యున్నది. ముఖ్యముగా శైవాలయములను త్రవ్వి కొండ మీద పునర్నిర్మాణము కావించితిమి.

2. యన్. రమేశన్: కాపర్ ప్లేట్ ఇన్‌స్క్రిప్షన్స్, సంపు 1. (హైదరాబాదు 1972) పుటలు 58-60, తుమ్మయనేరు గ్రామము చాళుక్య విషయములో నున్నది. ఈ గ్రామము మహబూబునగర్ జిల్లా దక్షిణ భాగమున నున్నది. ఇచ్చటనే యీ తామ్ర శాసనములు లభించినవి.

దీనిలోనే పుటలు 42-43. ఈ మధ్యనే ఈ ఆలయముల పైని ఫ్రెంచ్ ఇన్‌స్టిట్యూట్ ఇండాలజీ సంస్థ పాండుచ్చేరి వారు వివరములతో నొక గ్రంధమును ప్రచురించిరి. చూడుడు: ఎన్‌స్ప్రె అలంపూర్ ఎట్ శ్రీశైలం (పాండుచ్చేరి 1984) టోమ్-1, పుటలు 20-21, కూడవెల్లి 376-387, పాపనాశి (పుటలు 401-410) చిత్రములు టోమ్ 2. కూడవెల్లి, పటములు 385-412, పాపనాశి పటములు 440-482.

3. ఇండియన్ ఆర్కియాలజీ, 1978-79, ఎరెవ్యూ, పు. 76 నెం. 5 (ఐ. ఎ. ఆర్.)

4. కె. వి. సౌందరరాజన్ ఈ శాసనమును, తూర్పు ఆంధ్రములోని గుహా సముదాయముల లభించిన వీటితో సహా 7 వ శతాబ్ది నాటివిగా నిర్ణయించిరి. చూడుడు: వారి కేవ్ టెంపుల్స్ ఆఫ్ ది దక్కన్ (న్యూఢిల్లీ, 1981). పుటలు 40-41. ఇది సరికాదు. ఇవి విష్ణు కుండినుల కాలము నాటి గుహలని నిర్ధారించిరి. చాలకాలము క్రిందటనే ఆనంద కె. కుమారస్వామివారు నిర్ణయించిరి. ఎర్లీ ఇండియన్ ఆర్కిటెక్చెరు 4 ''హట్స్ అండ్ రిలేటెడ్ టెంపుల్స్'' (ఎడి) మైఖేల్ డబ్లు. మైస్టర్ అండ్ జోసఫ్ రిక్వెర్స్, ఇన్ రిసర్చెస్ (స్ప్రింగ్, 1988) పుట 20-21.

5. బి. రాజేంద్రప్రసాదు: అలంపూరు ఆలయ శైలి చేత సంగమేశ్వరాలయము ప్రభావితమైనదని భావించిరి. పట్టడకల్‌లోని గలగనాధాలయము, సత్యవోలులోని భీమ-రామలింగేశ్వరాలయములలో వలె ఇది 'లాటిన' ఆకారమునకు ఆసక్తికరమగు ఉదాహరణము. ఈ భావన సరికాదు. పూర్వపు ఇటుక ఆలయముల పునాదులు సంగమేశ్వరాలయము, అలంపూరు ఆలయముల క్రింద లభించినవి. (అధోజ్ఞాపిక 15 చూడుము) బి. ఆర్. ప్రసాద్ చూడుము ''టెంపుల్స్ ఆఫ్ లాటిన ఫారం ఎట్ అలంపూరు'' ప్రొఫెసర్ వి. ఎస్. అగ్రవాలా కమెమొరేషన్ వాల్యూం (జె.ఐ యన్.ఓ.) భాగం-2 పు. 53 పాదజ్ఞాపిక 44, 57, 65 మరియు 69

6. ఐ. ఎ. ఆర్. 1976-77, పు. 57 1972-73 పు. 59

7. ఎపిగ్రాఫియా ఇండికా పు: 141, 142, బి. రాజేంద్రప్రసాదు, ''శివా నందీశ్వర టెంపుల్ ఎట్ కడమర కాలువ'' జర్నల్ ఆఫ్ ఇండియన్ సొసైటీ ఆఫ్ ఓరియంటల్ ఆర్ట్, (1975-76 పుట 27-32) పి. వి. పరబ్రహ్మశాస్త్రి యొక్క ఆసక్తికరమైన వ్యాసమును చూడుడు. సత్యవోలు, అలంపురాలలో విష్ణుకుండినులు ఆలయములను నిర్మించిరి. వీనిని కాపాడి వృద్ధిపరచుటలో చాళుక్యులు ఎపిగ్రాఫికల్ నోట్సు "క్రోనాలజీ ఆఫ్ ఎర్లీ చాళ్యుకన్ టెంపుల్స్ ఇన్ ఆంధ్రప్రదేశ్'' ఎపి. ఆంధ్రికా (హైదరాబాదు 1974) పుట 141-142.

8. పి. వి. పరబ్రహ్మశాస్త్రి, శ్రీనివాసరిత్తిగారి సంకలన వ్యాసములు, ఏడికేడ్ ఆఫ్ ఎపిగ్రాఫికల్ స్టడీస్ ఇన్ సౌత్ ఇండియా, (ధార్వాడ్ 1985) పు. 13

9. కె. వి. రమేశ్ "రీసెంట్ డిస్కవరీస్ అండ్ రీసెర్చ్ మెథడ్స్ ఇన్ ది ఫీల్డ్ ఆఫ్ సౌత్ ఏషియన్ ఎపిగ్రఫీ", నోబోరు కరాషిమా (ఎడి), ఇండస్ వాలీ టు మేకాంగ్ డెల్టా (మద్రాస్ 1985) పుటలు 18-24.

10. ఐ. ఎ. ఆర్. 1978-79 పుటలు 39-40, పటములు బి, ఎ, సంగమేశ్వర దేవాలయము, పట్టడకల్‌లో కూడ ఇదే స్థితి. పెద్దరాతి దేవాలయమును, క్రిందనున్న పురాతన యిటుక ఆలయ పునాదులపై నిర్మించిరి. జార్జి మైఖేల్, ''ది సంగమేశ్వర టెంపుల్ ఆఫ్ పట్టడకల్'' ఎ.ఎ. ఆర్. పి. (లండన్ 1972) పు. 47

11. ఆన్యువల్ రిపోర్టు, ఇండియన్ ఎపిగ్రఫీ, 1978-79 బి. 26 పుట-28.

12. ఐ. ఎ. ఆర్. 1978-79 పుట-39, పటము బి.

13. ఐ ఎ. ఆర్. 1978-79 పటము ఎ, పుట - 39, జర్నల్ ఆఫ్ ది న్యూమిస్ మాటిక్ సొసైటి ఆఫ్ ఇండియా (1980) పుటలు 12-7

14. ఐ. కె. శర్మ, ది డెవలప్‌మెంట్ ఆఫ్ ఎర్లీ శైవ ఆర్ట్ అండ్ ఆర్కిటెక్చర్, (న్యూఢిల్లీ 1982) పుటలు 90-92, ఐ. ఎ. ఆర్. 1978-79 పుటలు 116-117, పటము టి. వి. జి. శాస్త్రి,

వీరాపురం ఎ టైప్ సైట్ కల్చరల్ స్టడీ ఇన్ ది కృష్ణా వాలీ (హైదరాబాదు, 1984) అధ్యాయము చిత్రము-12

15. ఇక్ష్వాకు వంశములోని చివరివాడును రుద్రపురుషదత్తుని కాలము (క్రీ. శ. 344) నాటి శాసనమున హలంపురస్వామి ఉదహరింపబడ్డాడు. చూడుడు: ఎపిగ్రాఫియా ఇండికా పుటలు 124-125, కీర్తి శేషులు నేలటూరు వేంకటరమణయ్యగారు పరిగణించిరి. చూడుడు జర్నల్ ఆఫ్ ది మద్రాస్ యూనివర్శిటీ, నెం 2, (జులై 1975) పుటలు 76, 77.

16. టి. వి. జి. శాస్త్రి లోగడ ఉదాహరించినది (1984) పుటలు 73-86 (రెండు నాణెములు)

17. పి. వి. పరబ్రహ్మశాస్త్రి, ఎపిగ్రాఫియా ఆంధ్రికా, (హైదరాబాదు, 1975) పుటలు 141-142.

18. ఐ కె. శర్మ, "ఎపిగ్రాఫికల్ డాటా ఫ్రొమ్ అలంపుర్ టెంపుల్స్ అండ్ ది ష్రయిన్ ఆఫ్ జోగుళాంబ" కె. డి. బాజపాయి (సంకలనం)

జి. సి. పాండె ఫెలిసిటేషన్ వాల్యూమ్ (న్యూఢిల్లీ 1990).

19. బ్రూనో డాజెన్స్, ఆర్కిటెక్చర్ ఇన్ ది అజితాగమ అండ్ ది రౌర వాగమ, ఎ స్టడీ ఆఫ్ టు సౌత్ ఇండియన్ టెక్ట్స్ (పాండిచ్చేరి 1984) పుట 147. యన్. ఎ. హైదరాబాదు సర్కిల్ వారి నుండి సమాచారము. శ్రీ యన్. కొండారెడ్డి, సీనియర్ కన్సర్‌వేషన్ అసిస్టెంటు. ఈ ముఖ్యమైన లేఖనాన్ని గురించి దాని ఫోటో కాపీని పంపినారు.

20. జి. ఆర్. శర్మ, (సంకలనము) తెలంగాణా శాసనములు (హైదరాబాదు, 1968) పుట 214, యం. ఆర్. శర్మ, టెంపుల్స్ ఆఫ్ తెలంగాణా (1972) పుట 57. యాన్యువల్ రిపోర్టు, ఇండియన్ ఎపిగ్రఫీ, 1962-63. బి-209, పుట 73 వేరు కూడల్లగా పేర్కొనిరి.

21. ఎ. ఆర్. ఐ. ఇ., 1962-63 బి-210, హైదరాబాదు ఆర్క్యాలాజికల్ సీరీస్, 19, భాగం పుటలు 71-72,

22. ఎ. ఆర్. ఐ. ఇ. 1962-63, బి-163, పుట 169. ఇందున దేవుని స్పష్టముగ "కూడలి సంగమేశ్వర దేవ'' యని పేర్కొనబడెను.

23. జి. ఆర్. శర్మ (సంకలనము) లోగడ ఉదహరించినది, పుట 170, ఐ. ఎ. ఆర్. 1971-72, పుట 53, ఎ. ఆర్. ఐ. ఇ. 1970-71 పుట 36, బి. 42.

24. ఇచ్చట 'భవన' అను మాటను ఆలయము యొక్క పూర్తి కట్టడమును తెలియ జేయుచున్నది. బ్రూనోడా జెన్స్ (1984) పుట 84.

25. ఎ. ఆర్. ఐ. ఇ. 1962-63, బి 208 పుట 73 మరియు అన్యువల్ రిపోర్టు ఆఫ్ ఎపిగ్రఫీ 1966 (ఆం. ప్ర. ప్రభుత్వము) పుట 58, నెం. 259.

26. ఐ. పి. ఆర్. 1978-79, పుట 77 నం. 5 మరియు ఏ. ఆర్. ఐ. ఇ. 1977-78, పుట 28, బి 26.

27. ఐ ఎ. ఆర్. 1982-83, పుటలు 9-10 మైఖేల్ డబ్ల్యు. మీస్టరు మరియు ఎమ్. ఏ. ఢాకి (సంకలనము), ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ ఇండియన్ టెంపుల్ ఆర్కిటెక్చరు, సౌత్ ఇండియా, (అప్పర్ ద్రవిడ దేశ) సంపుట 1, భాగము-2, (న్యూఢిల్లీ 1986) పుటలు 175-176.

28. పాపవినాశి క్షేత్రమును క్రీస్తుశకము 10-వ శతాబ్ది శాసనము మొట్ట మొదట పేర్కొనుచున్నది. ఏ. ఆర్. ఐ. యి. 1960-61, బి-69 నుండి 71 వరకు కల్యాణి చాళుక్య కాలమునకు చెందిన మరొక శాసనము (శుక్రవారము 2 జూన్ మాసము 1060 వ సంవత్సరం) నాటిది పాపవినాశ తీర్థమును, త్రిభువనశక్తి పండితుని పేర్కొనుచున్నది. ఏ. ఆర్. ఐ. యి. 1960-61, బి 72, పుట 59.

29. బ్రూనో డాజెన్స్ (1984) పుట 35.

30. అజితాగమ, అధ్యాయములు 8 మరియు 10.

31. డా. దేబలమిత్రాగారు సాగ్రహవ (జిల్లా తౌలివాహ, నేపాల్ తారాయ్) యనుచోట దేవాలయ పునాది యిటుకలపై ఆయుధముల చిత్రములుండుట గమనించిరి. ఈ ఆయుధ చిత్రములు దిక్పాలకుల దిక్‌విదిక్కుల చూపు సంకేతములుగా చిత్రింపబడెను. వజ్రము - యింద్రుని ఆయుధము - తూర్పు, శక్తి - అగ్నికి చిహ్నము, ఖడ్గము - నైఋతి, పాశము - వరుణుడు, పశ్చిమము, ధ్వజము - వాయువు గద - కుబేరుడు, ఉత్తరము, త్రిశూలము-ఈశానుడు పునాదులందు ధారణీలు లేక అద్యేష్టకలుగానీ యిటుకలనుంచిరి. డి. మిత్రా "ది రెలిక్స్ ఆఫ్ సాగ్రహవ, ఎ స్టడీ ఆఫ్ ది ఫౌండేషన్ డెపాజిట్స్ అండ్ ది యిష్టికాన్యాస" జర్నల్ ఆఫ్ ది ఆంధ్రా హిస్టారికల్ రిసెర్చి సొసైటీ. XXXIII (హైదరాబాదు 1973-74) పుటలు 4-5.

32. వి. హెచ్. జోషి ''ఏన్షియంట్ ఇండియన్ ఫౌండేషన్ ఇంజనీరింగ్ ఫార్ మాన్యుమెంట్స్'' ఇండియన్ జియో టెక్నికల్ కాన్ఫరెన్స్ (రూర్కి, డిసెంబరు 16-18, 1985) పుటలు 589-93.

33. బ్రూనో డాజన్స్ (1984) పుటలు 29-30.

34. పై గ్రంథము : పుటలు 30-31, అజితాగమము, అధ్యాయము-8.

35. ఐ. కె. శర్మ, బ్రాహ్మణికల్ బ్రిక్ టెంపుల్స్ అండ్ కల్ట్ ఆబ్జక్ట్స్ ఫ్రం ''కేసరిగుట్ట'' కుసుమాంజలి-శ్రీ శివరామమూర్తి స్మృతిగ్రంథము (న్యూఢిల్లీ, 1987) పుటలు 233, 237.

36. టి. గణపతిశాస్త్రి (సంకలనము) ది మాయామత ఆఫ్ మాయముని, తిరువనంతపురము, సంస్కృత మాలిక, (తిరువనంతపురము, 1919) మరియు బ్రూనో డాజెన్స్, మాయమతా, (పాండిచ్చేరి 1970) పుటలు 99-105.

37. డి యన్. శుక్లా, సమరాంగణ సూత్రధార వాస్తుశాస్త్రము (న్యూఢిల్లీ 1965)

38. జాన్ ఇర్విన్ ''ది సేక్రెడ్ ఆన్టిహిల్ అండ్ ది కల్ట్ ఆఫ్ ది ప్రైమార్డియల్ మౌండ్స్'' హిస్టరీ ఆఫ్ రిలిజియన్స్ చికాగో యూనివర్శిటీ, సంపుటి 21, సంచిక 4 (1982) పుటలు 339-360.

39. వి. యన్. గొడ్రియన్, కాశ్యపాస్ బుక్ విస్‌డం, (కాశ్యపజ్ఞానకాండః) (డెన్‌హెగ్ 1965) పుట 63.

40. యె. ఫౌ. బి. జె. కుయిపర్, కాస్మోజెనీ అండ్ కన్సెప్షన్: మేక్వెరీ, హిస్టరీ ఆఫ్ రిలిజియన్స్, సంపుటి 10, సంచిక 2 (1970) పుటలు 91, 138.

41. జె. వి. వాట్సన్, ది డిస్ట్రిబ్యూషన్ ఆఫ్ గోల్డ్ ఇన్‌టెర్మైట్ మౌండ్స్, సాయిల్ సైన్సు, 113, పార్ట్ 5 (1972) పుటలు 317-321.

42. ఎడ్గర్ థర్‌స్టన్. ఓమెన్స్ అండ్ సూపర్‌స్టిషన్స్ ఆఫ్ సదరన్ ఇండియా (లండన్ 1912) పుట 134. చూడుడు : ఇండియన్ ఆన్టిక్వరీ (1876). సంపుటి 5. పుటలు 187-88.

43. బ్రూనో డాజెన్స్ (1984) పుటలు 31-32. 36 మరియు 137.

44. అజితాగమ. అధ్యాయము 10. 2. 8. 12 మరియు 24.

45. కె. వాసుదేవశాస్త్రి మరియు యస్. బి. గదే (సంకలనము) విశ్వకర్మ వాస్తు శాస్త్రము (తంజావూరు-1958) పుటలు 41-42.

46. ప్రియబాల షా (సంకలనము), విష్ణు ధర్మోత్తర పురాణ. మూడవకాండ. (బరోడా 1958) పుటలు 266-267. పి. యె. మంకడ్ (సంకలనము) అపరాజిత పృచ్ఛ ఆఫౌ భువనదేవ. (బరోడా 1950) పుట 375. పి. ఓ. సోంపుర. దీపార్ణవా. (పాలిటాన 1960) పుటలు 178. 180. మరియు విశ్వకర్మ ప్రకాశ. అధ్యాయం శ్లోకములు 34-37.

47. ఆరాధనా స్థలమును దురుపయోగము నుండి. కాలుష్యము లేక అపవిత్ర ఉపయోగము నుండి కాపాడుట.

(16) 1) ఈ చట్టము క్రింద కేంద్ర ప్రభుత్వము వారిచే కాపాడ బడుచున్న రక్షిత కట్టడమున దైవారాధనా మందిరమున్న అట్టిదానిని భిన్నముగా యే యితర కార్యమునకు ఉపయోగింపరాదు.

(2) కేంద్ర ప్రభుత్వమువారు సెక్షన్ 13 క్రింద రక్షిత కట్టడమును పొందినను డైరెక్టరు జనరల్ (భారతీయ పురావస్తు సర్వేక్షణ) కొనుగోలు చేసినను. తీసుకొన్నను. దాన స్వీకారము చేసికొన్నను. లేక కాపాడు బాధ్యతను చేపట్టి. పోషణకు తగు యేర్పాటు చేయునప్పుడు సెక్షన్-5 కనుగుణముగా అట్టి ఆ కట్టడము లేక దాని లోని భాగము ధార్మిక ఆరాధనకు ఏ మతమువారైనను ఉపయోగించు చుండినటుల జిల్లా కలెక్టరు ఆ కట్టడపు స్థలమును లేక దానిలోని భాగమును కాలుష్యము లేక అపవిత్రమగు ఉపయోగము నుండి సంరక్షించుటకై తగిన ఏర్పాటు చేయవలసియున్నది.

48. శ్రీ కమలాకర భట్టు : నిర్ణయ సింధు:— పునః ప్రతిష్టా విధిః తృతీయ పరిచ్ఛేదః (మద్రాసు 1909.) రెండవ ముద్రణ 1986) పుట 282.



# మన పురావస్తు సంపద-సంస్కృతులనెట్లు కాపాడుకొనవలెను

ప్రాచీన కళలకు, పురావస్తు అవశేషములకు మన ఆంధ్ర రాష్ట్రము ప్రపంచ ఖ్యాతి గాంచియున్నది. మన అమరావతి - నాగార్జున కొండల బౌద్ధ అవశేషములు, గుంటుపల్లి, సంకారము, విజయవాడ, ఉండవల్లి, భైరవకోన మొదలగుచోట్లగల బౌద్ధ శైవ - వైష్ణవ గుహాలయములు, వానిపైగల శిల్పములు, ముఖలింగము, ద్రాక్షారామము, భీమవరము (సామర్లకోట) బిక్కవోలు, సత్యవోలు, అలంపురము, లేపాక్షి హేమావతి, పాలంపేట, వరంగల్లు, హనుమగొండ, గోలుకొండ, గుత్తి దుర్గము మున్నగుచోట్లగల చిత్ర విచిత్రమైన శిల్పశోభతో కళానిలయములైన దేవాలయములు, మరింకెన్నో ప్రాచీన అవశేష స్థలములు, కోటలు, నగరములు, ఆంధ్రావనిని విశ్వంలో విశిష్టమైన సంస్కృతికి నిలయమని చెప్పకయే చెప్పుచున్నవి. అన్ని గొప్ప క్షేత్రములు రక రకాల శిల్ప సంపద, వాస్తు కట్టడములు గల రాష్ట్రము, భారతావనిలోనే లేదని చెప్పవచ్చును. దీనికి కారణము మన ఆంధ్ర రాష్ట్రము ఉత్తర - దక్షిణాది సంస్కృతులకు మధ్య దేశమై యుండుట. ఆంధ్రులంతర్గతంగా పెంచుకున్న ఉదారత భాషాభావ సమంజసత్వముపై వారి నడవడులను అర్థం చేసుకొని వారిని తమలో నొకరుగా కొలది సమయంలోనే అకట్టుకోగల ఆవేశము. పుష్కలంగా పండే పచ్చటి పైడి నేలలు చక్కటి నదులు సౌందర్యము నావరించుకొన్న కొండలు, కోనలు మన రాష్ట్ర సంస్కృతికి ప్రాచీన కాలమునుండికూడా ప్రత్యేక మహత్వము నాపాదించినవి. పాత రాతియుగ కాలమునుండి విజయనగరరాజుల వరకు ఎన్నో సాంస్కృతిక సాహిత్య లలిత కళలకు ఓరవడి నిచ్చితన విశిష్టతను పోగొట్టు కొనక కొత్త పాతలమేలు నాకళింపుకొని, ఉత్తర దక్షిణాది సాంప్రదాయములను రెంటిని తనలో యినుమడించుకొన్న యిప్పటి ఆంధ్రప్రదేశము, అనగా మన ప్రాచీన - ఆంధ్ర సాతవాహన సామ్రాజ్యము మహోన్నతమైనది. తెలుగు సంస్కృతి, తేటతెనుగు, నదీ తీరములు గోదావరి, కృష్ణా, పెన్నలలో పండిన సాంస్కృతిక పరమైనమేలు పంటలు ఎంతటి విశిష్టమైనవో శ్రీ అప్పయ్య దీక్షితులవారు (క్రీ. శ. 16-వ శతాబ్ది) చెప్పిన వాక్యాలు మననం చేసుకొంటే చాలును.

''ఆంధ్రత్వం, ఆంధ్ర భాషాచ ప్రాభాకర పరిశ్రమ : తత్రాపియ జుషీ శాఖా నాల్పస్య తపన : ఫలమ్''

ఆంధ్రత్వము, ఆంధ్రభాష, భట్ట ప్రభాకరుని పాండిత్యము అందులో యాజుషి శాఖలో పుట్టడము పూర్వ జన్మఫలము, ఇదియే దీక్షితులవారి చరమవాంఛ. పంచాక్షరీ మంత్రముతో (అనగా ఓం నమః శివాయ సిద్ధం నమః) 'వోనమాలు' ప్రారంభించే సంస్కృతి ప్రపంచంలో మరే జాతికిలేదు. మహత్తర శైవక్షేత్రములతో "త్రిలింగ దేశముగా పవిత్రమైనది భూమి. సుసంపన్నమైన సాంస్కృతికి వారసత్వమూ, గర్వింపదగిన చారిత్రిక వైభవమూ గల పురాతన జాతి తెలుగువారిది. అట్టి సంస్కృతికి చిహ్నములైన పురావస్తు, వాస్తు కట్టడములను శిల్ప శిలా శాసన యవశేషములను నుద్ధరించి కాపాడుట, భద్రపరచుట ప్రతియాంధ్రుని కర్తవ్యము. ఈ మహత్కార్యము కేవలము ప్రభుత్వ సంస్థలవలననే జరగదు. ప్రజలు ముఖ్యంగా యువతీ యువకులు కళాశాల విశ్వ విద్యాలయ సంస్థలు, అధికారులు ఎంతగానో తోడ్పడవలసియున్నది.

## పురావస్తు అవశేషములు, ప్రాచీన కట్టడములందు తీసుకొనవలసిన జాగ్రత్తలు :

మనకున్న వాస్తు సంపద పెక్కు రీతులకు చెందియున్నది. గోలుకొండ, వరంగల్లు, రత్నగిరి, గుత్తి, పెనుగొండ, చంద్రగిరి మొదలగు పెద్ద పెద్ద ప్రాచీన కోటలలో నున్న శిధిల కట్టడములు, ముఖ్యంగా దేవాలయము

లున్నవి. ఇవి కాకతీయులు తరువాత చాళుక్యులు, రెడ్డి నాయక రాజులు, విజయనగరాధీశుల కాలములలో మహోన్నత స్థితిలో వెలసిల్లి యీనాడు శిథిలావస్థలో నున్నవి. చూడవచ్చిన వారికి ఆనాటి చరిత్ర వైభవాలను స్మరింప చేస్తాయి. చంద్రగిరి, గోలుకొండ చాల విశాలమైన శిథిలములైన రాజ గృహములు, కోటగోడలపై చెట్లు, ముళ్ళ కంపలు పనికిరాని వెన్నో మొలుస్తూ ఒక్కొక్కప్పుడు యీ కట్టడములలోనికి అంతర్గతంగా వ్యాపించి గోడలు పడిపోవుట కూడ గలదు. వీటిని మొదట్లోనే తీసివేయడము సంవత్సరమున కొక పర్యాయము వీనిని పూర్తిగా నిర్మూలించడము మంచిది. ఈ కార్యక్రమము, విశాలమైన స్థలములు. కొన యే కొద్ది మంది డిపార్టుమెంటు పనివారి వల్ల సాధ్యం కాదు. స్వచ్ఛంద సేవాదళాలైన ఎన్. ఎస్. ఎస్. విద్యార్థి బృందాలు సెలవు దినాల్లో తోడ్పడి యిట్టి పనులు చేయడం యెంతైనా అవసరము. ఈ మొక్కలు నిర్మూలించడమే కాక, కోటలోని వివిధ ప్రాచీన కట్టడములకు మార్గములు వేయుట చదును చేసి చూడవచ్చిన వారికి యిబ్బంది లేకుండా పరిసరములను శుభ్రముగా నుంచుట మొదలగు పనులను చేయవచ్చును. యువతీ యువకులు ఉత్సాహవంతముగా యిట్టి పనులు నిర్వర్తించినచో మన ప్రాచీన కట్టడము లెంతగానో శోభిస్తాయి. వాటిని గూర్చి తెలుసుకోవచ్చు. నలుగురికి తెలియజెప్పి ఆత్మతృప్తి పొంద వచ్చును కూడ

## ప్రాచీన శిల్పములు: దేవాలయ గోడలపై పేర్లు చెక్కుట

ఆంధ్ర ప్రదేశములో ముఖ్యంగా పూజలోనున్న దేవాలయములన్నింటిలోను, ప్రాచీన అవశేషములపైన, కట్టడములపైన చూడ వచ్చినవారు తమ పేర్లను చెక్కడము ఒక పెద్ద జాడ్యమై పోయినది. చక్కని అమరావతి శిల్ప కళాఖండముపై తెలుగులో పేర్లెన్నో చెక్కి పాడు చేశారు, శిల్పాలను ముగ్గు చేయడముకూడ కలదు. అల్లే కేశవపల్లి (గురజాలవద్ద) శాసన శిల్ప చంద్ర శిలపై నొక పెద్ద మనిషి తన పేరు, డిగ్రీకూడ చెక్కుకున్నాడు. ఇక చార్మినారు చంద్రగిరి, మహలులోనున్న చక్కటి సున్నపు శిల్పముగల గోడలపై యిట్టి వ్రాతలు చూచినచో మనమెంత సంస్కార హీనమైన పనులు చేయువారమో తెలియుచున్నది. ఈ మహత్తర చారిత్రక కట్టడముల కిట్టి గతి పట్టవలెనా? నిర్మించిన మహారాజులు, దాతలెవరో తెలియక చరిత్ర కారులు పురావస్తు వేత్తలు తర్జన భర్జనలతో తీరని వాగ్యుద్ధాలలో నున్నారు. చూడవచ్చిన మన యిప్పటి చదువు కొన్నవారు తమ పేర్ల నీ విధంగా గోడలపై లోతుగా గోకివేస్తున్నారు. అక్కడ ప్రభుత్వము పెట్టిన యే యిద్దరు - ముగ్గురు కాపలాదార్లు యెంతమందినని మందలిస్తారు. చిత్రమేమన యిట్లు చేశేవారందరు చదువుకొన్నవారే. 14 యేండ్ల వయస్సు నుండి 50 యేండ్ల వృద్ధులు వరకునూ వుద్యోగస్తులు, డిగ్రీలు పొందినవాండ్లు కూడ, ప్రతి యువతీ యువకులు యిట్టివారిని గట్టిగా మందలించాలి. మన జాతి సంస్కృతి చిహ్నాలైన వీనిని యిట్టి చేష్టలతో నాశనము కావింపరాదు.

## కొన్ని సంస్థలు: దేవాలయ ట్రుస్టీలు:

వీరు ప్రాచీన దేవాలయ వాస్తువును పాడుచేయు విధానాన్ని చూస్తే మరింకెన్నో సంవత్సరాలు యివి ఉంటా యని చెప్పజాలము.

అలంపురముననున్న నవబ్రహ్మ దేవాలయములు చూడ చక్కని శిల్పములతోనేగాక మహత్తర క్షేత్రమై ఒకప్పుడు వాతాపి చాళుక్యుల దేవాలయ నగరమై శోభిల్లినది. (క్రీ. శ. 7-8 శతాబ్ది) ముఖ్యముగా బాలబ్రహ్మాలయము అందులోని జోగుళాంబతల్లి ఉత్కృష్టమైన ఆరాధ్యదైవము, ఇచ్చటి దేవాలయ వాస్తువు ప్రపంచ ఖ్యాతిగాంచి యున్నది. కాని మూఢభక్తి, లేనిపోని విశ్వాసాలు, ఆచారాలు, సంవత్సరములో వచ్చే పండుగల దినాలలో గోడలపై

సున్నము - రంగు కొట్టడమే గాక దేవతామూర్తులకు, శిల్పశోభితములైన స్తంభములకు రంగులు వేయడము, ఎంత చెప్పినా మానుటలేదు, వంటశాలలకు నిత్యంగా కావలసిన వంటచెఱకు ఎండబెట్టడానికి కూడ బాల బ్రహ్మేశ్వరాలయపు కప్పే శరణ్యము. ఈ అంగాలయము నానుకొని సిమెంటు గోడలతో కొట్టు కట్టించినారు.

పైగా చూడవచ్చిన వారి సౌకర్యార్థము స్నానపు గదులు, మరుగుదొడ్లు, అలంకరణ గదులు, దేవాల ప్రాంగణములోనే కావలెనట. తుంగభద్రానది కోట గోడలవద్దనే నిర్మింపబూనిరి. ఇంతకన్న ప్రాచీన కట్టడములపై మనము చేయ సంకల్పించిన దౌర్జన్యం మరేముంది? పైగా దేవాలయ ప్రాంగణములో కొన్ని అర్వాచీనముగావున్న దర్గాలు కలవు. నిత్య పూజలు, ఉర్సులు జరగటం ఆచారము. అంతటికే పరిమితమైయుంటే ఎంతగానో సంతోషించవలసినదే! శిధిలావస్థలోనున్న యిచ్చటి తారక బ్రహ్మదేవాలయాన్నే స్థలభ్రష్టం చేయవలెనని కోరుతున్నారు. ఎన్నిచట్టాలుచేస్తే వీరిని ఆపగలము. మనం ప్రజలకు తెలియ జేయాలి. సామాన్య ప్రజ, అందులోను పల్లెలోని మనవారు చాల మంచి వారు. వారెన్నటికి యీ ఘాతుకాలను తెలుసుకొంటే చేయనీయరు కానీ చదువుకొన్న కొద్దిమంది, వారు సంఘ సేవయనే పేరుతో స్వాభిమానము, సంఘ బలము, అధికార దాహము, యట్టి సమాజ వ్యతిరేక పనులను చేయిస్తున్నారు. దీనికి పేద - మధ్య తరగతి ప్రజలవద్దసొమ్ము గడిస్తారు. వారు చేసే పనులు ఎంత దురదృష్టకరములో యీ యిచ్చేవారికి పాపం తెలియదు.

ఇటీవల కొన్ని సంవత్సరాలుగా నా విధి నిర్వహణలో కొన్ని సంఘటనలను చూచాను. వాటిని అందరూ తెలుసుకొంటే కొంతవరకైనా యీ ప్రాచీన శిల్ప వాస్తువుల నుద్ధరింప తోడ్పడగలరని మా యభిప్రాయము.

మూఢ నమ్మకాలు, ఆచారాలు ప్రాచీన వాస్తువును శిల్పాలను ఎంతగా చెరుపు చేస్తాయో మరి రెండు మూడు నిదర్శనములను చూపుతాను. సత్యవోలు (ప్రకాశం జిల్లా) లోని రామలింగేశ్వరాలయములోని శిల్పము నెట్లు రంగు పూసినారో! శాసన స్తంభముపై పేరెట్లు తెలుగున వ్రాసియున్నదో? ఇదే జిల్లాలోగల భైరవ కోనలోని మహత్తర శిల్పములుగల మూడంతస్తుల గుహాలయ సముదాయమును చూడుడు. ప్రతి సంవత్సరం సున్నపు పూతపూసి శిల్పములు పగుళ్లు బారినవి. సున్నపు ఘాటుకు శిధిలమగుతున్నరాయి మరింత త్వరగా జీర్ణమైపోతున్నది. మేమీ సున్నపు పూత నెంత జాగ్రత్తగా తీసివేయ ప్రయత్నించినా పలుచోట్ల శిల్పాలలో అంతర్గతమై పోయినది. విజయవాడ సమీపముననున్న ఉండవల్లి గుహాలయములకు గూడ నిట్టి గతియే పట్టినది. ఈ మహత్తర గుహాలయములు క్రీ. శ. 7-8 శతాబ్దిని ఆంధ్రమును పాలించిన విష్ణుకుండిన, తూర్పు చాళుక్యుల కృతములు.

## జీర్ణ దేవాలయాల ఉద్ధరణ

పూర్వ కాలమున జీర్ణించిన దేవాలయములను పాలకులు, దాతలు పునరుద్ధరించుట కద్దు. అట్టి కృత్యములలో పురాతన వాస్తు శైలికెట్టి లోపము కావించువారుగాదు. దాని నర్థం చేసుకొని శిలలపైనున్న శాసనములను సహితము అతి జాగరూకతతో మరల చెక్కించెడివారు. ముఖ్యంగా చోళమహరాజులు నిర్మించిన తంజావూరులోని రాజరాజేశ్వరాలయము దీనికి నిదర్శనము. అట్లే శిలామూర్తులు, పంచలోహపు వుత్సవమూర్తులు ఏ కారణంగానో విరిగి లేక చిద్రమైన పూజకు అర్హములుకావు. విసర్జించెడివారు. వీనికి బదులుగా కొత్తవాటిని చేయించుటలో నెంతో ఆసక్తి, యాచారము ప్రకారము, మూర్తి లక్షణమునకెట్టి లోటు రానీయక శాస్త్రరీతిగా చేయించెడివారు. కొద్దిగా భగ్న మైన మూర్తిని పారవేసెడివారుగాదు. జీర్ణోద్ధరణ చేయుటలో యెంతో నేర్పు జాగ్రత్తలను చూపెడివారు. ఇటీవల త్రవ్వకాలలో అమరావతి స్తూపప్రాంతమున నాకొక బోధిసత్వ పద్మపాణి విగ్రహము లభ్యమయినది. యజ్ఞోపవీతము, వక్షస్థలముపై కొంత అరిగిపోయిన భాగములను గచ్చుతో పూరించిరి. కాని తరువాత ముఖము, కాళ్ళు విరిగి పోయినది కాబోలును విసర్జించివైచిరి.

ఇటీవల కొద్ది దశాబ్దాలుగా పెద్దపెట్టున, అధికార, అనధికార సంస్థలు దక్షిణాదిన నాటుకోట చెట్టియార్లు ప్రాచీన హిందూ దేవాలయములను పునరుద్ధరించుచున్న తీరు గర్హింపవలసియున్నది.

శ్రీశైలమున అనవేమారెడ్డి కట్టించిన వీరశిరోమండపము, యిప్పుడు కళ్యాణ మంటపమైనది. పాత రాళ్ళు శాసనములున్నవానిని కూడ ముక్కలు గావించిరి. గజపతిరాజు కపిలేశ్వరుని శాసనము నశించిపోయినది. కాకతీయుల నిర్మితములైన అంగాలయములను పూర్తిగా రూపుమార్చి ఎండోమెంటువారు ఆఫీసులుగా వాడుచున్నారు. గర్భాలయపు ముందున్న మండపముపైన విజయనగరరాజు దేవరాయని శాసనముండెడిది. పూర్తిగా తుడిచి వేసినారు. ఇదివరలో ఈ శాసనము ప్రచురితమైనది. అందువల్ల దీని ప్రాముఖ్యత కొంతైనా, తెలిసికొనగలిగాము. అట్లే తిరుపతిలోని వెంకటేశ్వర విష్ణు దేవాలయమున గూడ పూర్తిగా సిమెంటుతోకట్టి, గోడలకు రంగులు పులిమి విద్యుద్దీపాలంకరణతో ప్రాచీన వాస్తువును, శిల్పాలను కప్పివేశాను. ఒంగోలు చేరువగానున్న ఉప్పుగుండూరను గ్రామములో శిథిల బౌద్ధ అవశేషములున్న చేనుకలదు. ఇచ్చట పెద్ద యిటుకలు, సాతవాహన, ఇక్ష్వాకుల కాలమునాటి క్రీ. శ. 1-3 వ శతాబ్ది మట్టి పాత్రలు తెల్లరాయి శిల్పములు, శిథిల స్తంభములు కానవచ్చుచుండును. రెండు దశాబ్దాల క్రితం యిచ్చోటనే రెండవ ఇక్ష్వాకు మహారాజగు వీర పురుష దత్తుని 20 వ రాజ్య సంవత్సరములో నొసగిన దాన శాసనము కలిగిన బౌద్ధ ఆయక స్తంభ మొకటి బయట పడినది. శ్రీ రావిప్రోలు సుబ్రహ్మణ్యంగారు ఈ సంగతి తెలిసిన వెంటనే ఆ స్థలమున దొరకిన బుద్ధమూర్తులను మ్యూజియమునకు తరలించిరి. కాని శాసన స్తంభము పెద్దదియగుటచే, అప్పట్లో దాని ప్రతిరూపమును మాత్రము తీసి ప్రచురించినారు. తర్వాత కొద్ది నెలలకు ఆ స్తంభమును గొనివచ్చునుద్దేశముతో మరల యచ్చటికి పోయిరి. అప్పటికే ఆ చేనుగల ఆసామి దాన్ని సమూలంగా నుగ్గుచేసినాడు, ఈ విధంగా మరింకెన్ని చోట్ల శాసనములున్న రాళ్ళు, లోహపు వస్తువులు రూపుమాపుచున్నారో చెప్పజాలము. ఇట్టి పనులు కేవలము తెలియక చేసినవికావు.

## ఆలయంమీద సున్నపు పూతలు

ఇక శ్రీకాకుళం జిల్లాలోని ముఖలింగము ఇది ప్రాచీనంగా శాతవాహనుల కాలంనుండి (క్రీ. శ. 2 వ శతాబ్ది) గొప్ప పట్టణముగా నుండెడిది. ఇక్కడ తూర్పు గంగ వంశీయులు (క్రీ. శ. 8 వ శతాబ్దినుండి 11 వ శతాబ్ది), కట్టించిన దేవాలయములు మెండు. దేవాలయ పట్టణమిది. ఆంధ్రరాష్ట్రములోనే యింత చక్కని దేవాలయ సముదాయము లేదనే చెప్పవచ్చును. మహత్తర శిల్ప శిలాఖండమైనది. యిందలి మధుకేశ్వరాలయము 1973 లో నేను మొదట్లో చూచినప్పుడు, దేవాలయ గోడలన్నింటిపైన, శిఖరములపైన 20 సెంటిమీటర్లు మందమైన సున్నపు పూతతో నిండి యుండినది. వంటశాలని, వాహనశాలలని, పూజారులకని, పెళ్ళిళ్ళు చేయడానికని రకరకాల సిమెంటు కట్టడాలను. ప్రాచీన వాస్తువును, శిల్ప విశేషాదులను పూర్తిగా మరుగుపరుస్తూ కట్టివేశారు. ఈ నూతన కట్టడముల బరువువల్ల శిఖరములు దెబ్బతిన్నవి కూడ. నేను గ్రామస్తుల, గ్రామాధికారుల, ఎండోమెంటువారి సహకారముతో యిట్టి సిమెంటు కట్టడములను కాంక్రీటు గోడలను తీసివేశినాను. ఇచ్చట కానవచ్చు శిల్ప శోభ, భారతరామాయణ గాథలతో, శైవమూర్తులతో భూతలకైలాసమే యనిపించునంతటి చక్కని దేవాలయముగా మారిపోయినది. ఇప్పుడు బాపట్లలోని భావనారాయణస్వామి దేవాలయ శిఖరముపైనికూడ నిట్టి కార్యక్రమము చేపట్టినారు,

యీ విధంగానే గోదావరిజిల్లాలలోని పంచారామములైన ద్రాక్షారామము, భీమవరములోనున్న చాళుక్య భీమేశ్వరాలయములు ఇటీవల రెండు శతాబ్దాలలో యెన్ని విధాల ప్రాచీన వాస్తువును కప్పివేసినారో చెప్పజాలము. నేలపై మొసైక్ చలువరాతి పరుపు, శిల్ప స్తంభాలపై రంగు పూతలు, వంట గదులు, కల్యాణ మండపాలనే పేరుతో సిమెంటు

నిర్మాణములు దేవాలయ కమిటీ కార్యాలయ బిల్డింగులు కట్టబడినవి. అసలీ దేవాలయముల నిర్మాత మహారాజు చాళుక్య భీముడు (క్రీ. శ. 892-921). ఈ సామ్రాట్టు విశాలమైన ఈ విశిష్ట నిర్మాణములను చేసే ముందుగా నవియెట్లుంత వలెనో ఒక చక్కని రాతినమూనాను మలపించెను. ఇవి ముఖ్య దేవాలయ ప్రాంగణములో యీనాటికిని వున్నవి. దేవాలయములు ఈరీతిని వుండవలసినవన్న మాట. తానొనరించిన యీ మహత్తర దైవ గృహములను తన తరువాత వారు జాగ్రత్తగా భద్రపరచి రూపు మార్చుటకు వీలు లేకుండా చేయవలెననియే ఆయన వాంచ కాబోలు. గజపతి, విజయనగర రాజుల కాలమున గూడ వీటి వాస్తు శోభ తరుగలేదు. ఆ తరువాత అధోగతి పొందినవి. ఈ శతాబ్దిలో మనము ఈ చిన్నరాతి దేవాలయ నమూనాలను కూడ విడువకుండా పాడు చేశాము. వలదన్నా విడవకుండా ఈ నమూనాలకు సిమెంటు పూత దేనికి పూసినట్లు. చక్కని శిల్పాన్ని అధిష్ఠానమును కప్పి వేయడము దేనికి? భారత పురావస్తు శాఖ యెన్ని విధాల చెప్పినా కేవలమవి కాగితాల తాఖీదులుగానే వుండి పోతున్నాయి. దేవాలయ సంస్థలు వివరము తెలియని ప్రజలు, నమ్మకాల నాధారంగా చేశికొని యిట్టి కార్యక్రమములను కొన్ని దశాబ్దాలుగా చేసినారు. ఇప్పుడు చేస్తున్నారు. ఇక మీదన్నా యిట్టివి జరుగ కూడదు. వీనిని కాపాడటము ప్రతి పౌరుని కర్తవ్యము గదా? ప్రజలకు తెలియ చెప్పవలసి బాధ్యత అందరిదీను.

## ఆలయ ప్రాంగణాల దుర్వినియోగం

ఇంకను కొన్ని చిత్రమైన మనవారి పోకడలను తెలియ జెప్పుతాను. ఒకానొకప్పుడు చుట్టు ప్రక్కల గ్రామము లందలి ప్రాచీన దేవాలయముల నుండి మహత్తర శిల్పాలను, వాటి చారిత్రక పురావస్తు స్థలముల నుండి పెకలించి తీసికొని వచ్చి జిల్లా లైబ్రరీ గోడలలో నమర్చినారు ఇది అనంతపురము పట్టణ మధ్యలో నున్న గ్రంధాలయము. ఈ విధంగా మరింకెన్ని చోట్లనో జరిగినది. మధ్యభారతంలో మరొకచోట. రత్నపురము, బిలాసపూరు జిల్లా, పి. డబ్ల్యు. డి. వారు దేవాలయ రాళ్ళతోనే నొక కాలువ వంతెనను కట్టినారు. కాని ఆ యింజనీరుని హర్షించక తప్పదు. దేవతామూర్తులను పాడు చేయకుండా వెలికి కనుపించే విధంగా గోడలలో నమర్చినాడు. కాలవలో పారే నీరు యీ విగ్రహాలను శుభ్రం చేస్తున్నాయి.

ఇక ప్రాచీన గుహాలయములు, దేవాలయ ప్రాంగణములో నున్న స్థలాలలో పాకలు వేసుకొని నివసించుటకద్దు. చుట్టు ప్రదేశాన్ని బయలు భూమిగా ఉపయోగిస్తున్నారు. ముఖ్యంగా విజయవాడ నగరములో గల ప్రాచీన గుహాలయములు అక్కన్న మాదన్న మొగల రాజపురము మున్నగునవి ప్రబల నిదర్శనములు గుహాంతర స్థలములందే నివశించుచున్నారు. కొండల నంతను పి. డబ్ల్యు. డి. వారు కొట్టించిపైని రోడ్డు వేయుటయేగాక, రోడ్డురాయి కోసము గుహాలను కూడ కొన్నింటిని దెబ్బ తీశారు. మహత్తర కృతములైన ఈ విష్ణుకుండిన తూర్పు చాళుక్యుల (క్రీ. శ. 6-8 శతాబ్ది గుహాలయముల కిట్టి గతి పట్టవలెనా? పూర్తిగా శిధిల రూపమున చూడవచ్చిన వారికి విషాదమైన గాథలు గోచరిస్తున్నాయి. గుడివాడలోని బౌద్ధ స్థూప స్థలముపై గోతులు త్రవ్వి, ఇళ్ళు కట్టుచున్నారు.ఇటీవలనే. వీటిని తొలగించవలసిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వము రెవిన్యూ శాఖవారిది. ఆయా జిల్లా కలెక్టర్లే కదా. ప్రాచీన సంస్కృతి పురావస్తు స్థలములను భద్రం చేయవలసినవారు. వీరందరు కూడ నిస్సహాయులుగా నున్నారు.

ఇక అమరావతి మహా స్థూపమును గూర్చి చెప్పవలెనన్న చోటే చాలదు శిల్పాలన్ని ముగ్గయి పోయినాయో? దేశాన్నుండి దాటింపబడినవి కూడ. స్థూప స్థలాన్ని ఒకప్పుడు పెద్దగొయ్యిగా త్రవ్వి వేసినారు. 18 వ శతాబ్దిలో నొక్క జమీందారుగారు ఒకప్పుడు మహా పట్టణమైన ధరణికోట గోడలు ప్రజల కిప్పుడు పాటిమట్టిగనులు త్రవ్వి నాశనము

చేస్తున్నారు. పందిపెంట, ఎరువు కుప్పలు గుంటలుగా వేస్తున్నారు. కొంతమంది గ్రామవాసులు, అమరావతి, ధరణికోట, ఘంటసాల వారు తమ యిండ్ల వాకిండ్ల ముందు, మెట్లపైన, అరుగులపై, గోడలలో మహత్తర శిల్పము లున్న రాళ్ళను పొదిగి వేసినారు. వారు సహృదయంతో ముందుకు వచ్చి సహకరించిన యెడల వాటినన్నింటిని భద్రం చేసి జిల్లా కొక పురావస్తు శాలను యేర్పాటు చేయవచ్చును గదా!

కర్నూలు నగరము మధ్యలో ఒక పెద్ద బురుజు వుంది. ఇది చరిత్ర ప్రసిద్ధికల కందేనవోలు కోటలోని భాగము. కొండారెడ్డి బురుజుగా ఖ్యాతి చెందినది. సినిమా వారు మునిసిపాలిటీ వారి ఆశీర్వాదంతో పోస్టర్లన్నీ ఈ ప్రాచీన కట్టడముల పైననే అతికించి వేస్తున్నారు. ఈ కట్టడముల శోభ పూర్తిగా చెడిపోతోంది. అట్లే తిరుపతి దేవాలయ సంస్థ కొన్ని పూజలున్న దేవాలయముల జీర్ణోద్ధరణలకై డబ్బు యివ్వటం జరుగుతోంది. ఈ ఉద్ధరణ పేరుతో ప్రాచీన వస్తువు నర్ధంచేసుకొని కట్టడమటుంచి, చోళ, విజయనగర, నాయిక గోపురాలపై నున్న రాతిగచ్చు బొమ్మలను మన ఇప్పటి రూపాలతో వేషభూషణాదులతో వికృతం చేస్తున్నారు. తిరుపతిలోని మంగాపురమున గల శ్రీ వెంకటేశ్వర విష్ణు దేవాలయాన్నీ విధంగా పెద్ద ఎత్తున సిమెంటుతో బాగుచేసి దేవాలయ శిఖరమును, గోపురమును రంగుతో స్ప్రేచేసి విద్యుత్తీగలతో నింపివేశారు. చీలలు కొట్టి శిల్పశోభితములైన రాళ్లను చెరుపు చేయడము నిత్యకృత్యములై పోయినవి. ప్రాచీన శోభ పూర్తిగా పోయి ఆధునాతన తారలవలెనున్న బొమ్మలతో దేవతా స్వరూపాలు గోచరిస్తున్నాయి.

మహత్తరమైన లేపాక్షి, సోంపల్లిలను (అనంతపురం జిల్లా) చూడుడు. ఈ దేవాలయముల గోడలపైని, స్తంభాలపై శిల్పములేగాక విజయనగర రాజుల కాలంనాటి చిత్రలేఖనముగల కప్పుతో ప్రపంచ ఖ్యాతిగాంచినవి. ఆరాధనలో ఉన్నవి కూడా లేపాక్షి చిత్రకళ గలిగిన ఈ కప్పు గోడలు నల్లగా యెర్రగా పోయినవి. కారణము నిత్యము ముచ్చట వెలిగించబడే కొన్ని కిలో గ్రాముల హారతి కర్పూరము ఇప్పుడు లభ్యమయ్యే కర్పూరం కల్తీదేగదా, ఆ పొగ చిత్రితములైన రంగులను నల్లగా కప్పివేస్తున్నది. వేడికి పాతగచ్చు పెచ్చెలు, పెచ్చెలుగా రాలిపోవు చున్నది. పురావస్తు శాఖ రసాయిన విభాగం వారు చేసే కృషి వాటిని గట్టిపరచి, నల్లగా పొగచూరును కడిగివేసే రసాయనములు అగ్నిలో పోసిన ఆజ్యములే కదా! మనమెప్పుడు తెలుసుకొంటాము. యువతీ యువకులారా మీరే యీ మన పురావస్తు సంపదను కాపాడాలి. ఈ గొప్ప కళా సంస్కృతులను జాగ్రత్త చేయండి.

ఇప్పటి లాంటి మహత్తర కృత్యములను వాస్తు కట్టడాలను చేయలేము గదా! వున్నవాటిని ఉన్నట్లు రక్షించు కొనడానికైనా పాటుపడవలసియున్నది. భారతీయ పురావస్తు శాఖ కృషికి చేయూతనిచ్చి తోడ్పడండి. ప్రజలను పెడదారినపెట్టి మూఢ నమ్మకాలు, ఆచారాలను చూపి, రాజకీయ మతవైషమ్యాలను రేకెత్తించే వారిని అట్టి సంస్థలను మన ప్రాచీన సంస్కృతి సంపదలపై చేయి వేయనీయవద్దు. స్థల వైభవాలను, ప్రాచీన అవశేషములైన, శిల్ప శిలా శాసన ఖండాలను బయటకు చేరవేయవలదు. వాటిని ఆయా గ్రామములలోనే భద్రం చేయండి. మీ గ్రామాధికారులకు తెలియ చేసి, తహశీలుదారు వారికి, జిల్లా కలెక్టరు వారికి చెప్పమనండి. ఆ పైని హైదరాబాదులోని భారతీయ పురావస్తు సర్వేక్షణ, యవ్య విభాగము వారికిగాని, ఆంధ్ర ప్రభుత్వపు, పురావస్తు శాఖ డైరెక్టరు వారికిగాని వ్రాయండి

ముఖ్యంగా పాఠశాలల, కళాశాలల విద్యార్థులు, ఉపాధ్యాయులు, చదువు సంస్కారమున్న ప్రతి పౌరుడు తన రాష్ట్ర పురావస్తు సంపదను జాగ్రత్త చేయడంలో ఎంతటి శ్రమకైనా వెనుకంజ వేయవలదు. ప్రాచీన శిధిలాలు మనజాతి ఆభరణాలు. మన సంస్కృతికి ప్రతిబింబాలు. వాటి సంరక్షణ మన ముఖ్య కర్తవ్యము.

# పురావస్తు సంపద సంరక్షణ : కొన్ని బాధ్యతలు

ఆంధ్ర పత్రిక 1987 జూన్ 28 దినపత్రికలో వెలువడ్డ శ్రీ పియస్సార్‌గారి వ్యాసము "పురావస్తుశాఖ ప్రజలకు ఎంతవరకు తోడ్పడుతూంది?" చదివి ఆనందించితిమి. వారు పురావస్తు శాఖపై కొన్ని సద్విమర్శలను చేసినారు. మరికొన్ని విమర్శలకు వివరణ ఆవశ్యకమని తోచినది.

స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత భారత ప్రభుత్వ పురావస్తు సర్వేక్షణ పెక్కు నూతన కార్యక్రమములను బాధ్యతతో నిర్వర్తించినది. ఆంధ్రమున ముఖ్యంగా నాగార్జున కొండ, అమరావతి, పెద్దవేగిలలో పెద్ద పెట్టున పరిశోధనలు జరిపి ఎన్నో నూతన విషయాలను వెలికి తీయడం జరిగినది. చక్కని పురావస్తు ప్రదర్శనశాల లిచ్చోట్ల నిర్మింపబడినవి. మరింకెన్నో పురావస్తు స్థలములను పరిశీలించడము జరిగినది యెప్పటి కప్పుడే విషయములను వార్తా పత్రికలతో ప్రచురించుటయేగాక, "ఇండియన్ ఆర్కియాలజీ ఏ రివ్యూ," అను సంవత్సర సంచికలో సచిత్ర వ్యాసములతో వివరించటము జరుగుచున్నది. ఈ రివ్యూ 1953-54 సంవత్సరము నుండి నిరంతరము వస్తూనే వున్నది. తెలుగులో లేనందున కాబోలు చాలమందికి తెలియదు. కాని యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్‌వారు పాఠ్య గ్రంథములను తెలుగున చేయుచున్నారు గదా! పూనా విశ్వవిద్యాలయమునకు చెందిన డా॥ మూర్తి తెలుగున 1972 లో ''ప్రాక్‌చరిత్ర'' యను గ్రంథమును వ్రాసినారు. తెలుగు అకాడెమీ ప్రచురించినది. ఇటీవల ప్రపంచ తెలుగు మహా సభలలో చాల తక్కువ ఖరీదులో మన తెలుగు సంపద సంస్కృతుల, పురావస్తు, శాసన, చరిత్ర, గ్రంథములు సావనీరు ప్రచురించి యున్నారు కదా! మరింకెన్నియో చిన్న చిన్న పుస్తకములుగా నాగార్జున కొండ, అమరావతి కొండాపురములనుగూర్చి, గైడ్ బుక్కులు వచ్చియున్నవి. ఇవన్నీ వున్నను, మరింకెన్నో సామాన్య ప్రజలకు ఉపకరించేట్లు సులభ శైలిలో పురావస్తు విశేషాదుల గూర్చి పుస్తకములు, పాంప్లెట్లు అవసరమని నేనున్నూ గట్టిగా చెప్పగలను. ఇటీవల జనవరి - మార్చి మాసములలో భారత పురావస్తు శాఖ యూనివర్శిటీలు రాష్ట్ర ప్రభుత్వ పురావస్తు శాఖల సహకారముతో ఆంధ్ర పురావస్తు సంపదపై ముఖ్య ప్రదర్శనలను, తిరుపతి, గుంటూరు, అమరావతి, విజయవాడ మున్నగుచోట్ల నిర్వహించినది. ఈ సందర్భములో ఇంగ్లీషు, తెలుగున కూడ సచిత్రముగా కరపత్రములు ఉపన్యాసముల నిచ్చియుంటిని. పురావస్తు శాఖ ప్రజలకు తోడ్పడుట లేదన్నది సత్య దూరము. అనంతమైన మన (అర్వాచీన) సంస్కృతి, అందున ఆంధ్ర దేశమున, మృగ్యమైన పురావస్తు సంపదను గూర్చి పరిశోధనలు జరిపేందుకు నిరంతర కృషి యవసరము. రాష్ట్ర ప్రభుత్వము పురావస్తు శాఖకూడ (దేశంలో మరే రాష్ట్రమున కూడ యింతటి కృషిచేయుచున్న శాఖలేదని చెప్పగలము). తెలుగున 'పాపులర్' ఎడిషన్స్‌గా పురావస్తు స్థలముల శాసనాదులపై ప్రచురించినది, చేస్తున్నది కూడా! ఇవన్నీ శ్రమతో కూడుకొన్న పనులు. నిరంతర కృషి, సేవా దృక్పథంతో నిస్వార్థంగా చేయవలసిన పనులు. ఏ కొద్ది సంవత్సరములలో అన్నింటినీ చేయలేము కదా!

ప్రాచీన అవశేషములపై మనపల్లె ప్రజలకు చాల గౌరవము, భక్తి ప్రపత్తులు ప్రేమాదరములున్నవి. కాని కొన్ని సంస్థల ముఖ్యంగా యిప్పటి చదువుల - నాగరికతకులోనైన కొంతమంది స్వార్థపరుల "స్కీములకు" లోనై ప్రాచీన శిల్పముల పైన, కట్టడములను వికృతములు చేయ ప్రయత్నిస్తున్నారు. నేను సచిత్ర వ్యాసమున మనవి చేసినట్లు ఇట్టి పనులు చేయువారు చదువుకొన్నవారు మాత్రమే, చూడ వచ్చిన సామాన్య ప్రజ పురావస్తు స్థలములను భక్తితో గౌరవించి చాల జాగ్రత్తగా చూచు కొనుచున్నారు. వారివల్ల దేశ సంస్కృతి - సంపదలు ప్రకాశిస్తున్నాయి. మాకు యెనలేని ధైర్యాన్ని సంతోషాన్ని కలుగ జేస్తున్నారు. కాని చదువు కొన్న కొద్దిమంది అధునాతన నాగరికులు, విదేశీయ నాగరికత వ్యసనాలకు లోనైన పై తరగతి యాత్రికులు మన పురావస్తు సంపదపై చేస్తున్న అఘాయిత్యాలు

అందరూ తెలుసుకొనవలెననే మా యుద్దేశ్యము. ఇన్ని రోజులుగా మొరపెట్టుకొంటున్నా, పేపర్లలో వుపన్యాసములలో, వ్యాసాలలో, చెప్పుచున్నను యిటీవలెనే వరంగల్లులో నొక దేవాలయానికి సున్నపు రంగుపూత ఎందులకు పూసినట్లు? అట్లే అలంపురమున కూడ ఒక రిద్దరు కాపలాదార్లు వీనిని పరిపాలించే బోర్డువారితో తలపడితే మాత్రం మాట చెల్లి తుందా! ఉన్న చట్టం ప్రకారం నిత్య పూజార్చనలు ఈ ట్రస్టీలు హక్కు. కాని యీ పేరుతొ ప్రాచీన వాస్తు శిల్పాలపై చేస్తున్న దురాక్రమణ యింతింతగాదు! ఇది వరలో ప్రభుత్వము యిట్టి స్థలములలో కాపలాదార్లను వుంచలేదు. ఇప్పు డిప్పుడే కొంతమంది చౌకీదార్లుగా అన్ని జాతీయ కట్టడములలో పెట్టడం జరిగినది. కొన్ని సంస్థలు, వ్యక్తుల మఠాలు దేవాలయ ప్రాచీన స్థలములలోని శాసన - శిల్ప సంపదలను స్వలాభాపేక్షతో దేశాన్ని దాటించే ప్రయత్నాలు యెక్కు వగుటవలన మతవైషమ్యాలను మూఢనమ్మకాలను రేకెత్తించేవారి చేతులు పురావస్తు సంపద పై పడకుండా కాపాడవలె ననియే ఈ చౌకీదార్ల నియామకం కొంతమందికి ఇబ్బందిగా వుంటున్నది. చౌకీదార్లు మాన్యుమెంట్లను రాత్రి, పగలు కాపాడుటకు పరిసరముల పరిశుభ్రముగా నుంచుట వీరి కర్తవ్యములు.

పురావస్తు సర్వేక్షణ, టూరిజం శాఖవారు మాత్రమే యిట్టి కార్యక్రమాలను నిర్వర్తించిన చాలదు. కాని ప్రజలకు సౌకర్యం చేయుటలో, మా శాఖలు యెంత మాత్రం వెనుకంజ వేయవు.

భారత ప్రభుత్వ ఆధ్వర్యంలో ఆంధ్రమున 146 చోట్ల జాతీయ ప్రాముఖ్యముగల కట్టడములున్నవి. ఇవిగాక ముఖ్య ప్రదర్శనశాలలు అమరావతి, నాగార్జునకొండ, కొండాపురమున గలవు. అట్లే రాష్ట్ర ప్రభుత్వం పెక్కు దేవాల యాలను, కోటలను, మసీదులను సంరక్షణలో నుంచినది. వీటిలో చాల ప్రాచీన దేవాలయాలు, మసీదులు యెండో మెంటువారు ప్రయివేటు సంస్థలు, వక్ఫ్‌బోర్డుల ఆధీనంలో నిత్యపూజలోనున్నవి. హైదరాబాదులోని సాలార్‌జంగ్ మ్యూజియం బిర్లా మ్యూజియం మొదలగునవి ఆయా సంస్థల మేనేజిమెంటు బోర్డుల స్వాధీనంలో వుంటున్నాయి. వీటి పరిపాలనా విధానము వేరు.

ముఖ్యమైన చారిత్రక పురావస్తు ప్రదేశముల నిర్వహణ బాధ్యత పెక్కు సంస్థలపై నుంటున్నది. ఉదాహరణగా నాగార్జునకొండ ప్రదర్శనశాల గూర్చి వివరింతును. ఇచ్చట భద్రపరచబడ్డ పురావస్తు వాస్తు - శిల్ప సంపద ప్రపంచ ములో మరెక్కడలేదని చెప్పగలను. ఈ ప్రదర్శనశాల సరస్సు మధ్యనున్న చరిత్ర ప్రసిద్ధమైన నాగార్జునకొండపై నుండుట మరొక విశేషము. ఇచ్చట ప్రజల వసతికై క్యాంటీను, విశ్రాంతి గదులున్నవి. కాని కొండను చేరుటకు రెండు లాంచీలు తప్ప వేరే మార్గంలేదు. 15 సంవత్సరాలుగా మనము ప్రజల కందుబాటులో నుండేట్లు లాంచీలను నడపజాలకున్నా మెందుచేత? మూడు కిలో మీటర్ల ప్రయాణానికి తలకు 15 రూపాయలు చెల్లించవలెనట? దేశంలో మరికొన్నిచోట్ల ముఖ్యంగా బొంబాయి చేరువుగానున్న 'యెలిఫెంటా' తీసుకోండి. మోటారు లాంచీలు, బోట్లు సముద్రంలో చాల దూరం పోవలశియున్నది. ఛార్జీ 5 - రూపాయలు మాత్రమే. మరికొన్ని లాంచీలు నడిపి ధర పూర్తిగా తగ్గించి ప్రజలకు మరింత సౌకర్యము చేయవలసిన కనీస ధర్మము (కర్తవ్యమటుంచి) పి. డబ్ల్యు. డి. శాఖ వారిది కదా? భారత పురావస్తు శాఖ యేలాటి చార్జీ లేకుండా ఈ ప్రదర్శనశాలను ప్రజల ముందుంచుతోంది. వేరే సంస్థలు సాలార్‌జంగ్ మ్యూజియం.

మొదలగుచోట్ల ఛార్జీ వున్నది. ఏ గైడు అవసరము లేకుండా అన్ని శిల్పముల వివరములు తెలుపు వివరణ పట్టికలు చరిత్రను విదితం చేయు సూచికా పటములు, తెలుగు - ఇంగ్లీషు భాషలో, కొండపైన క్రిందను యేర్పాటు చేసియున్నాము. ఆంధ్ర ప్రభుత్వము - భారత పురావస్తు శాఖ యీ నాగార్జున కొండను రమణీయ విద్యాస్థలంగా, పర్యటన కేంద్రముగా చేశి సౌకర్యముల కూర్చవలననే ప్రయత్నించుచున్నది. ముఖ్యంగా పురాతన స్థలములు నివాస

స్థలములకు దూరముగా నున్నవి. రాకపోకల సౌకర్యము, విశ్రాంతి గృహములు చేయవలసిన బాధ్యత పెక్కు సంస్థలపై నున్నది సామాన్య - మధ్య తరగతి యాత్రికుల సౌకర్యములులేవు. మన పొరుగు రాష్ట్రములైన, మద్రాసు, కర్ణాటక, మహారాష్ట్రముల జూచి నేర్చుకోవలసిన వనేకములున్నవి. మొట్ట మొదటిసారిగా ఆంధ్రమున దాదాపు 30 - స్థలాలను యాత్రాభివృద్ధికై యేర్పాట్లు చేయవలసిన అవసరమును నొకసచిత్ర వ్యాసముద్వారా కరెంట్ ౖపెమ్స్ - టూరిజం స్పెషల్ వారపత్రిక మార్చి 24 వ తేది సంచికలో "ఆర్కిలాజికల్ మాన్యుమెంట్సు ఆఫ్ నేషనల్ ఇంపార్టెన్స్ అండ్ టూరిజం ఇన్ ఆంధ్రప్రదేశ్" లో ప్రచురితమైనది. ముందు ముందు మంచి పురోభివృద్ధి వుంటుందని ఆశిద్దాము.

ఇటీవల నాలుగేండ్లలో భారత ప్రభుత్వ ఆధీనంలోనున్న జాతీయ కట్టడములలో సామాన్య యాత్రికుల సౌకర్యమునకై తెలుగున - ఇంగ్లీషులో పురావస్తు స్థలముల గూర్చి తెలుపు వివరణ పటముల, గైడు మాప్‌లను ఉంచనారము - వరంగల్లుకోట, గోలుకొండ, చార్మినారు, అలంపురము, నాగార్జునకొండ అమరావతి మున్నగుచోట్లు దర్శింపవలసినవి.

ఇక జీర్ణోద్ధరణ విషయంలో కొంత వివరించవలసియున్నది. ఈ కార్యక్రమం మేము యెనిమిదేండ్ల క్రిందట మా శాఖ పి. డబ్ల్యు. డి. శాఖ వారి ఆధ్వర్యములోను, నిజాము ప్రభుత్వ ఆధీనంలోను వుండినది. కొన్నిచోట్ల వీరు సిమెంటుతో గావించిన మరమత్తులు ఉండవల్లి (గుంటూరుజిల్లా), హనుమకొండ, పాలంపేట (వరంగల్లు), దేవాలయములపై నున్నవి. వాటిని పూర్తిగా తీసివేయ వీలుగాకున్నది. కారణము ప్రాచీన భాగము సిమెంటు అంతర్భాగమై పోయినది. తీసివేయవలెనన్న శిధిలమైన పురాతన వాస్తువునకు అపాయకరముగా తోచినందున, పెద్దపెట్టున పనిచేయజాలకున్నాము. అట్లని వూరకుండలేదు. సాధ్యమైనచోట్ల అట్టివాటిని క్రమేపి తీసివేసి మరల ప్రాచీన వాస్తుశోభ, శైలిలను పునరుద్ధరించు ప్రయత్నంలో వున్నాము. కొన్నింటిని ఎంతో నిపుణతతో, రూఢీగా ప్రాచీన వాస్తు, శిల్ప, మూర్తి లక్షణముల వివరమును నిర్ధారించుకొన్న గాని బాగు చేయుటలేదు. వరంగల్లు దేవాలయ శిఖరాలపై సిమెంటు కుప్పలు పెట్టలేదు. బహుశ హనుమకొండ దేవాలయాన్నుద్దేశించి చెప్పుచున్నాను. అచ్చట దేవాలయ కప్పు తీరు అలాంటిదే. ఇటీవల దేవాలయ శిఖరాలపైన, చుట్టుపక్కల నున్న నూతన కట్టడాలను, సిమెంటు పూతలను తీసివేసి ప్రాచీన వాస్తువును వెలుగులోకి తీసుకొచ్చాము. శ్రీకాకుళం జిల్లాలోని ముఖలింగ దేవాలయములు, బాపట్లలోని భావనారాయణస్వామి దేవాలయము, భైరవకోన (ప్రకాశంజిల్లా) ఉదయగిరి (నెల్లూరు), గుడిమల్లం (చిత్తూరు), హేమావతి (అనంతపూరు), మొదలగుచోట్ల ఎంతో వ్యయ ప్రయాసలకోర్చి భారత పురావస్తు శాఖ ఆగ్నేయ విభాగం వారు జీర్ణోద్ధరణ కార్యక్రమాలను చేసినారు, ప్రతిజిల్లాలో సంవత్సరమున కొక ప్రాచీన పురావస్తు స్థలములోనున్న పెద్ద సముదాయముల పనిచేయ బూనినాము. ఈ జీర్ణోద్ధరణ చాల నిపుణతతో, జాగ్రత్తగ ప్రాచీన వాస్తు రీతిని ఆకళించుకొని శాస్త్రరీత్యా చేయవలసియున్నది. పురావస్తు సంపద సంరక్షణ ఒక మహత్తర జాతీయ కర్తవ్యము. ఇప్పటి ప్రభుత్వములకు ప్రజలకే కాదు మేము బాధ్యులము. రాబోవు తరాలవారికి గూడా! ప్రాచీన శాసనాలు చదువుకొంటే తెలుస్తుంది. పురావస్తు వాస్తువునెట్లు భద్రం చేయవలెనో అట్లు చేయకుండా నిర్లక్ష్యం చేసినవారెన్ని శాపాలకు గురియగుదురో? అట్లే చక్కగా కాపాడి ధర్మరక్షణ చేసినవారికి ఆశీర్వాదాలుగూడ గుప్పించారు.

శుభం



చిత్రము - 1 లూరిస్తాన్ : వినాయకుడు క్రీ పూ. 12-వ శతాబ్ది



చిత్రము - 2 తేర్ : ఉస్మానాబాద్ జిల్లా, వినాయక ప్రతిమలు. క్రీ. శ. 2వ శతాబ్ది



చిత్రము - 3  అమరావతి : ఉష్ణీ ఫలకము - మాలావాహకుడుగా వినాయకుడు తదితర దేవతలు
క్రీ. పూ. 2 వ శతాబ్ది



చిత్రము - 4  అమరావతి : ఉష్ణీషము - వినాయకుడు - వైనాయకి



చిత్రము - ౫ అమరావతి : ఉష్ణీషము. వైనాయకి, కుబేరుడు



చిత్రము - ౬ అమరావతి : ఉష్ణీషము. లక్ష్మీదేవి.



చిత్రము - 7 (A) పెద్దపేగి : కాల్చిన మట్టి వినాయక ప్రతిమలు క్రీ. శ 5 వ శతాబ్ది



చిత్రము - 7 (B) పెద్దపేగి : వినాయకుడు



చిత్రం - 8 చేజర్ల : దంతిముఖస్వామి,
క్రీ. శ. 5-వ శతాబ్ది



చిత్రము - 9 పితికాయగుల్ల : వినాయకుడు
క్రీ. శ. 7-వ శతాబ్ది.



చిత్రము - 10 పెద్దవేగి వినాయకుడు. క్రీ. శ. ౯-వ శతాబ్ది



చిత్రము - 11 గుడిమల్లం : గుహ్యుడు, క్రీ. పూ. ౨-వ శతాబ్ది.



చిత్రము - 13 బార్హుత : వేదిక స్తంభముపై కుబేరయక్ష క్రీ. పూ. ౨-వ శతాబ్ది



చిత్రము - 14 బార్హుత : వేదిక స్తంభము, గణము. క్రీ. పూ. 2-వ శతాబ్ది



చిత్రము - 15 ధూళికట్ట : యక్ష. క్రీ. పూ. 2-వ శతాబ్ది



చిత్రము - 16 గుడిమల్లము : సవేదికలింగము. క్రీ. పూ. 3-వ శతాబ్ది



చిత్రము - 17 (A)   గుడిమల్లము : లింగాగ్రముపై రుద్రయజమాన క్రీ. పూ. 3-వ శతాబ్ది.



చిత్రం - 17 (B)   గుడిమల్లము : పీఠములు, గుహ్యాని పాదముల రూపము క్రీ. శ. 3-వ శతాబ్ది



చిత్రము - 18 (A) గుడిమల్లము : వెండి నాణెము
క్రీ పూ. 3-వ శతాబ్ది





చిత్రము - 18 (B) ఉజ్జయిని :
నాణెములపై లింగము, వృక్ష చైత్యము.



చిత్రము - 19 గుడిమల్లము : మేక, పంది పొమాకలు
క్రీ. పూ. 3-వ శతాబ్ది.



చిత్రము - 20 మధుర : శివలింగము చుట్టును వేదిక, పైన వృక్షము. క్రీ. పూ. 1-వ శతాబ్ది.



చిత్ర - 22 (C) అమరావతి ; చతుర్ముఖ లింగము సద్యోజాత



(D) వామదేవ క్రీ. శ. 2-వ శతాబ్ది



చిత్రము - 24 A) మానసార, శివ క్రీ. శ. 4-5 వ శతాబ్ది



చిత్రము - 24 (B) మానసారశివ. వామభాగము శిరోలంకరణ
క్రీ. శ. 4-5 వ శతాబ్ది



చిత్రము - 25 మాండల్ శివ ప్రతిమ. వాకాటకకృతము.
క్రీ. శ. 4-6 వ శతాబ్ది.



చిత్రము - 24 (C) మానసారశివ. ఊర్ధ్వభాగము శిరోలంకరణ.




చిత్రము _ 26 పాలెల్: సప్తస్వరసుందరీవ. క్రీ. శ. 6_వ శతాబ్ది.



చిత్రము - 27 (A) పెద్దవేగి : సోమాయ క్రీ. శ. 5-వ శతాబ్ది



చిత్రము - 27 (B) అరలగుప్ప : సోమాయ.. క్రీ శ. 8-వ శతాబ్ది



చిత్రము - 29 (A) పెద్దవేగి : పంచలింగములు క్రీ. శ. 5-వ శతాబ్ది



29 (B) పెద్దవేగి : నాగదేవత క్రీ. శ. 5-వ శతాబ్ది



29 (C) పెద్దవేగి : కాలభైరవుడు క్రీ. శ. 6-7 వ శతాబ్ది






చిత్రము - 30 పెద్దవేగి: వేంగిపుర దేవత. కోట శిథిలములు



చిత్రము - 31 కీసరగుట్ట: ఇటుక దేవాలయములు క్రీ: శ. 5-వ శతాబ్ది



చిత్రము - 32 కీసరగుట్ట : కొండపైని లింగ పీఠములు. క్రీ. శ. ౫-వ శతాబ్ది



చిత్రము - 33 మధుర : యక్షుడు. లింగపీఠ ...నకు, దీపమిడుట. క్రీ. శ. 2-వ శతాబ్ది.



చిత్రము - 34 కీసరగుట్ట : శక్తిఫలకము క్రీ. శ. 5-వ శతాబ్ది.



చిత్రం 37 (A) - కీసరగుట్ట : మృణయ కలశము.
క్రీ. శ. 5-వ శతాబ్ది (పశ్చిమ ముఖము)



(B) కీసరగుట్ట : మృణ్మయ కలశము. క్రీ. శ. 5-వ శతాబ్ది
(ఉత్తర ముఖము)



చిత్రము - 38 మధుర : సోంఖ్: గజపృష్ఠాకార దేవాలయము. క్రీ. శ. 1-వ శతాబ్ది



చిత్రము - 39 మధుర : వేదిక స్తంభములపై యక్షిణులు. క్రీ. శ. 1-2 వ. శతాబ్ది



చిత్రము - 40 మధుర : కార్తికేయస్వామి
క్రీ. శ. 3-వ శతాబ్ది



చిత్రము - 41 మధుర : దేవతలు. క్రీ. శ. 3-వ శతాబ్ది



చిత్రము - 43 నాదర్గి: హరిహరుడు, క్రీ. శ. 5-వ శతాబ్ది



చిత్రము - 44 బాదామి : (గుహ - III) హరిహరుడు. క్రీ. శ. 7.వ శతాబ్ది



చిత్రము - 48 భైరవకొండ: హరిహరుడు క్రీ. శ. 7-వ శతాబ్ది.



చిత్రము - 17 కూడవల్లి : హరిహరుడు. క్రీ. శ. 8-వ శతాబ్ది



చిత్రము -48 మహాబలిపురము : ధర్మరాజరథము. హరిహరుడు. క్రీ. శ. 7-వ శతాబ్ది.



చిత్రము - 49 (A) నాగార్జునకొండ : కార్తికేయ.
క్రీ. శ. 3-వ శతాబ్ది.



49 (B) నాగార్జునకొండ : కార్త్తికేయ
వెనుకభాగము. క్రీ. శ. 3-వ శతాబ్ది.



చిత్రము - ౬౦ నాగార్జునకొండ : దేవసేన. క్రీ. శ. ౩-వ శతాబ్ది.



చిత్రము - 51 నాగార్జునకొండ ; కార్తికేయ కాంస్య విగ్రహము. క్రీ. శ. 3-వ శతాబ్ది






చిత్రము - 52 నాగార్జునకొండ : కార్తికేయ. క్రీ. శ. 3-4వ శతాబ్ది



చిత్రము - 53 చేజెర్ల : కార్తికేయ క్రీ. శ. 4-వ శతాబ్ది.



చిత్రము - 54 ఆలంపురము : కార్తికేయ. క్రీ. శ. 7-వ శతాబ్ది.



చిత్రము - 55 చైనా : దాటాంగ్ గృహ -౮- కార్తికేయ క్రీ. శ. 465-494



చిత్రము - 56 చైనా : దాటాంగ్ గుహ - ౮ - మహేశ్వరుడు క్రీ శ. 465-494



చిత్రము - 57 గోవిందరావుపేట : వరాహవిష్ణు క్రీ. శ. 4-వ శతాబ్ది.



చిత్రము - 58 (A) గోవిందరావుపేట : వరాహ - భూదేవి. క్రీ. శ. 4-వ శతాబ్ది.



చిత్రము - 58 (B) గోవిందరావుపేట : వరాహ శేషనాగము క్రీ. శ. 4-వ శతాబ్ది



చిత్రము - ౮౧ మాజేటి శక్తి ఫలకము : క్రీ. శ. ౫-వ శతాబ్ది



చిత్రము - 61 కూడలి - సంగమేశ్వరాలయము - నదుల సంగమము



చిత్రము - 62 కూడలి - సంగమేశ్వరాలయము - ఆలయ ఖండిక
( దక్షిణ ముఖము )



ఛాయా చిత్రము - ౬౩ కూడలి - సంగమేశ్వరాలయము - అలంపురమున పునర్నిర్మితమగుచున్న తీరు
శిఖర నిర్మాణము.



చిత్రము - 84 కూడలి-సంగమేశ్వరాలయము-పునర్నిర్మితములోనున్న శిఖరము ఆమలకముపై దృశ్యము.



చిత్రము-85 కూడలి-సంగమేశ్వరాలయము - పునర్నిర్మితమైన ఆలయము సంపూర్ణ దృశ్యము.



చిత్రము - ౪౪ కూడలి - సంగమేశ్వరాలయము - పునాదులందు లభించిన మరకత లింగము



చిత్రము - 67 పాపనాశి - ఆలయము - ఎఫ్



చిత్రము - 68 పాపనాశి దేవాలయము-ఎఫ్-శిఖర భాగము తీసిన దృశ్యము



చిత్రము - 69 పాపనాశి - దేవాలయము - ఎఫ్ - గృహపిండి మధ్యగా స్థాపితమైన కలశము.



చిత్రము - 70 పాపనాశి ఆలయముల లభించిన కలశములు


భారతదేశం
0 100 200 300 కి.మీ.
ఢిల్లీ
మధుర
నగరి
ఉజ్జయిని
బేస్‌నగరము
సారనాథ
బుద్ధగయ
గంగానది
కలకత్తా
బరోడా
కారవాన్
జూనాగఢము
నర్మదానది
ప్రకాశ
తపతినది
మహానది
నాగపూర్
పితల్‌ఖోరా
ఔరంగాబాద్
బొంబాయి
పూనా
కోటిలింగాల
ముఖలింగము
ధూళికట్ట
హైదరాబాద్
గోదావరి
కృష్ణానది
కేసరపల్లి
మస్కి
తుంగభద్ర
ఆలంపురము
బనవాసి
బ్రహ్మగిరి
సిద్ధవటము
కలకాడ
చంద్రవల్లి
తిరుపతి
గుడిమల్లము
మద్రాసు
తిరువణ్ణామల
చిదంబరము
కావేరిపట్నము
రామేశ్వరము
బంగాళాఖాతము
1. వీరాపురము
2. శ్రీశైలం.
3. సిద్ధేశ్వరము
4. త్రిపురాంతకము
5. నాగార్జునకొండ
6. మూడుగుల
7. పొందుగుల
8. కునిదెన
9. డేజెర్ల.
10. అమరావతి.
11. కాళహస్తి.
12. తొండమనాడు.
13. తిరుత్తని.
14. కాలంబక్కము.
15. ఒరగడము.
16. తిరుక్కళికుండ్రము

చిత్రపటము - 1




| | |
|---|---|
| 1. సప్తర్షిటీల (గుహావిహారము) | 7. చౌబారా (మధురావన) |
| 2. ధ్రువటీల | 8. చౌరాసి టీలా |
| 3. జామల్పూర (హువిష్క-విహారము). | 9. మహావిద్య టీలా |
| 4. కంకాళిటీల (వోద్వస్తూపము) | 10. అంబరీష టీల |
| 5. భూతేసర | 11. ఈసాపుర (హంస-గంజ్) |
| 6. కటారా (యగావిహారము) | 12. గాయత్రి టీల |




RUDRA (Ekādaśa-Mukha)
From : PEDDAVEGI

చిత్రపటము - ౩.


శ్రీశైల ప్రాంతముల జలాశయమున మునిగిన
దేవాలయ స్థానములు
రంగాపురము
గుమకొండ
కొల్లాపురము
భవనాసి నది
సిద్ధేశ్వరము
సంగమేశ్వరము
కృష్ణానది
శ్రీశైలము
వీరాపురము
కూడవల్లి
సాతానికోట
తుంగభద్రానది
అలంపురము
నందికొట్కూర్
కర్నూలు

చిత్రపటము - 4

# సంగమేశ్వరాలయము
## కూడలి








భూమానము




ఆలయరేఖాచిత్రము




ప్రాకార చిత్రము
ఖండిక అ-అ

## సంగమేశ్వరాలయము, కూడలి
### ఖండిక, శిఖరము, గర్భగృహము క్రిందపునాదులు




మానము ... మీటర్లు

చిత్రపటము - ౮

## సంగమేశ్వరాలయము, కూడలి

### మరకత లింగము

సెం.మీ.




ముఖస్తము



వెనుక

చిత్రపటము - 8




పాపనాశి ఆలయముల, గ్రీవ-శిఖరములందు లభించిన
వాస్తు కలశములు



చిత్రము - 12 బార్హుత : వేదిక స్తంభముపై గుహ్యాడు. క్రీ. పూ. ౨-వ శతాబ్ది.



చిత్రము - 21 (A) అమరావతి : చతుర్ముఖ లింగము తత్పురుష



(B) అఘోర క్రీ. శ. 2-వ శతాబ్ది.



చిత్రము - 23 అమరావతి : నంది. క్రీ. శ. 2-వ శతాబ్ది



చిత్రం - 28 పెద్దవేగి : ఏకాదశముఖరుద్రుడు క్రీ. శ. 6-7 వ శతాబ్ది



చిత్రము - ౩౮ (A) కీసరగుట్ట ; మృణ్మయకలశము క్రీ. శ. 5-వ శతాబ్ది
(ఆగ్నేయ ముఖము)



(B) కీసరగుట్ట : మృణ్మయ కలశము క్రీ. శ. 5-వ శతాబ్ది.
( దక్షిణ ముఖము )



చిత్రము - 48 మధుర : హాలిహరుడు. క్రీ. శ. 2-వ శతాబ్ది



చిత్రము - 59 (A) గోవిందరావుపేట : నరసింహ.
క్రీ. శ. 4-వ శతాబ్ది.



చిత్రము - 59 (B) గోవిందరావుపేట : నరసింహ.
క్రీ. శ. 4-వ శతాబ్దీ (ప్రక్క భాగము)